మండలముగలిగి, యొకయంకంబున వనితారూపకంబును. రెండవయంకంబున నొక చిన్నిపాపయును గలిగి యొక యౌవన పురుషుడాతని కంటబడియెను. అప్పుడాశ్చర్యకుతుకుడు వారి చెంతకేగి, అయ్యా! మీరెవరు! యీదురవస్థకేల పాల్పడితిరని యడిగెను. దానికి బ్రత్యుత్తరము రానందున మరల నయ్యా! మీరెవరు? పిలిచిన బలుకరేమని యడుగ దానికిగూడ వాగ్రూపమైన నుత్తరము రాలేదుకాని యాపురుషుడు తన పెదవులను కొంచెము ప్రక్కకొత్తి నాలుక నిటునటును గదప, వీరలు వడగొట్టియున్నారని గ్రహించి గుఱ్ఱముపై దోలుసంచిలోనున్న జలంబును నొక పాత్రికచే గ్రహించి యానీటిచే నాపురుషుని ముఖంబును దడిపి, మరల కొంత జలంబునుదీసి పెదవులనుదడిపి, కొంచెము కొంచెము నోటబోయ, గొంతవడికి నాతని కంఠనాళ మార్ద్రమై నాలుక మెత్తబడి సుస్వరంబుతో నాయనా! జలము జలమని చేయిసాచెను. అంత నాయువకుడు తనచేతనున్న జలపాత్రికను యాతని కందీయ దాని నందుకొని యందలి జలంబునంతను గడగడ త్రాగి యొక్కనిమిషమట్లే కనులుమూసి, మరల తెఱచి నాయనా బ్రతికించితివి అయ్యో! నా బిడ్డ! నా భార్య! వీరల గతి యేమి? కదలుటలేదు, మాటలేదు, యింకేమున్నది. నాయనా! ప్రాణములున్న బ్రతుకు తెలుపవలయును తండ్రీ! యని దీనాతిదీనస్వరంబుతో వాపోవ, నాయువకుండంతయు పూరితశోచనుండై పరిమ్లాన హృదయుండై, మారుపలుకక

నుజల గొంత జలంబును దీసి యాతని భార్యముఖంబున జిలికించి, యాంధ పురుషునికి జేసిన యుపచార మంతయును జేయ మృదువాంగియగు నా కోమలగాత్రి, యబలయగుటచే జాల కాలముపరకును తెలివినందలేదు. కాని కొంతవడికి కర్మోపచారంబువలన గనులుదెఱచి పెదవులువిప్పి నాలిక నాడించుటచే సంతోష స్వాంతుండై అయ్యా! ప్రాణభయములేదు. ప్రాణభయములేదు. నీభార్య బ్రతికినది. ఈ యుదకమును నామెనోట గొంచెము కొంచెము బోయుచుండుమని జలపాత్రను యాతనికందిచ్చి గుడ్డముపై వెండితాబేటి కాయలో నున్న పాలనుదీసి పురుషుని వామాంకమునబై చైతన్యశూన్యుడై పరుండియున్న నాచిన్ని పాపని వదనంబునను శ్రోత్రంబులయందును, నేత్రములయందును కొంచెము కొంచెముగా బోయుచు మధ్య మధ్యను నాడినిబరీక్షించుచు, జలార్ద్ర వస్త్రముచే నెమ్మదిగా విసరుచు ననేకవిధముల నుపచారము గావించుచుండెను. కాని ఫలితమేమియును కానుపించుటలేదు. నిరాశాహృదయముతో గొంతతడవట్లె నిరీక్షించి, పైనుండి గాడ్పు లెండ శిశువుపై వీచుచుండుటయే యీ ఫలశూన్యతకు గారణంబై యుండునని యోచించి యీవల నొకవస్త్రమునుబఱచి పురుషాంకమునందున్న నాబాలుని నెమ్మదిగ దీసి యా వస్త్రమునుపై బరుండబెట్టి గుడ్డముపై వ్రేలాడుచున్న గొడుగును దీసి యాశిశువునకు నీడ వేర్పఱచి, యొక తడిగుడ్డ గొడుగు చుట్టునుగట్టి మాటిమాటికి నీటిచే దడుపుచు శిశు వదనమ

క్షీరబిందువులను వేయుచుండ శీతోపచారంబుల శిశువు స్మృ
తిఁజేరి కనుఁదెఱచి నాలుకఁ గదపెను. యువకుని యానందమేమని
చెప్పనగును. పరిఫుల్లవదనుఁడై యానంద నిశ్వాసమును విడిచి
“అయ్యా! బిడ్డ బ్రతికినది. కనులువిచ్చి చూచుచున్నది. పాలను
దాగుచున్నది. దుఃఖముడుగుము. నీ భార్యయెట్లున్నది?” అన
నావృద్ధుఁడో యాపద్బాంధవా! నీదయవలన నాభార్యకూడ
సేదదేరినది. నయముంచి మఱలకొంత జలమీయుఁడననాయు
వకుఁడట్లొనర్చెను. దానిం ద్రావి యాయబల నెమ్మదిగ లేచి
కూర్చుని “అయ్యో! నా బిడ్డ యెక్కడ! నాథా! నా బిడ్డ!
బిడ్డ!” అననాయువకుఁడు, “అమ్మా!విచారింపకుము. మీపుణ్య
లేశమునకు భగవదనుగ్రహముతోడై నీ బిడ్డయు నీ భర్తయు
నీవును గూడ పునర్జీవితులైతిరి” అన నంతలో గాఢముగనిడనున్న
నా శిశువు కెవ్వనయేడ్వ, యువకుఁడా శిశువునందుకొని తల్లి
కందిచ్చెను. ఆసాధ్వి బిడ్డనందుకొని హర్షాశ్రువులచే బిడ్డను
నడుపుచు, ముద్దిడి యొడిలో నిడుకొని, హృదయాంత
రాళమునుండి దుఃఖముపై కుబుకుటచే “హా! దైవమా! మాకి
ట్టిపాట్లు పెట్టితివి. స్థానభ్రష్టులం జేసి యీ పెను యెడారిలో
నేలపాలుజేయ నుంకించితివి! నీ కేమి యపకృతి గావించితిమి?
నీకు నివేదించని యొకకణమైనను నోట వేసికొనమైతిమి.నిన్ను
బూజించనిదే యొక పువ్వైన ధరింపమైతిమి. శయ్యనుండికను
లవిచ్చి నీరూపదర్శనమును గావింపనిదే యితరమేమియును
జూడమైతిమి. సుతాపేక్షను మాంధాతలఁ జేసి మాబోంట్ల నిర

పరాధుల నిలువెడల గొట్టించుట నీ కేటిన్యాయము. అతిదుఃఖం చుచుండ భార్యను జూచి పురుషుఁడు, "ప్రాణేశ్వరీ! దుఃఖావేశముచే భగవంతునేల దూఱెదవు. కర్మఫలమునకు భగవంతుని దూరనేల? ప్రాణేశ్వరీ! ఈ పుణ్యపురుషుని దిలకింపుము" అని యాయాశ్వికు నుపలక్షించి, "యీతఁడు మిక్కిలి పుణ్యమూర్తి. ఈతనివలననే మనకుటుంబము పునరుజ్జీవితమయ్యెను. మన మీతనికి ఋణము మీ లోకములో నీ జన్మతో దీర్చుకొనలేము. ఓవీరాగ్రణీ! నీవు మహావీరునివలె గానంబడుచున్నావు. నీ వెల్లెడలను విజయమునుగాంచి మహాయశంబును గణింతువుగాక. నాయనా, నీ పేరెయ్యది? నీ వెవ్వండవు. ఎటకుఁ బోవుచున్నాఁడవు. చెప్పిన నపాయంబులేదేని విన గోరుచున్నాను.

యువకుఁడు—అయ్యా, నేను ప్రతాపరుద్రునిసుప్రసిద్ధ సేనానియగు సింగమనాయని బుత్రుఁడను. నా పేరు మాధవుఁడు. రేపు సార్వభౌముని జన్మదినంబగుటచే నేకశిలానగరంబునకు బోవుచున్నాను. నా అదృష్ట వశంబున నీ ప్రయాణములో మీసేవ లభించినది. మీ యవస్థ జాలదయనీయమైయున్నయది. మీ రెచ్చటనుండి వచ్చుచు నీ యెడారి నీయవస్థకుఁ బాల్పడితిరి.

పురుషుఁడు—ఓవీరసింహమా! నేను జైన బ్రాహ్మణుఁడను. నా పేరు భీమణుఁడు. ఈ సాధ్వి నా భార్య. ఈబిడ్డ నా పుత్రిక. మా కేక శిలానగరము కాపురము. సార్వభౌమునకు

మా మతమునకై గిన్కనొందుటచే గుణంబులనిన్ గృహం బును విడిచి పరదేశంబులకుఁ బోవుచు నేని యెవ్వరిలో నీయవ స్థకుఁ బాల్పడితిని. అనిపలుక, విని, మాధవుఁడు తలయూఁచెను. ఇంతలో సూర్యుఁడు చరమగిరిని సమీపించుటయు, గాడ్పు లెండ కొంచము శాంతించుటయు గలిగెను. అంతట నామా ర్గమునుండి పశ్చిమంబుగా నొక బండి పోవుచుండుటయు చూచి యాబండివానిని బిలిచి వానిచేతిలో నొక బంగారు నాణె మునుంచి యాస్త్రీని కుటుంబమును బండిపై నెక్కించి "ఓపతివ్రతో త్తమా! యీ బండివాఁడు మిమ్ములను గమ్యస్థానమునకుఁ గొనిపోయి విడుచునని పలికి తన దారిబత్తెమునకై తెచ్చు కొనిన గోధుమపిండియు శర్కరయును వారలకొసఁగి బండి సాగినవెనుక దాను తన శ్వేతాశ్వము నధిరోహించి యేక శిలానగరోన్ముఖుండై పోయెను.

---

## రెండవ ప్రకరణము.

---

“హా! దైవమా! ఇపుడు నే నెటకేఁగుదు నెందుఁ జొత్తు దిక్కెయ్యది? ఎవ రాదరింతురు. ముక్కుపచ్చలారని పసి పాపను జంకనిడుకొని వలదువలదని పలుతెఱంగుల బోధించి నను వినక పతిసేవయే పావనంబని పతియే దైవంబని నా వ న్నింటి మత్పదానుగయై యీ సాధ్వి యీయాపదలో నాతో గూడ గడునిడుమల గుడుచుచుండెను. సుకుమారిగాను

మాన్యంబులును గృహంబులును నా పాపవుఁ బాషండుల పరమయ్యెను. పరమతాసహిష్ణులగు నా ముష్కర జన్నిగొట్టులు, జైనమతమును నిర్మూలింప బద్ధకంకణులై, మహారాజును వీరశైవునిగ నొనరించి, జైనులను దేశమునుండి వెడల గొట్టించుచుండిరి. హా! దైవమా! జైనుల కెట్టి యిక్కట్టు నాటిల్లె. జైనుండనగు కతంబున నాకింతగతి పట్టె. వినగడవనైన క్రౌర్యమునుగని నీయబల, మాతృదేశంబును, నాత్మబంధువులను, నాత్మమిత్రులను విడనాడి దుఃఖంబునఁ గష్టపునిండఁ దొంగియైనదినక, యీ దీర్ఘప్రయాణమున నాతోఁ గడునిడుములఁ గుడువవలసి వచ్చెను. లేక లేకఁ బుట్టిన నీ పసికూన వాడినత్రియై యున్నది. హా! పరితాపకుపరి సార్వభౌమా! చిరకాలమునుండియు నేయిక్కట్టుల నెఱుఁగక యాలుబిడ్డలతో సుఖంబుగఁ గాపురముసేయు పంచువంటి మా సంసారమును పరదేశముల పాలుచేసి పలుభాములఁ బెట్టుచుంటివి. మంత్రవాదుల కుతంత్రములవలన, బ్రాహ్మణులు గావించిన మాయమంత్రంబు లెఱుంగక, మా కంటె బ్రాహ్మణులు శక్తిగలవారనియు, జ్ఞానసంపన్నులనియు విశ్వసించి, మామత గ్రంథంబుల నగసులఁబెట్టించి మామనుజులను మాన్యంబులను నాక్రమించుకొని, యీముష్కరులైన విప్రులకు దారవోసితివి. ప్రాణంబుల యందుగాఁ దీపిచే మాగ్రంథములతోఁ బాటగ్నిం బడనేరక మాలుబిడ్డలతో నీవగిది జీవచ్ఛవంబులమై, బ్రతికియుంటిమి. హా! చక్ర

నది. నలుదెసల గాఢాంధకారము గ్రమ్మియుండెను. మనిషి
మొగము మనిషికి గనుపించుటలేదు. ఇప్పటి బండిబాట మెట్ట
ప్రదేశమగుటచే నెగుడు దిగుడుగా బండి గుభిల్లు గుభి
ల్లను ధ్వనితో పడుచు లేచుచు నతికష్టమున నెమ్మదిగా
బోవుచుండెను. అట్టి భయానకమగు గాఢాంధకారయుత
నిశీథమున మనభీమునకిదే ప్రథమ ప్రయాణము. మధ్యమధ్య
నక్కకూతలు తప్ప మరేశబ్దమును వినబడుటలేదు. ఆకూతలు
కూడ మరింత భయోత్పాతమును గర్ణకఠోరమునై యుండె
నేగాని, మనశ్శాంతికిం గారణములగుటలేదు. మగతనముగల
భీమునికే భీతియొదవుచుండ నబలల విషయములో జెప్పవ
లసినదేమున్నది. భీముని భార్య భీతచిత్తముతో, "నాథా!
యీరాత్రి గడచుటెట్లు? నాయొడలు కంప మొందుచున్న
యది. మనసు కొట్టుకొనుచున్నయది. ఏమిసేతును నాథా!
యని గడగడ వణంకుచుండ భీముడామెను చేరదీసి యంగం
బులనిమిరి, యొడిలో నుండబెట్టుకొని, "ప్రాణేశ్వరీ! నీజీవి
తేశ్వరుడు జీవముతో నీచెంత నున్నంతకాలము నీకేమిభ
యము? నడివేసంగిని మిట్టమధ్యాహ్న మప్పుడెడారిలో భగ్గు
మను నెండలో సర్వాంగసంతప్తవై పిపాసార్తవై ప్రాణా
క్రమణ సమయంబునగూడ భీతినిసూచింపని నిన్నీ యంధ
కారమేమి సేయును? ఈశృగాల రవంబులేమి సేయును!
ఆ వీరపురుషుని కృపాతిశయమున మృత్యుముఖంబునుండి
బ్రతికిబండిలోబడితిమి. ఈయంధకారముట్టికట్టుగొనియూగ

లొండదు. ఈరాత్రి చిరస్థాయినికాదు. చీకటివెనుక వెలుగును, రాత్రివెనుక బవలును రాకమానదు. పొట్టకోసమే జీవించువారలకు భయముగాని యాత్మాన్వేషణముకై జీవించువారి కేటిభయము? అని భీమనుడు భార్యను శాంతవాక్యములచే నాశ్వాసించుచుండ బండి నడుమార్గమున హఠాత్తుగ నాగెను. బండివాడు మొత్తములనుండి క్రిందికి దుబ్బునబడి అయ్యో! చచ్చితినని యఱచెను. భీమనుడుద్వేగమున నోడినుండి భార్యనుడించి ఏమది? ఏమనుజు? ఏమిజరిగినదని పలుకుచు గుభాలున నేలకుఱికెను. క్రిందకుఱికినదే తడవుగ నలుగురు మనుష్యులు భీమనునిబట్టి కాలుసేతులు బంధించి యావలకు లాగికొని పోవుచుండ నయ్యో! దొంగలు దొంగలని బిగ్గఱగ నఱచెను, ఈయరణ్యరోదనము వినువార లెవ్వరు? బండివాని మాట సాఱిగ వినబడ లేదు. ఇంతలో నొకడు కాగడా వెలిగించి బండివెనుక నిలచెను. చీకటంతయుబోయి పట్టపగలైనది. ఇద్దఱు బండిలోనికెక్కిరి. భీమనునిభార్య యిదివఱకే భయభ్రాంతయై యుంటచే దెబ్బమీద దెబ్బ పడినట్లీ యాగంతుక భయోత్పాతముచే స్మృతిదప్పి పడియుండెను. బండిలోనున్న వారామె మేనంతయును బరీక్షింప, గళమున మంగళ సూత్రమును, చెవుల గుద్దులును, చేతుల గంకణములును, పాదముల వెండికడియములును, మాత్రమే యుండెను. మరియు నొకప్రక్కను రెండు గుడ్డలతో గట్టిన మూటలుండెను. అవి విప్పిచూడ నొకటిబట్ట

౦ముూటయు, నొకటి పుస్తకముల మూటయునై యున్నవి. భీమణుడు దిశలు బ్రద్దలగునటుల దొంగలు దొంగలని యఱచుచునేయుండెను. ఈకేకలకు బదులుగా నెచ్చటనుండియో వచ్చె, వచ్చె, యను కేక లొక్కుమ్మడి దిశలుబ్రద్దలగునటుల వినవచ్చెను, బండిలోనున్న వారిప్రతిశబ్దమును కఱరనేలకు జేకిరి. ఇంకను ప్రక్కనున్నవా! రారేయి? ఎవరోపఱుగిడి వచ్చుచున్నారు. పాఱిరండిరా? యన నందరును పరుగునకు దొడఁకొనిరి. ఇంతలోవచ్చె,వచ్చె, యను ధ్వనులును వానితో బాటు టకటక ధ్వనులును; వీనితోబాటు బ్రంహాండమైనవెలుగును, క్రమ క్రమముగ సమీపించియొక్కుమ్మడినిబండిని సమీపించెను. సమీపించుటయు వెంటనే పదుగు జాశ్వికులు చేతవెలుంగుచున్న దివిటీలతో గుఱ్ఱములనుండి గుభాలున నేలకుఱికి చూచుసరికి బండివాడునోట గుడ్డలు కుక్కబడి బంధింపబడి యుండెను. భీమణుడు బంధింపబడెను గాని నోట గుడ్డలు కుక్కబడియుండలేదు. అప్పుడాయాశ్వికులు వారలను బంధవిముక్తులంజేసి యేమిజరిగినదనియడుగ భీమణుడయ్యలారా! ఎవరో దొంగులుమమ్ము ముట్టడించి బంధించివైచిరి. ఇప్పుడే యీదెసకు బాఱిపోయిరి.అయ్యో! బండిలో నాభార్య బిడ్డలేమయిరో గదా! యన నందరును గలిసి బండి యొద్దకుబోయిరి. భీమణుని భార్య స్మృతిదప్పి పడియుండెను. కొంచెము చలువనీటిని ముఖమునజల్లగాఁ గొంతవడికామె తెలివినంది నాథా! యేమయితి రేమయితిరని తోటు

బాటుతో లేచెను. భీమణుడు భయములేదని యోదార్చెను. అప్పుడా యాశ్వికులలో నాజానుబాహుండగు నొక పురుషుడయ్యా! మీరెచ్చటినుండి వచ్చుచున్నారు? ఈయవస్థకేల పాల్పడితిరని యడుగ భీమణుడో మహానుభావా! నేను జైనబ్రాహ్మణుడను. మాస్వస్థాన మేకశిలానగరము. సార్వభౌమునకు మామతంబుపైఁ గినుకవొడముటచే భార్యాపుత్రాదులతో గృహబంధు క్షేత్రంబుల విడిచివచ్చుచుండ నీయడవిలో నేడు గాడ్పుటెండకుజిక్కి విస్మృతులమై పడియుండ మాధవరాయలనువీరపురుషునిమహోపకారంబున బ్రతికితిమి. మమ్మాపుణ్యమూర్తి మాకీబండినిజూపి యెక్కించెను. మేమీ బండిపై వచ్చుచు నీరాత్రి మాదురదృష్టమున నీ దురవస్థకు లోనైతిమి. తుదకు మీసహాయమున నీ విపత్తునుండి బయటఁపడితిమి, అయ్యా! తమయుపకారము చిరస్మరణీయము. దయయుంచి తమపవిత్రనామమును విననుపాయము లేదేనిఁ జెప్పప్రార్థితులము. అనుటయు నావీరపురుషుడు విప్రోత్తమా! నాపేరు సింగమనాయుడు. నేను ప్రతాపరుద్రసార్వభౌముని సేనానిని, మాధవుడు నాకుమాతులుడే! రేపు సార్వభౌముని జన్మదినమున కోరుగల్లు తొందరగా బోవుచున్నాము. ఇప్పుడీముచ్చులను వెంటాడినచో సకాలమున కోరుగల్లు చేరలేము. మీకిద్దరాశ్వికులను సహాయమిచ్చెదను. మీబండితోగూడ వారువచ్చి మిమ్ముల గమ్యస్థానమున విడుచునని పలికి, యిద్దరాశ్వికులనిచ్చి మిగిలిన యాశ్వికులతో సింగమనాయుడు డోరుగల్లునకు బోయెను.

## మూడవ పరిచ్ఛేదము

పాఠకులొక్కమారు సింహావలోకన మొనరించినచో సుప్రసిద్ధ వీరపురుషానేక విరాజితంబగు నేకశిలానగర చరిత్రమును దెలిసికొన గలుగుదురు. పదమూడవ శతాబ్దమున గుర్తింప గలుగుదుమేని యీమహానగరముయొక్క యున్నతిని గ్రహింపగలుగుదుము. అక్కాలంబున నుత్తర హిందూస్థానమునం దనమ్మరాజులకు రాజధానియై సుప్రసిద్ధినిగాంచియున్న ఢిల్లీనగరంబుకన్న నైశ్వర్యప్రభావంబుల సహస్రవిధంబులమిన్నయై దక్షిణ హిందూస్థానంబునగల నగరములలోనెల్ల మేటియై, శత్రువులకును దుష్టవర్తనులకును దుర్గమనశక్యంబై యేకశిలానగరము మిక్కిలి వన్నెకెక్కి యుండెను ఎటుజూచినను దేవాలయ గోపురశిఖర భాగంబులు స్వచ్ఛస్నిగ్ధములై వినువీధినంటి నీలనభంబను వితానముపై స్వర్ణరుచుల బ్రసరింపజేయుచు, నేత్రములకు విందొనర్చుచుండెను. సౌధాగ్రంబులు మణిమయ హేమకుంభంబులతో నలంకరింప బడియున్నవి. దేవాలయములయందలి ధ్వజస్తంభాగ్రములు నగరమున కావల నాలుగు క్రోశముల మేరవరకును గోచరమగుచుండెను. ఆంధ్రవీరులకు బుట్టినిల్లనదగు నీ మహానగర విభవమును బూర్తిగాజూడ పాఠకులకు గోరిక కలదేని జైనకోటుంబ రక్షణానంతరమున దన్నగరోన్ముఖుండై యేగుచున్న మాధవు ననుగమించితిమేని నిర్భయముగా జూడగలుగుదుము. అటుచూడుడు. ఉన్నతియు, యున్నతికిం దగి

పొడవును, పొడవునకుఁదగిన పుష్టియుఁగలిగి స్నిగ్ధములై నిగనిగ లగు మేని ధవళకాంతులను నలుదెసలం బ్రసర్పఁజేయుచున్న శ్వేతాశ్వంబు నధిరోహించి మాధవుం డల్లఁ దేఁ పోవుచు నశ్వ వేగమును తగ్గించి మాధవుఁడు గుఱ్ఱమును మెల్లగ మెల్లగ నడిపించుచుండెను. ఏకశిలానగర మచ్చటికి నర్ధక్రోశదూరంబున నుండెను. ఇంతలో సాయంసమయ మగుటచే పశ్చిమది క్కాంత యరుణవస్త్రమును ధరించి సూర్యభగవానుని కర స్పర్శన మొనరించి పశ్చిమసముద్రతీరంబున విహరించుచుం డెను. దక్షిణ దిగ్భాగమునుండి పరిమళ మిళితములయిన చిన్న గాడ్పులు మందమందముగా వీచుచు లోకమున కపారసు ఖము నిచ్చుచుండెను. సాయంతనభానుని కిరణంబులు లేతపసిఁడి నగర స్వర్ణగోపురముల యందును, సౌధాగ్రముల యందును వ్యాపించి యాస్వర్ణరుచుల నా నగరంబునకు నొగడేయుచున్న యుద్యానవృక్షాగ్రములయందు బ్రసరించి మనోహరప్రద ర్శనమును గావించుచు, నీశ్వరసృష్టి స్వభావ రహస్యమును తెలియఁ జేయుచుండెను. మాధవుఁడా రమ్య ప్రదర్శనా మునుగాంచి యానందించుచు నగరమును సమీపించెను. నగరోపరిభాగంబునుండి ఘంటల మంద్రారావ పుంజములు మాధవుని శ్రోత్రపుటంబులఁజొచ్చి శ్రుతిసుఖమును గలుగ జేసెను. అవి మందమారుతములచే నుయ్యాలలూఁగుచు, ధ్వజ స్తంభోపరిభాగంబులయందు, బారులుదీర్చి కట్టఁబడిన చిరుగం టల మంజుల రవంబులు. అంత సూర్యుం డదృశ్యుండయ్యె.

నేకశిలాసౌధంబులయందు దీపంబులు వెలిగింపఁబడి యెను. మాధవుఁడు నగరి రాజవీధిని బ్రవేశించెను. అతఁడు గుఱ్ఱమును మెల్లగ నడిపించుచుఁ దనవృక్షములనిటునటును జూచుచు బహుసౌధంబులు దాటిపోవుచుండెను. మార్గంబున నిరుపార్శ్వముల యందును దీపస్తంభములు దనరారుచున్నవి. అచ్చటచ్చట రక్షకభటులు కావలిగాయుచుండిరి. గుఱ్ఱపుబండ్ల రాకపోకలచేతను నాగరకుల గమనాగమనంబులచేతను నా రాజవీధి యతిసమ్మర్దముగా నుండెను. రక్షకభటులిటు తొలంగుడు అటుపోవుడు. ఇటుగుఱ్ఱపుబండి వచ్చుచున్నది. జాగ్రత జాగ్రతయని జనులగాపాడుచుండిరి. మాధవుడనేక సౌధములుదాటి యింకను ముందునకుఁ బోవుచుండెను. ఇట్లు పోయిపోయి కొంతనడికి నొక విశాలసుందర సౌధమునుగాంచి యచటదన యశ్వంబునునిలిపి తటాలున నేలకుఱికి రెండునిమిషము లిటునటు బచారుజేసి తన మనంబున నేమి తలంచుకొనియుండెనోగాని మరలనాయశ్వము నధిరోహించి ముందునకు బోవుచుండెను. ఆసమయంబున నాసౌధోపరిభాగంబునుండి యొకకన్యారత్న మాతని నశ్వంబునుండి వీధివాకిట దిగుచుండఁగాంచి తటాలున లోనికేగి విశ్వాసరాయుండను తన వృద్ధసేవకుని బిలిచి తాతా! మాధవరాయలువచ్చి వీధివాకిట నిలిచియున్నారు. నీవు వేగమేపోయి వాకిలిం దెఱచిరమ్ము. అని పలికి మరలదాను సత్వరమే సౌధోపరిభాగంబునకుఁ జనిచూడ మాధవు డశ్వము

నధిరోహించి ముందున కేగుచుండెను. ఆతని వెంట నే గుఱ్ఱము నెక్కి చనుట కుంగల కారణమును దెలియనేఱక తన మనంబున నెద్దియో యోచించుచు, నాతడు తన కంటికగు పడినంతమేర నాతనినే చూచుచునే నిలిచియుండెను. ఇంతలో విశ్వాసరాయుడు లోననేమియో గొణుగుకొనుచు గట్టిగా తనలోని మెల్ల మెల్లగ మేడపై కివచ్చి, అమ్మా! మధుమతీ! పెద్దవాడననియైన దలంపక నన్నేలయూరక శ్రమపెట్టుచుందువు. మాధవరాయులును లేడు గీధనరాయులును లేడు, నీవు జాగ్రదవస్థయందే స్వప్నమును గాంచుచుంటివా యేమి?

మధు—నీవు వృద్ధుండవగుటచే నట్లు పలికితివి. వృద్ధులకు గోపము మెండుగదా! మాధవరాయులు వచ్చినమాట నిజము. అతడశ్వంబునుండి దిగియు నేలకోగాని మఱల గుఱ్ఱమునె క్కి ముందునకు బోయెను.

విశ్వాసరాయుడు—ఓహో! అట్లనా! నాది పిచ్చికోపము! ఏండ్లుముదిరినకొలదిని కోపముకూడ ముదురుచున్నది.... ఆతడు కోటకు బోవుచుండ నోపు. రేపు శ్రీమహారాజావారి జన్మదినోత్సవం బగుటచే నక్కడ నేదైన నగత్యకార్యము లుండునని దలంచి విశ్రమించకయే దర్బారునకు బోయియుండు నని తలంచెదను.

మధుమతి—తాతా! నీవు పలికినది యథార్థ మేయగుగాని, యెంతయావసర కార్యమున్నను, బడిరోజుతై యిలుదాసి తానిట నశ్వంబునుండి దిగియు, నొక్కనిమిషమైన క్షేమము

విచారించక యిట్లుపోవుటఁజూడ నామనంబనేక సందియము లకు లోనగుచున్నది.

విశ్వాసరాయుడు—నీవు వట్టివిచ్చిదానవు. బేలవు. గోలవు—ద్వారము బంధింపఁబడియుండుటచే నీతండ్రి యింటలేడనియు, నాతని దర్బారునందే కలిసికొనవచ్చుననియుఁ దలంచి తిన్నగ నటకుఁబోయి యుండును. లేకున్న నాతడిక్కడకేల రాకుండును? నీతండ్రికాసనియందు నీకంటెను మిక్కిలిప్రేమ గదా? తనకు బుత్రసంతానములేకున్నను మాధవునే పుత్రునిగజూచికొనుచుఁ బ్రేమించుచున్నాఁడు. మాధవునకుఁదన మామప్పైగల భక్తియవ్యాజమైనది. గాన నోబిడ్డా! మాధవుడుదర్బారులో నీతండ్రిని గలిసికొని భోజనమున కిక్కడకే వచ్చును. ఇంతియేకాని వేరుకారణ మెద్దియునులేదు. లోన మాయమ్మయొక్కతియెయున్నది. అనిపలికి మధుమతిని లోని కనిపి తాను దన తావునకుబోయెను.

—• నాలుగవప్రకరణము •—

మాధవుడత్యున్నతానేకప్రాకార పరిరక్షితంబును, వివిధ విచిత్ర రమణీయ గోపురాట్టాలక విరాజితంబునునగు నొకదివ్యభవనమును సమీపించి ప్రాగ్ద్వారంబుకడ తన శ్వేతాశ్వంబునాపి యొక్కనిమిషమట్లే నిలిచియుండెను. ఈదుర్గమునకు జుట్టును నొకపెద్దయగడితగలదు. అదివినిర్మల జలాపూరి

తంబును, సున్మీలిత పద్మసముదయంబును, వికసితకువల యా
నేక విరాజితంబును నై యొప్పుచున్నది. ఉడుగణంబు లానిర్మ
లజలంబుల కధోభాగంబునఁ బ్రతిఫలించుచు నియ్యది రత్నా
కరమాయను శంకను బుట్టించుచుండెను. ఈయగడితనుండి
చల్లని నీటిమీాద వాయువు లేతెంచి మాధవుని యుల్లమునుఁ
జల్లపరుచుచుండెను. అతిశయోన్నతిఁ బొకుందుమేని యా
దుర్గప్రాకారము నొక్కసారి తలయెత్తి పైకిఁజూచిన దృష్ట
లు వారినంత మేఱయున్నదని చెప్పకతీరదు. మాధవుఁడా
యశ్వమునుండి మెల్లగ నేలకుఱికెను. అంతనొక భటుఁడువచ్చి
యశ్వమును నశ్వశాలకుఁగొనిపోయెను. పిమ్మట మాధవుఁడు
దుర్గద్వారమును బ్రవేశించెను. నిగనిగలాడు మెఱుఁగు రెక్క
లతో మేరుపర్వత భ్రాంతినిదోఁపించు పెనుపైఁడితలుపుల
బెద్దగవనిదాటి లోనికిఁబోవుచుండెను. ఆదుర్గప్రాకారంబునకు
వెలుపలను లోపలను పేటలును వాడలును నలరారియున్న
యవి. వానిచుట్టును బుష్పారామంబు లతిమనోహరములై
విలసిల్లియుండెను. విచ్చుకత్తులఁ జేబూని వీరభటులా మార్గం
బున కిరుపార్శ్వములయందును పహరానిచ్చుచుండిరి. ఒక్క
ప్రక్క నశ్వంబుల సకిలింపులును, వేరొకప్రక్క గజబృంహి
తంబులును, వెలువడుచుండెను. ఆమార్గంబంతయును జందన
నీరంబుచేఁదడుపఁబడి ఘ్రాణేంద్రియంబుల కింపునుగొలుపు
చుండెను. అంతమాధవుండామార్గంబున కొంతదవ్వరిగి యొక
సుందరభవనంబున బ్రవేశించెను. దానియందు దీపరాజి వెలుఁ

గుచుండెను. అది గుమస్తాలుండు భవనము. మాధవుడు దానినిదాటి వేఱొకభవనమును బ్రవేశించెను. అది సువిశాల మును, జిత్రికంబళానేక విరాజితంబును,నిర్మలస్నిగ్ధదృఢ భిత్తి పరిరక్షితంబునునై యొప్పారుచుండెను. అందు నొక్కయున్న తాసనముపై నొకపురుషు డుపవిష్టుండై యుండెను. అతని మోలల ననేకభటులు నిలిచియుండిరి. వారల నాతడు కార్య కరణంబుల నియోగించుచుండెను. మాధవు డాతనిజూచుచు నట్లేనిలిచియుండెను. కార్యనిమగ్నుండగుటచే మాధవు నా పురుషుడు గనుగొని యుండలేదు. భటులనుజ్ఞనంది కార్యకర ణమునకు నిష్క్రమించుచుండిరి. కొంత యవకాశము చిక్కు టచే మాధవుడుమామా! యని పిలిచెను. అదివిని యాపురు షుడు తనదృష్టుల నిటుపఱపి, ఓహో! నాయనా? మాధవా వచ్చితివా? నీకొఱకు సార్వభౌము డెదురు చూచుచుండెను. నీవు సత్వరమే వారి దర్శనంబు జేసికొనిరమ్ము. నీవు వచ్చు దనుక నేనిచ్చటనే యుందును. అనిపలుక మాధవుం డాచో టువాసి వేఱొకసుందరవిశాల భవనమును సమీపించెను. ఆ భవనద్వారమునకడ నొక దవ్వారికుడు నిలిచియుండెను. వాడు మాధవునిగాంచి నమస్కరించెను. మాధవుడు వాని నమస్కృతి నందుకొని ఓరీ! భద్రా! మారాక చక్రవర్తికి నివేదించి రమ్మనిపలుక వాడు సత్వరమే లోనికేగి మాధవుని రాక సార్వభౌమున కెఱింగించి మాధవునిలోన ప్రవేశ పెట్టెను. ఇది సార్వభౌముని గోష్ఠీభవనము. ఆ తెలంగాణ

యును వివిధచిత్ర లతాచిత్రిత చిత్రకంబళంబులచే నాచ్ఛాదితమై యుండెను. దానికి దూర్పుపడమర్లకు నెదురుగ రెండు ద్వారములును, దక్షిణంబున నొక ద్వారమును నలుదిక్కులను రెండు రెండు చొప్పున నెనిమిది కిటికీలును గలవు. నాలుగు మైపులను, సువర్ణఫలక బద్ధంబులగు నాలుగు నిలువుటద్దంబులు నిలువబడియున్నవి. పడమటి గోడకు కాకతి గణపతిదేవ చక్రవర్తియొక్కయు, రుద్రమదేవి చక్రవర్తినియొక్కయు ప్రతికృతి పటంబులు వేలగట్టబడియున్నవి. ఈ రుద్రమ దేవికి ప్రతాపరుద్రుడు దౌహిత్రుడు. ఈతనిని రుద్రమదేవి దత్తతచేసికొని తన వజ్రసింహాసనమున స్థాపించెను. ప్రతాపరుద్రుడు స్నిగ్ధపీతవర్ణుడు. ఆజానుబాహుడు. ఉన్నతభుజుండు. ఉన్నత లలాటఫలకుండు. విశాలలోచనుడు. ఈ మహారాజు పట్టుటెక్కెంబులపై మోచేతుల నానుకొని యున్నతాసనంబున గూర్చుండియుండెను. ఆతనిచుట్టును విద్వన్మహాకవులును వీరశైవ మతాచార్యులగు లింగధారులును పరివేష్టించి శైవమత సిద్ధాంతములను దెలుపుచుండిరి. అట్టి సమయమున మాధవుడు ప్రతాపరుద్రుని మ్రోలనిలిచి కృతాంజలిపుటుండై నమస్కరించెను. ప్రతాపరుద్రుడుమాధవుని నమస్కృతి నందుకొని ఇంతవరకును నాతనికై నిరీక్షించుచున్నవాడే కావున గోష్టికూడ బూర్తియగుటచే మతాచార్యులకు శలవొసంగి పీఠంబునుండి లేచి మాధవునిగదం

బుగ్గబట్టి యూచుచు మాధవా ! యేమి! నీరాకకింత యాల్య మైనది !

మాధవుడు—సార్వభౌమా ! పాపమొక జైనబ్రాహ్మణుఁడు బాలుబిడ్డలతో బళ్ళిమదేశంబునకుఁ బోవుచు గాడ్పు సుండకుఁజిక్కి శోషించి స్మృతితప్పి పడియుండెను. అతడుపున స్స్మృతుండగు నట్లుగు నాతనికియుపచారము జేయవలసివచ్చిన కతంబునఁ గడువఁ గాలంబునకు రాజాలకపోతిని.

ప్రతాప—మాధవా ? నీకు జైనమత రక్షణంబనశ్య కర్తవ్యంబని తలంచెదను.

మాధ—దేవా ! తామట్లు తలంపఁజనునే ! ఆర్తావనంబు మీకును మీవలనైకపాత్రుండ నగుటచే నాకును సర్వ శ్యకర్తవ్యంబేగదా !

ప్రతా—మాధవా! మిథ్యాభి వాదంబులచే మతతత్వమును మఱుగుపఱుచు నాస్తికులకు బరిరక్షణంబెట్లు గలుగును?

మాధ—సార్వభౌమా ! ప్రతిమతస్థుడును తమతమ మతంబే తథ్యంబనినమ్మి దానిని స్థాపింపఁబూనుట మతావేశముగల ప్రతివానికిని సహజము. వేరువేరు స్థలంబుల జనించినను నదులన్నియు తుదకు సాగరంబునఁగలియు చందంబున మతంబులన్నియును మొదట వేరువేరుగా జూపట్టినను తత్వసారయు నన్నిటికిని లక్ష్యమొక్కటియె. మహారాజులకు మ

చర్చలు హానికరంబులు, సర్వమత సమపాలనంబు స్వాత్మ రక్షణో పాయంబు.

ప్రతా—నీవు దృఢచిత్తుండవు. నీసమయోచిత భాష ణంబుసంతోషదాయకము. ఇక మతచర్చల విడిచిపెట్టుటశుభ దాయకము. మాధవా! సామంతరాజులకెల్ల నాహ్వాన పత్రి ములందజేసితి వా?

మాధ—చిత్తము. సూర్యోదయంబున కెల్లరునువచ్చి తమ దర్శనంబునకై నిరీక్షించుచుందురు.

ప్రతా—మాధవా! నీకార్య శూరతకును నిపుణత్వ మునకును జాల సంతసించితిని. రేపటి జన్మదినోత్సవ సభకు నిన్ను కార్యదర్శిగా నియమించితిని. జాగరూకుండవై మెలం గుదువు గాక!

మాధ—మహాప్రసాదము. సార్వభౌముని యాజ్ఞయ విలంఘ్యము గదా!

ప్రతా—సరియే! నీవు దీర్ఘప్రయాణముచే జాల యలసియున్నావు. విశ్రమింపఁ బొమ్మనుటయు, మాధవుండు నమస్కరించి ముదల గైకొని తనకై యెదురు చూచుచున్న మామను గలిసికొని జరిగిన సంగతియంతయును మాట లాడుకొనుచు బోవుచుండిరి. సేవకులు భోజన సమయమైన దనినివేదింప సార్వభౌముడు భోజనశాలకు జనియెను.

శ్రీధరుడు—నాయనా! మాధవా! యడగమఱచి తిని. మతాచార్యు లింటికి బోవుచు నిన్ను నిందించుచుండిరి. కారణంబేమియో!

మాధ—ఏమని!

శ్రీధరు—నీవు వారలకు నమస్కరింపక యే సార్వభౌమున కొక్కనికే నమస్కరించితివట. మాధవుడు నాస్తికుడు పిడు నిక్కిలి పొగరెక్కి యున్నాడు. అని యనుకొనుచు బోవుచుండిరి.

మాధ— మామా? ఈవీరశైవులు వట్టి కుత్సిత భరులు. శివశివా! వీరలమూలంబున నెన్ని జైనకుటుంబములు మడిసినవి. మహారాజు తలకు విషము నెక్కించుచున్నారు. సార్వభౌమున కేల యీమతపు పిచ్చి?

శ్రీధరుడు— వారల పగ పాముపగవంటిది. జాగరూకుండవై యుండకున్న గాటువైతురు. కావున మతాచార్యులయెడ విధేయత నటించుట క్షేమకరము. లేకున్న నీవన్నట్లు మహారాజు తలకు విషము నెక్కింతురు. దాన హాని చేకూరును.

మాధ—మామా! నేను జీవన్మృతుడ గానేఱను. ఆత్మను జంపుకొని, యీహింసాళువులకు విధేయత జూపనొల్లను. ఆత్మదేశమునకు హాని కలుగనై యున్నప్పుడీ పాడు నవుకరీకై పరమార్థమును జంపుకోలేను. నాప్రభువును బ్రేమింతును. నాదేశమును బ్రేమింతును. గాని దాని కడ్డము దగిలెడి మతములను, కుల కక్షలను, నైశ్వర్యమును, నధః పాతాళమున కనగ ద్రొక్కెదను. ఇప్పటికప్పుడే పరమ పావనియగు నామాతృభూమి చాలమట్టుకు మ్లేచ్ఛాధీనమై

దీనత్వ మనుభవించుచున్నది. హైందవ వీరపురుషాధిష్ఠానయోగ్యమగు ఢిల్లీసింహాసనము మ్లేచ్ఛాక్రాంతమై యుండ పౌరుష వంతుడగు భారతీయు డెవ్వడును దానిని సహించడు.

శ్రీధరుడు విస్మయ స్తిమితగాత్రుడై మాధవాంతస్థిత దేశభక్తిని లోలోన గొనియాడుచు, మాధవా! తొందరపడుట కార్య సాఫల్యమునకు హానికరము గాగలదు. శాంతి సాధనముననే యుపాయముల నాలోచింపవలెను. అని పలుక మాధవుం డటులనే కానిమ్ము అని యింకను నేదియో మాటలాడుకొనుచు దుర్గ ద్వారమును దాటి యావలకు రాగా నట గుఱ్ఱపుబండి సిద్ధముగ నుండెను. వారిద్దరును నందు గూర్చుండి యింటికేగిరి. మధుమతి వారల రాకను నిరీక్షించుచు గవాక్షమునుండి చూచుచున్న దగుటచే బరిచారికను బిలిచి తలుపులు తీయబంపి తానట నిలిచి శకటమును నిరీక్షించుచుండెను. కోకిల తలుపు దీసెను. మాధవుడును శ్రీధరుడును బండినుండిదిగి లోనికేగిరి. అందు మాధవుడు గూడ నుండుటగాంచి మధుమతి యమందానందము నందెను. ఆమెకు దన మనంబునగల సందేహము తొలంగిపోయెను. తనతల్లి యింగితమును నాతడెట్లో గ్రహించి మఱలి యుండెనని మొదట దలంచి యుండెను గాని యాతని గాంచిన తోడనే యాతలంపు వమ్మయ్యెను. పిమ్మట మాధవ శ్రీధరులు సుఖోదక స్నానంబులాడి శుభ్రవస్త్రములను

ధరించి యుపవిష్టులైయుండ రుక్మిణి వెండియరటాకులపై వడ్డ
ణంబును గావించి కోకిలచే వారలకు వార్తనంపెను. అంత
వారు భోజనశాలకు బోయి సుఖంబుగఁ గుడిచిరి. రుక్మిణి
నేడేమియోగాని మాధవునితో నంత చనవుగా మాటలాడ
లేదు. ఆమె కేమియును సంతోషము లేదు.. ఇంతలో
మధుమతి కోకిలచే మహాలలో నొక శయ్య వేయించెను.
మాధవుడు మధుమతి సందడిగానక యిటునిటును రెండుసా
రులుచూచి ప్రయాణంబున యలసియున్నవాడు గావున
శయ్యపై మేను వాల్చెను. శ్రీధరుడును తన శయనాగార
మునకుఁబోయి యొక పడక కుర్చీపయినివిశ్రమించెను. మధు
మతి భుజించుటకు లోనికేగెను.

---

## — అయిదవ ప్రకరణము —

మధుమతి, రుక్మిణీ శ్రీధరులకుఁజిరకాలమున కుదయిం
చిన నోములపంట యగుటచే నతి గోమున బెఱుగుచుండెను.
ఈమె, తల్లిదండ్రుల కేకపుత్రిక. తల్లికన్నను తండ్రియెడ
మిక్కిలి చనువుగలిగి యుండెను. శ్రీధరుండును తన పంచ
ప్రాణములను దసముద్దుల పట్టియందే యుంచి యామె యొక
నిమిషము కనబడకున్నఁ బలుమాఱు పిలుచుచుండును. మధు
మతి వీణా వాద్యమునందు జక్కని పాండిత్యమును సంపా

దించి యుండెను. రుక్మిణి వీణా వాద్యమునందు నేర్పరి యగుటచే కుమార్తెయగు మధుమతికి నావిద్యనంతను చక్కగ నేర్పెను. మరియు గృష్ణగాయకుండను యాస్థాన వైణికుడు ప్రతిరోజును వచ్చి మధుమతికి వీణ నేర్పుచుండెను. ఈకారణములచే మధుమతి వీణావాద్యము నిశేష భావకల్పనామధురమై యొప్పుచుండెను. అల్లదే చూడుడు! ఆమె తన తండ్రిచెంత నొక పీఠముపైఁ గూర్చుండి యొక వ్యజనమును గేల నందుకొని తండ్రిమేన నెమ్మదిగా విసరుచుండెను. ఈమెకిప్పుడు పదునైదు వత్సరముల వయస్సుండును. ఆమె యంగంబులు మృణాళపేశలంబులును, వికసనోన్ముఖంబులునునై యుండెను. కనుగవ కలువ రేకులంబోలి దీర్ఘము స్నిగ్ధనీల దృగ్విచిరంబులై యొప్పుచుండెను. న్యాయశీత వాతంబులు మేనసోక శ్రీధరుడు కనులు మూసి నిద్రించెను. తండ్రి నిద్రించుచుండుట గాంచి మధుమతి కేలనున్న విసరుకఱ్ఱ నటనుంచి తన శయనాగారమునకు బోయెను. అప్పటికి పదిరెండు గడియల రాత్రి యయ్యెను. మధుమతి, యప్పుడేమి చేయుచున్నది? యెద్దియో యోజించుచుండెను. ఆమె తన వామహస్తమును గుబ్బపై నూకొని నిలిచి యుండెను. దక్షిణ కరంబునందలి తర్జని యధరోష్ఠమునంటియుండెను. నేత్రములు కొంచెము పైకిం బ్రసరించియుండెను. కాని యవి లక్ష్యమునలేవు. ఆమెకీ యవస్థ యేల గల్గెనో తెలియదు. ఒకచిన్న మందహాసమును జేసెను. ఇట్లుండ విశ్వాస రాఘయుడు లోపలినుండి చేతికఱ్ఱచే నేలను

గొట్టుచు మధుమతి శయనాగారమునకు వచ్చి నిలిచెను.
అతడు వచ్చిన యలుకుడికి మధుమతి తుల్లిపడి నిలిచియున్న తాతను జూచి యద్దిరయో యనబోయెను గాని యది లోన దొట్టువడుటచే దానిని దెలియకుండ సవరించుకొని తాతా! నల్లమందు వేసితివా? అనియెను.

విశ్వాస—నేను నల్లమందు వేసితినిగాని నీవును నల్లమందు వేసిన దానివలెనే పరధ్యానముగ నట్లుంటి వేమి?

మధు—తాతా! నేను పరధ్యానముగ నుంటినా?

విశ్వా—పరధ్యానమే కాదు తుల్లిపాటు గూడను.

మధు—నేనాలోచన యందుండుటచే నీ రాకవలన గలిగిన యలుకుడికి నేనీయవస్థకులోనైతిని.

విశ్వా—నీకట్టి నిశ్చల ధ్యానమేల యవసర మయ్యె?

మధు—అది హఠాత్సంభవము. కరుణాకరుండును శ్రీవిలసితుండును నగు మాధవుని నిరుపమాన తేజోరూపంబు నాహృదయ దర్పణంబునం బ్రతిఫలించుటచే నాకీనిశ్చల ధ్యానము కలిగెను.

విశ్వా—నిన్నాపరధ్యానమునుండి విముక్తురాలిం జేసి పాపము గట్టుకొంటినే?

మధు—తాతా! భగవద్గీత నొక్కమారు చదివెదను. దానిని విని నీవా పాపమునుండి ముక్తుడ వయ్యెదవా?

విశ్వాసరాయుడు మారు పలుకలేదు. అతఁడు తల యూఁచి మందహాసమును జేసెను. అప్పుడు మధుమతి బీరువానుండి యొక చిన్న పాత్రమును దీసెను గాని దానిని జదువ నిష్టములేక మరల యథాస్థానమున నుంచెను. ఆమెకు నిద్ర వచ్చుట లేదు. ఏలకోగాని యామెమనస్సు మిక్కిలి పరితాపము నందుచుండెను. పడక కుర్చీపయిన బరుండి పలు యోజనలకు దగులొ్కనియెను. అవియొక దానితో నొకటి సంబంధ పడకుండెను. ఆమెకు తనకు విసువు జనించెను. పిదపఁ దనయాలోచనకు స్వస్తి జెప్పి నిద్రింపఁ జూచెనుగాని యంతరంగమునుండి పొంగిపొఱలి వచ్చు యూహా పరంపరలామెయుద్యమమును గొనసాగనీయకుండెను. విశ్వాసరాయుడు చిన్నతనమునుండియు మధుమతి నెత్తిపెంచిన వాడగుటచే నామెయందు నాతనికిఁ బ్రేమ మెండు. ఆమె కష్టసుఖములను దానును సమానముగా బంచుకొనుచుండును. ఈతడు శ్రీధరుని తండ్రినాటనుండియు వారి కుటుంబమును గనిపెట్టుకొని యుండెను. ఈతఁడొక దాసీ పుత్రుఁడు. మొదట నీతనిపేరు రాయుడు. మిక్కిలి విశ్వాసపాత్రుఁడగుటచే మధుమతి పితామహుఁ డీతనికి విశ్వాసరాయుఁడని నామము పెట్టెను. మధుమతి యాతనిని జిన్నతనము నుండియును తాతాయని పిలుచుట యలవాటు. అంతకొంతవడికి విశ్వాసరాయుడిట్లనియె. అమ్మా మధుమతీ! నీవుమిక్కిలి పరి

తాపము ననుభవించుచున్నట్లున్నావు. కారణ మేమియో తెల్పెదవా!

మధు—తాతా! నీకు దెలియని కారణ మేమున్నది మాయమ్మ తలంపు నాతలంపునకు బారి నాగుండె లవియఁజే యుచున్నయది.

విశ్వా—ఆమె యుద్దేశ్యమునువిన్న నాకునుఁగూ జాలపరితాపమే కలుగుచున్నయది. తన యన్న కొడుకకు నిన్నిచ్చి యాతనిని దనయింట నిల్లఱికముంచుకొనఁదని తలంచియున్నది. ఆమె యుద్దేశ్యమునకు వ్యతిరేకము నడచి నగ్గుట కేరికిని సాధ్యపడదు.

మధు—విద్యాజ్ఞానశూన్యుఁడై ప్రపంచ జ్ఞానమంతగా లేని గర్వ భూయిష్ఠుడగు కామపాలునకు నే సహధర్మ చారిణి నెట్లగుదును?

విశ్వా—ఆతడు మిక్కిలి యందగాడఁయుఁబరాక్రమ వంతుడనియు మీయమ్మ యభిప్రాయము.

మధు—ఆయందమును నేనుఁగోరను. అది ముషిణి పండువంటిది. అంతఃకలుషితము. హేయము, ఆపరాక్రమము గర్వసంరంభ సంగతంబు. కుటిలము, దురోపాయార్జితము దానిని నేను కోరను.

విశ్వా—సరియె! అట్లయిన నీవుకోరునదెద్ది!

మధు—ఎవ్వాడి నా కష్టసుఖములకు దాయభాగి నియో, యేది, యా బాల్యస్నేహాపరిశోధితంబై పరి

మతి మనస్సు మాధవునియందు లగ్నమయ్యెను. సంఘట్ట కాలమునుండి రుక్మిణి మధుమతికి నంతఃపురవాస మేర్పఱచెను. అక్కారణంబుననామె మునుపటివలె మాధవుని దరుచుగా జూచుటకుంగాని సంభాషించుటకుంగాని వీలుచిక్కకుండెను. ఇట్లుండ నింతలో విశ్వాసరాయ డేదియో యనభామెను గాని యదియామెకు మరింత దుఃఖకారణమని తలంచి, యాయుదైశ్యమును మాన్పుకొని, అమ్మా! మధుమతీ! నీతండ్రి యెట్లయిన నీమనోరథ మీడేర్పక మానడు. మాధవుండాతనికిం గడుంగూర్చెడు మేనల్లుడుగదా! నీయందెట్టి ప్రేమయో మాధవునియందుగూడ నాతనికట్టి ప్రేమయే. నీవూరక వగచుటేల, ఇంతకును దైవమున్నాఁడుగదా! ఇప్పటికి మూడు యామముల రాత్రి యయ్యెను. పోయి నిదురింపుము, నేనుగూడ బోయి నిదురించెదను. అని పలికి విశ్వాసరాయుడు తన తావునకుబోయి నిదురించెను.—మధుమతి గదికి దక్షిణమునను బశ్చిమంబునను రెండు వసారాలుగలవు. ఈ రెండు వసారాలలోనికి రెండు ద్వారములు గలవు. మరియును త్తరముగా లోనికిం బోవుటకొక గుమ్మముగూడం గలదు. రెండు వసారాలలోనికిని రెండు కిటికీలుగూడ గలవు. దక్షిణపు వసారా వీధివైపునను. ఈవసారాలోనుండి చూచిన వీధిలోని చిత్రములన్నియుం గంట బడుచుండును. పడమటి వసారాలోనుండి క్రిందికి దిగుటకు మెట్లుగలవు. ఈ మెట్లు వీధిగుమ్మమున నుండెను. మధుమతి గదిని

కొలసియే తూర్పున శ్రీధరుని గదికలదు. ఆగదికి దక్షిణమునను నుత్తరమునను రెండు సొరంగములు గలవు. ఉత్తరపు సొరంగమునుండి కొంచెము నాలవలకుబోయిన నచ్చట గ్రింది యింటిలోనికిబోవు మెట్లుండెను. పడమటి మహాలులోనుండి గూడ దూర్పునకుఁ బోవుటకై నొక సొరంగముకలదు. పడమటి మహాలులోనుండి దక్షిణపు వసారాలోనికిఁ బోవుటకుఁ గూడ నొక ద్వారము గలదు. ఇట్లుండ పడమటి మహాలులో శయ్యాస్థుఁడుగుండియున్న మాధవుడు మూడవయామ ప్రవేశమున మేల్కొనుడయుటచే, శయ్యనుండి లేచి మంచము క్రిందనున్న వెండి చెంబులోని మంచినీటను గ్రోలి యిటునటును జూచుసరికి మధుమతి గదిలో నేవియో మాటలు వినవచ్చుటచే, నెమ్మదిగా, యా దిగుసొరంగము కడకుఁజని నిలిచి, మధుమతీ విశ్వాసరాయుల సంభాషణ వినుచుండెను. ఆసంభాషణమువలన నాతని హృదయము మిక్కిలి పరితాపమునకు లోనయ్యెను. తనయత్తయుద్దేశ మిట్లుండెనని యాతడిదివరకెఱుంగడు. అతని హృదయము కుంగిపోయెను. కనులనుండి యప్రయత్నముగ నశ్రుప్రవాహము రాల్చెను. ధీరస్వాంతుం డగుటచే మనస్సును సమాధానపఱచెను. ఇంతలో వారల సంభాషణ ముగియుటయు. విశ్వాసరాయుడు లోనికేగుటయు జరిగెను. మాధవునకు మధుమతిని బిలిచి పలుకరించి యోదార్పవలెనని యూహపుట్టెనుగాని యాసమయమున వెంటనేయది యసంగతమని తోచుటచే యాప్రయత్నము మానుకొనెను. ఇంతలో

శ్రీధరుడు మేలుకాంచి, అమ్మా మధుమతీ! తెల్లవారుచున్న ట్లున్నది. వీణవాయించెదవా? వచ్చెదనని పిలిచెను. మధుమతి యాలోచనలో దగుల్కొని యుండుటచే నీపిలుపామెకు విన బడలేదు. మరల శ్రీధరుడమ్మా! మధుమతీ! లేచివీణవాయిం చెదవా! వచ్చెదను. తెల్లవారు చున్నట్లున్నదని పలుకరిం చెను. ఈరెండవ పిలుపు మధుమతి యాలోచన కడ్డముదగిలి కుర్చీనుండి కదలించెను. మధుమతి లేచి నిలిచి బాబా! లేచి తిని, తెల్లవారుచున్నది. వీణనటకు దెత్తునా? యన శ్రీధరుడు అమ్మా! నీవు శ్రుతులను సవరించుచుండుము. నేనటకు వచ్చె దనన,మధుమతి, యొకబల్లపై నున్నవీణనందుకొనియొకప్రక్క గూర్చునియుండెను. ఇంతలో శ్రీధరుడు మధుమతి గదిలోనికి వచ్చి పడకకుర్చీపై బరుండియుండెను. మధుమతి వీణ దని యంకభాగంబున నుంచుకొని శ్రుతుల సవరించుచుండెను. అనామికముచే దంతువులను గదపెను. శ్రుతులు స్థాయిలో బడినవి. మాధవుడు మెల్లగ వెనుకకు మఱలి శయ్యపై బరుం డెను. అంత నా బాలామణి తనచే దమ్మిచే వీణనందుకొని వసంతకాలమున బాలరసాల పల్లవములనుమెక్కి సంతోష ముగగూయు కోకిలస్వరంబుతో వియ్యమొందుజాలు కంఠస్వ రంబున బాడుచు, నఖాగ్రములచే దంతువులను గదపుచు నడుమ నడుమ దనకాలితో లయ వేయుచుండెను. శ్రీధరుని కనులు మూతలుపడియుండెను. ఆతడు నిద్రబోవుచున్నాడా యేమి! లేదు లేదు. మధుమతి యదుకుల కాంభోజి రాగము

నందుఁ గొని పాడుచుండెను. ఆమె యధరపల్లవము గదలుచునే యుండెను. ఎంతయో నిదానించినగాని నునమూ చలన మును గనిపెట్టనేరము. ఆమె యధరమున రాగము ప్రవహించుచుండెను. ఆమె హస్తములుకూడ రాగమునే వెదచల్లుచుండెను. చేతనున్న యావీణకూడ రాగమునే వదలుచుండెను. ఆమె హృదయమంతయును రాగపూరితమై యుండెను. వేయేల! ఆమె యొక రాగమూర్తివలె ప్రకాశించుచుండెను. ఆగదియంతయును రాగముచేనిండి గవాక్షముగుండ పైకి బ్రసరించుచుండెను. ఆమె హస్తాంగుళులు వీణాతంత్రువులపై నృత్యము చేయుచుండెను. ఆమె కనులు మూతలుపడియుండెను. శరీరము కదలుటలేదు. రాగము ప్రవహించుచునేయుండెను. ఇంతలో రుక్మిణివచ్చి శ్రీధరుని బిలిచెను. మధుమతి గానమాగెను. అందరును లేచిరి. ప్రాతఃకాల శీతవాత పోతములు మధుమతి గదిలోనికి గవాక్షములనుండి చల్లగా వీచుచుండెను. ఆ శీతవాతపోతముల చల్లదనమును కొనలనిం చుచు మధుమతి కుర్చీపయిని గూర్చునియుండెను.

---

## —♦ ఆ ఆ న ప్ర క ర ణ ము ♦—

ఎవ్వాని యుదయంబుచే లోకమంధకారమును బాసి యత్యద్భుతంబులగు భగవత్సృష్టి వైచిత్ర్యములు ప్రదర్శింపఁ బడుచుండునో, యెవ్వాని కిరణసహస్రము లోకంబునవ్యాపించి

పశుపక్షులకా సమస్తప్రాణులకుఁ బృథివికిఁ జైతన్యము నొసంగు చుండెనో యెవ్వనికాలమున జనులు కర్మోపేతులై జపతప హోమధ్యానాది సత్కర్మల నాచరించుచుఁ దమజన్మముల సార్థకమునొందించు కొనుచుందురో, యెవ్వని యాకర్షణ సామర్థ్యమున బృథివి మొదలుగాఁగల గ్రహంబులు కుమ్మర సారె చందంబున గిరగిరం దిరుగుచు మాసాదికాల నిరూప ణంబుఁ జేయుచుండెనో, యెవ్వని శక్త్యాకర్షణంబున సంద్రంబున గల జలంబు లావిరిరూపంబున నాకాశంబునకెగసి కాలానుసార ముగ వర్షించుచు, బృథివిని సర్వసస్యభరితనుగా నొనరించు చుండెనో, యెవఁడు లేనికాలము మహాప్రళయంబని చెప్పఁబ డునో, యెవ్వఁడు సృష్టికిఁ బ్రధానవస్తువో, యెవనిని బ్రత్య క్షదైవంబని కొనియాడుచుందురో, యెవఁడు లోకబంధుండని స్తుతింపఁబడుచుండునో, యెవఁడు గానుపించని దినముదుర్దిన మని చెప్పఁబడునో, అట్టి నిరుపమాన తేజఃపుంజముపూర్వ దంగనా గర్భకుహరమునుండి యుద్భవించి రాగయుక్తము లగు తన బాలమరీచులను బ్రసరింపఁ జేయుచు నూర్ధ్వముగా బయలువెడలెను. అత్యంత శీతలంబులగు ప్రాతఃకాల వాత పోతములు మెల్లమెల్లగ నల్లెడల వీవఁదొడంగెను. శయ్యలనుండి లేవశక్తులుగాని పిల్లలంజేరి తల్లులు ముఖంబులదుడిచి ముద్దా డుచుండిరి. కనులదెఱచి శయ్యల దల్లులుగానక పిల్లలుచేతు ల, బైకెత్తి యమ్మా! యమ్మా! యనివిలపించుచుండిరి. లోక మంతయు జాగ్రదవస్థయందుండెను. ఇట్టి ప్రాతఃకాలము

నేకశిలానగరమతిరమణీయమై విరాజిల్లుచుండెను. పట్టణం బంతయుఁ బచ్చనితోరణంబులచే నలంకరింపఁబడియుండెను. ప్రతిదేవాలయంబు నందును వాద్యఘోషంబులు చెలంగు చుండ శ్రీద్వితీయ వీరప్రతాపరుద్ర దేవుని గోత్రనామంబుల నుచ్చరించుచుఁ బూజాదికంబు లొనరించుచుండిరి. నేఁడు శ్రీప్రతాపరుద్ర సార్వభౌముని జన్మదినంబు. సార్వభౌముని మేలుబడికిలోనైన రాజవీరులెల్లరును, కప్పంబులను గానుక లను గైకొని రాజగృహంబునకుఁ బోవుచుండిరి. రాజభటులు కోటలోనికి బోవు నాలుగుమార్గంబులను నీవలావల బారులు దీరి నిలిచియుండిరి. రాజసేవకు లిటునటును బరువెత్తుచు మిక్కిలి పనిగలిగి యుండిరి. మృదంగ భేరీనినాదంబులు ఘొల్లుమ్రోగుచుండెను. సభాభవనంబంతయును బుష్పగుచ్ఛం బులతోడను మరువపత్రంబులతోడను, వీరపురుషచిత్రపటంబుల తోడను నలంకరింపఁబడి యతిరమణీయమై విరాజిల్లుచుం డెను. అల్లదే! చూడుడు, త్రైలింగ రాజ్యరమావల్లభుండగు శ్రీవీరప్రతాపరుద్రదేవుడు, వజ్రసింహాసనమున నధిష్ఠించి నవ్వకయే నవ్వినట్లుండుముఖమండలంబు తోడను, పలుకకయే పిలిచినట్లుండు నేత్రయుగ్మంబు తోడను, వివిధరత్నద్యుతు లచే జ్వలింపకయే జ్వలించినట్లుండు రత్నకిరీటంబుతోడను, నొప్పారుచు నుత్తమాంగంబును వంచియు వంచనట్లువంచుచు, నెత్తుచు సామంతుల వందనంబుల గైకొనుచుండెను. తెల్లని వలువయును, వీరపురుషోచితమగు యంగియును మేనసలంక

రింపఁబడియుండ శిరంబున తెల్లని యుష్ణీషణము మెఱయ సితా ద్రియోయన నద్రిశిఖరుండగు మాధవుండు కటినుండి పాద ములనఱకును వ్రేలాడు నిశితఖడ్గంబుతో నిటునటును దిరు గుచు నచ్చ్చటి సామంతులకు నెదురుగా బోయి కేలండి యూచుచు వారల నుచితాసనంబుల గూర్చుండఁ బెట్టుచు నెల్లఱకును దగుమర్యాదల గావించుచుండెను. సార్వభౌముని కగ్రభాగంబున విద్వన్మహా కవులును, సంగీతాచార్యులును గాయకులునుఁ బరివేష్టించియుండిరి. దక్షిణభాగంబున రాజ కుటుంబములను మంత్రివర్గంబును నాసనంబుల నలంకరించియుం డిరి. వామపార్శ్వంబున దండనాధికారులును సేనాధిపతులును గూర్చునియుండిరి. మిగిలిన సామంత రాజానీకంబంతయును మహారాజున కభిముఖంబుగా, గూర్చొనియుండిరి. అంతనా సామంత రాజబృందమంతయును సార్వభౌమునకుఁ గానుక లర్పించుచుండిరి. విద్వన్మహాజనులు కొందరు శతావధానం బును కొందరష్టావధానంబును గావించుచుండిరి. ఆదినంబున నిండుకొలువులో సార్వభౌముడు విద్వన్మహా జనులకును సేనాధిపతులకును మంత్రివర్గంబునకును, సామంతనృపులకును దండనాధికారులకును బహుమతుల నిచ్చుచుండుట యాచా రమై యున్నది. అక్కారణంబున బహుమాన పాత్రములను వస్తువులను దెచ్చి సార్వభౌముని పార్శ్వమున నుంచబడియెను. అంతసార్వభౌముడు మాధవుని కనుసన్నల బిలిచి యాతని చెవిలో నేమియో చెప్పెను. అదివిని మాధవుడు సార్వభౌ

ముని పురోభాగమున నిలిచెను. ఆసభయంతయు అలలులేని సంద్రమువలె గంభీరమై శాంతమై యుండెను. అప్పుడు సభాసదుల దృష్టియంతయును మాధవునిపై కేంద్రీకరించెను. అంత మాధవుడు విద్యానాథ కవుల నవలోకించి యిట్లనియె—

ఓ విద్యానాథ మహాకవి సార్వభౌమా! సార్వభౌముడు తమ్ము సంభావించి తమయాశీర్వాదమును గోరుచున్నారు. అనవిద్యానాథుడు మెల్లనలేచి మంగళశ్లోకంబుల మహారాజు నాశీర్వదించి సార్వభౌముని హస్తములనుండి బహుమతినందుకొని మరల దనస్థానమునం గూర్చుండెను. ఇటులనే క్రమముగ, రుద్రభట్టును త్రిపురాంతక మహాకవియు శ్రీనాథకవీంద్రుడును, భాస్కరకవియు, మంచనకవియు మొదలుగాగల విద్వజ్జ్యేష్ఠులు మాధవునిచే బిలువంబడుచు బహుమతుల నందుకొని మహారాజు నాశీర్వదించుచు దమతమస్థానముల గూర్చొనుచుండిరి. పిమ్మట మాధవుడు మంత్రివర్గంబును సేనాధిపతులను నవలోకించి—వీరశిఖామణియగు నాగన మంత్రిశిఖామణీ! సార్వభౌముడు తమసన్మానమునకై నిరీక్షించుచున్నారనుటయు, విద్వాంసుడయు వీరశిఖామణియు నగు గన్నయ మంత్రి యల్లనలేచి సామ్రాట్టున కభివాదంబుల గావించి మ్రోలనిలువ సార్వభౌము డాతని కృపావీక్షణంబుల దన్పుచు రత్నఖచితంబగు నొక నిశితకరవాలమును నాతనికందిచ్చెను. అమ్మంత్రిపుంగవుండు దానిని నందుకొని మరల దనస్థానమునం గూర్చుండెను. ఇటులనే యెల్లనాయకు

డును, మేచననాయకుడును, ఇ .దులూరి రుద్రరాజును. బెండ పూడి యన్నామాత్యుడును, యశ్వసైన్యాధ్యక్షుండగు సాహి శిమారుడును, గజసాహిణి గుండానాయనింగారును-జుట్టయ లంక కొండ్రాగ్రేయు-ముప్పిడి నాయకుడును-కోశాధ్యక్షు లగు హరియప్ప బుక్కయాప్పలును-శ్రీధరసింగమ నాయక ప్రభృతులును-పలువంబడి రాజహస్తములనుండి బహుమతుల నందుకొనుచు సార్వభౌమునకు నమస్కరించి క్రమక్రమము స్థానం బునంగూర్చొనుచుండిరి. మిగిలిన రాజసేవకంబున కంతకును వారివారికిదగు సత్కారములు గావింపబడెను. పిమ్మట దక్షిణస్త్రి మాధవునకు స్వర్ణబద్ధకవచంబుతో నతిసుందరంబై నిశితధారావిలసితంబై దీర్ఘంబయొప్పు మహాఖడ్గమును ప్రేమ తోనిచ్చెను. మాధవుం డద్దానినందుకొని సార్వభౌమునకు నమస్కరించెను. ఆమహాసభలో మాధవుడిట్లు గౌరవింపం బడుట కొందరు కమ్మనాయకులకు ననిష్టముగనుండెను-మాధ వుడు పద్మనాయక వంశజుడు-వెలమ-కమ్మనాయకులకును బద్మనాయక వెలమలకును మనస్పర్థలు గలిగియుండెను. మతాచార్యులకు మాధవుడు నమత పక్షపాతియను క్రోధ ముమనంబుల బ్రజ్వరిల్లుచుండెను, మాధవు డున్నతపదవి నందుచుండుటజూచి మతాచార్యుల కన్నులెఱ్ఱనగుచుండెను. మాధవునియందు సార్వభౌమునకు బ్రేమమెండుగనుండుటచే వారినేత్రాగ్నికి మాధవుడాహుతి కాకుండెను. మంగళా శీర్వాదములతో సభముగిసెను. వందిమాగధులు కైవారంబు

సేయుచుండఁ బ్రతాపరుద్రుఁడు సభఁజాలించి యెల్లఱకును సెల
వొసంగి తాను భోజనశాలకుఁ బోయెను. అంతనందఱు
సభనుండి లేచి తమతమ విడిదలకుఁ జనిరి. శ్రీధరుఁడు మాధవు
నితో సింగమనాయనికడకుఁ బోయి కుశలంబులడిగి సభావిష
యంబులఁ జర్చించుకొనుచు నందఱును గలసి శకటంబు నధి
రోహించి తిన్నగా నింటికివచ్చిరి. సింగమనాయని మనస్స్థా
నంబున నేమియును సంతోషముగలేదు. దానికి కారణము
లేకపోలేదు, నిన్నటివలెనే, నేఁడును మతాచార్యులు మాధ
వుని విషయమై నిందావాక్యములను బలుకుచుఁ బోవుచుండిరి.
ఆవాక్యములు సింగమనాయని చెవింబడిహృదయమునకు వ్యథ
నుగలుగఁజేసెను. ఆత డాసంగతిని తనకుమారునితోఁ గాని
భావమఱందితోఁ గాని చెప్పలేదు. అంతనందఱును వేసవి
యగుటచే నాయత్తపఱచిన శయ్యలకుం బోయి నిద్రించిరి.



## —♦ఏ డ వ ప్ర క ర ణ ము♦—

దేవగిరి సుప్రసిద్ధానేక వీరపురుషులకు జన్మభూమియు
విద్వజ్జనుల కాటపట్టును నాశ్రితజనంబులకుఁ గల్పభూ
జంబును నై విరాజిల్లుచుండెను. ఈదేవగిరిని రాజధానిగ
జేసికొని రామచంద్రదేవుఁడను యాదవరాజు మహారాష్ట్ర
సంతల దేశంబులఁ బరిపాలించుచుండెను. రామచంద్ర

దేవునకును బ్రతాపరుద్రునకును! లోలోనమనస్పర్ధలుగలవు. ఉభయులును సమబలులగుటచే నొండొరులను జయించు కొనవలయునను తలంపులు విడిచి మౌనమును వహించియుం డిరి. రామచంద్రదేవునకు మతద్వేషము లేదుగాని జైన మతమునందు మాత్రము ప్రేమ మెండుగానుండెను. ఆకా రణమున దేవగిరి యందు జైనమందిరములు చాలవిలసిల్లి యున్నవి. ఒకనాటి సాయంసమయమున నొక సుప్రసిద్ధజైన మందిరమున నొకవేదికపై యొకపురుషుడు కూర్చుని యుం డెను. అతడేదియో దీర్ఘముగ నాలోచించు చుండెను. ముఖమండలము చాల పరిమ్లానమై యుండెను. నేత్రయు గ్మమరుణమై రూక్షమైయుండెను. ఆతడు నడుమనడుమను వేడి నిట్టూర్పులను విడుచుచున్నాడు. ఆలోచనలచేహృదయ మాపూరితమై లోనజోటుచాలక కాబోలును! వదనము నుండి వాగ్రూపమునఁ బైకి వెలువడుచుండెను. వినుడు! వినుడు! ఏమను చున్నాఁడు—జైనులను జైనమతమును రాజు తనకపకారముగాఁ దలంచెనుగా ? ఔనౌను! అట్లనే తలంచు కొననిమ్ము అదియే నిజమగుగాక ! జైనులమూ లంబుననే యాతడు రాజ్యపద భ్రష్టుండగుఁ గాక ! జైన మతమునందుఁ దనకిష్టము లేకున్న లేకుండెడిని గాని మకు లను మాన్యంబులను హరించి యాలుబిడ్డలతో నింటనుండి లేవఁగొట్టి పలు బాములఁ బెట్టె నాతనికేమి న్యాయమని తోఁచెనో! కానిమ్ము! రామచంద్ర దేవునకును ప్రతాప

రుద్రునకు చిరకాలమునుండి మనస్పర్ధ యుండెనుగదా! అని తలపోయు సమయమున నొక యువకుడరుదెంచి యోయీ! భీమణా? ఏమది? నీలోనీవే మాటలాడుకొనుచున్నావు: ఉద్రేక పూరితమైన నీరూప దర్శనము భయజనకమై యున్నది?

భీమణుడు—అరుణప్రభా! యోరుగల్లునందు నాసర్వస్వమును త్యాగము జేయఁగలిగితిని, కాని మనోద్వేగమును వదల జాలనైతిని. ప్రతాప రుద్రుని పరభ్రష్టత్వముతో గాని నా యావేశము చల్లారదు.

అరుణ—నేనును నీవలెనే యేకశిలా నగర కాపురమునకు దిలోదకమును వదలినవాడనే, నష్టసంపదనురాబట్టు కొనుటకీ యుద్రేకము కార్యకారి కాదు.

భీమణ—పోయిన గృహక్షేత్రంబుల మరల సంపాదింతుననెడి యాశ నాకులేదు. కాని నాసొత్తుతో పాటు ప్రతాపరుద్రుని రాజ్యముకూడ పోయినగాని నాయుద్రేకము చల్లారదు.

అరుణ—సవలక్ష ధనుర్ధరులతో బరిరక్షింపబడు నయాంధ్రరాజ్య సార్వభౌముని నీబోటి యుద్రేకి యేమిచేయు గలడు?

భీమ—రామచంద్ర దేవుని బురికొల్పి ప్రతాపరుద్రుని పై దండయాత్ర వెడలునటుల జేసెదను.

అరుణ—సమాన బలుండగు ప్రతాపరుద్రునిపై రామచంద్రదేవుడు దండయాత్ర వెడలుననుట వట్టికల్ల. ఒకవేళ నాతడంగీకరించినను ప్రతాపరుద్రుని జయించుట నీతనికి సాధ్యము కాదు. ఇట్టిచో ప్రతాపరుద్రునకే జయము చేకూరిన మనకు మొదటికే హాని కలుగును. క్రోధదేవత నిన్నావహించి శిర మెక్కించుచున్నది. రామచంద్రదేవుని శరణు జొచ్చి యాతని దయచే గుటుంబమును బోషించుకొనుచున్న మనమిప్పుడు రామచంద్రదేవుని గయ్యమునకు గాలు ద్రువ్వించుటకంటె స్వామిద్రోహము వేరొకటి లేదు. ప్రతాపరుద్రుడు ప్రతాపనిధి, వీరపురుష సంసేవితుండు. త్రిలింగ రాజ్యమును నేకఛత్రాధిపత్యముగా బరిపాలించుచున్నాడు. పగ సాధించుటయే ప్రధానముగా జూచుకొంటివిగాని, నీ యశక్తతకు వగవవైతివి. రామచంద్రదేవు డవివేకియై ప్రతాపరుద్రునిపై డీకొనువాడు కాడు. ప్రతాపరుద్రుని సేనానులద్వితీయ ప్రతాపులు. ఆంధ్రులశౌర్య మప్రతిహతము. కావున రామచంద్రదేవునికి పరరాజ్యాక్రమణ మహావిషంబు నెక్కించి యాతని వినాశమునకు రాచబాట వేయకుము.

భీషణ—అటులైన నాక్రోధమునకు, నాదుఃఖమునకు, నా పరిభవమునకు బ్రతీకారము లేదందువా?

అరుణ—నీకు నిజమైన పౌరుషమే యున్నచో బ్రతీకారము లేకపోలేదు. నిశిత కరవాలమును చేబూనిమహా

పరాధియగు ప్రతాపరుద్రుని దెగనరుకుము. దేశమున గార్చిచ్చును దరికొల్పుచున్న బ్రాహ్మణులగు నామాత్యాచార్యులను దుత్తునియలుగ క్రింద నఱికి వేయుము.

భీమన — అట్టిపోటు బంటుతనమే యుండినచో యేకశిలానగరమునుండ తుగీవలకే పెట్టకపోవును. అట్టిధైర్యమే యుండినచో నీ యెకసక్కెములకు దావుండునా? అరుణప్రభా! నన్నేల వేలమాడెదవు. సానుభూతి కలదేని నా సంతాపమునకు సహాకారివి గమ్ము.

అరుణ — భీమనా! క్షమింపుము. నీవన్యథా తలంపకుందువేని నాపలుకులు యథార్థములని నమ్ముము. కుతంత్రములు బన్ని జన్మభూమికిం జేటుదెచ్చుట మాతృద్రోహమని యెఱుంగుము. ఒకవ్యక్తిపైగల పగచే స్వరాజ్యనిర్మూలనం బొనరించెడి తంత్రములచే హైందవరాజులలో బరస్పరకలహములను రగుల్కొల్పి మాతృభూమిని శ్మశానవాటికగా జేయదలంచుట మాన్యముగాదు. నీకుగల్గిన పరాభవమే నాకునుగలిగినది. అత్తపైగల కోపముచే మామగారిని గుంపటిలో బెట్టినదను సామెతగా, పగతునిపయిగల కోపముచే నాత్మదేశము నధోగతికి దేజూచుట మహాద్రోహము. ఉత్తరహిందూస్థానమున ఢిల్లీనగరంబునందెట్టిమార్పులుకలుగుచున్నవో గాంచితివా! ఇదివరకే ఢిల్లీసామ్రాజ్యము మ్లేచ్ఛాక్రాంతమైనది. శౌర్యధుర్యులగు రాజపుత్రులనేకులు బహు సంవత్సరంబులు పోరిపోరి ప్రాణములను గోలుపోయి మిగిలినవారలు పర్వత

ములకును నెడారులకునుబోయి తురకల వశమున నుండనే
ఱక ప్రచ్ఛన్నముగ నుండిరి. మహమ్మదీయు లొకరివెనుక
నొకరు రాజ్యమునకు వచ్చుచుఁ గ్రూరదండోపాయంబులచే
సాధువర్తనులగు హైందవులను హింసించుచు సామ్రాజ్య
మును విస్తరింపఁ జేయుచున్నారు. భారతరాజ్యలక్ష్మి రాను
రాను మ్లేచ్ఛాక్రాంతమగుచుండ నీమహావిపత్తును మనంబు
నన్నైన దలపోయక కేవలము ప్రతాపరుద్రుని మాత్రమే
విరోధించుట యేమిప్రయోజనము? నేడొక ధూర్తునివలన
మనకు గష్టముగలిగెను గదాయని మనతోబాటు దేశమునం
తను గష్టముల బాలుసేయుట తరుణోపాయము కాదు.

భీషణ—అయితే మతమును మంటగలిపి, మర్యాదను
గోలుపోయి జీవచ్ఛవంబు పగిది యుండమనియెదవా ?

అరుణ—ఓయీ! వెఱ్ఱివాడా ! దేశమే తగులబడిపో
వునప్పుడు నీమతమును నీవును నీమర్యాదయును నిలుచునా !
ఇప్పుడందువా ! యేకశిలానగరమున గాకున్న దేవగిరిలో
నైన దలదాచుకొనిమతసంరక్షణ మొనరించుకొన గలిగితివి.
నిరంతర కలహముల కాలవాలమై మ్లేచ్ఛాధీనమైయున్న ఢిల్లీ
సామ్రాజ్యమున హైందవులగతియేమైనది! భారతమతమున
కెట్టిగతి పట్టినది. ఎట్టియవమానమెట్టిదాస్యము. తలచుకొనిన
గర్భనిర్భేద మగుచున్నదే ! అట్టిచిచ్చునే యాంధ్రావనిలో
గూడ బెట్టుదమంటివే! సహేంద్ర తక్షకాయస్వాహా! యను
స్థితిలో నీవేమగుదువో యోచించుకొనుము.

పసంబులను బండితులతోఁ గూడ రాజుగారి సన్నిధికిఁ బోవుచుండును. భీమనుడు తన తెలివి తేటలవలన రామచంద్ర దేవుని సంపూర్ణ దయకు బాత్రుడయ్యెను. ఆ కారణమున జీర్ణమైయున్న భీమనుని పాండిత్యము ప్రబలసాగెను. ఇట్లుండ నొకనాడు రామచంద్ర దేవు డొక జాతకమును దెచ్చి భీమనునకిచ్చి యీ జాతకఫలంబు జెప్పుమని యడిగెను. భీమనుడద్దాని నందుకొని యటునిటును ముహూర్తగతి ద్రిప్పి గ్రహముల బరిగణించి మఱల జూచినదే మూంచుచుఁ దనకేమి సిద్ధాంతమును జేసికొనియెనోగాని పెదవులను జాఱవిడిచి జాతకపత్రమును నేల జాఱ విడిచెను. దానిం జూచి రామచంద్రదేవుడు వెఱగుపడి, అది యేమి! జాతకపత్రమును నేల జాఱవిడిచినావు. జాతకఫలం బెట్టులుండెను.

భీమను — మహారాజా! జాతకము కొంతవఱకును బాగుగనే యున్నది. కాని యాఖరునకు నీచదశకు బాల్పడి యున్నది.

రామ — అంతే యేమిటో స్పష్టముగా జెప్పుడు.

భీమను — అంత్యదశ విపద్గ్రస్తమై యున్నది.

రామ — అది యద్రూపమైనది!

భీమ — పరాభవంబును. ద్రవ్యహానియు సంభవించును.

రామ — అది శత్రుమూలకమా! బంధుమూలకమా!

భీమ — శత్రుమూలకంబుననే జఱుగగలదు.

రామ — అట్టి శత్రు వెవ్వడో చెప్పగలరా!

భీమ.—శత్రునామము నిర్ధారణచేసి చెప్పుటకు వీలు లేదు. తనకు శత్రువెవ్వడైనదియు జాతకుడే గ్రహించుకొనవలెను.

రామ.—ఓ ద్విజమణీ ! ఈ జాతకమునాదే కొంచెమూహింపగా ప్రతాపరుద్రు డొక్కడే శత్రువనిపించుకొనుచున్నాడు. కాని యాతనికి మాపై దాడి వెడలవలయుననెడి యూహయున్నట్టు లేదు. తాము చెప్పిన ఫలంబుజూడ జాల వింతగా నున్నది.

ఇది రామచంద్రదేవుని జాతకంబని భీమణుం డెరుంగడు. ఇది యాతనిదే యైనందులకు భీమణుని మనంబున ననేక సందియము లుద్భవిల్లినవి. ఈతనినమ్మి యే తన కార్యమును దాను సంపాదింపబూనుకొనెను. రాజ్యకారకుడు సుస్థిరుడయి యుండుటచే రాజ్యపాలనమునకు లోటు రాకూడదు. అని మనంబునదలంచి రాజా ! నీపాలనంబున కేమియునుకొరత కలుగదు. రాజ్యకారకుడు సుస్థిరుడయియున్నాడు. నీవుభయ పడవలసినపని లేదు. దుష్టగ్రహంబులకు శాంతియొనర్చిన నవి మంచిఫలంబులనే యిచ్చును, కాని ప్రతాపరుద్రుడు నీకెప్పుడును ప్రక్కలోని బల్లెమువంటివాడు. ఆతనిపై నీవొక కన్నుంచి చూచుచుండవలెను. బలపరాక్రమంబుల నీవాతనికి దీసిపోవువాడవు కావు. అతడు మతావేశుడయి యనేక క్రూరకర్మల నాచరించుచున్నాడు. ఇట్టిస్థితిలో నీవూరక చూచుచుండిన నెప్పటికయినముప్పు వాటిల్లకమానదు.

రామ—తాముచెప్పునది యథార్థమే యగునుగాని; నేటివరకాతనికేనును, నాకాతడును, యొనరించుకొనిన యపచారంబు లేవియునులేవు. లోన మాయుభయులకును స్పర్ధలుండినమాట వాస్తవము. ఇట్టిస్థితిలో, నేరమేమియునులేని దేయాతనిపై ముందుగ కయ్యమునకు గాలుద్రువ్వుట హానికరము. లోకము నిందించును. ఇప్పుడాతనిపై కత్తిగట్టి పోరుట మంచిదికాదు. తాము తెల్పిన జాతకఫలము భయాశ్చర్యములకు దావగుచున్నది.

భీమ—మహారాజా! నీవెంత మాత్రమును భయపడవలసిన పనిలేదు. ఈఫలము నిశ్చయమని చెప్ప వీలులేదు. ఈజాతకము సరియైన జననకాలములోబడి యుండక కొంచము వెనుకముందుగా పడియుండవచ్చును. లేకున్న నిట్టి విపరీతగుణము శత్రుభీషణుండవగు నీకెట్లుకలుగును? ప్రతాపరుద్రుడొక్కడేగదా నీపై స్పర్ధగలిగి యున్నాడు. అతనియెడ నీవు జాగ్రతగనుండిన జాలును.

రామ—తాము చక్కగా జ్ఞప్తికిఁదెచ్చితిరి. నాజననము హఠాత్తుగ గల్గెనని నేను విని యున్నాను. మాజనని నన్నుఁబ్రసవించిన యొక గడియవరకును నెవరికినిఁ దెలియలేదట. ఆకారణమున, దాము చెప్పినట్లు జాతకము సరియగు కాలమునకుఁ బడక పోవచ్చును.

భీమ—ఆసంగతిని మీరు సెలవీయకుండగనే నేను తెల్పితినిగదా!

ఇది మిథ్యాఫలము—అనుటయు నింతలో, ద్వారికుడరుదెంచి రామదేవునికడ మోకరించి నమస్కరించి మహారాజాధిరాజా! గాలవుడు వచ్చియున్నాడు. ముదలమ్యోనేని గొనివచ్చెదనన రామదేవుడు సెలవొసంగెను. వెంటనేయొక నిమిషమునకు గాలవుడులోనఁబ్రవేశించి మహారాజునకు నమస్కరించి, మ్రోలనిలచెను. రామదేవుఁడాతనిఁ గృపాదృష్టింగాంచి గాలవా! ఓరుగల్లు విశేషంబులెవ్వి?— అనుటయు గాలవుఁడాతని చొక్కాజేబునుండి యుత్తరమునుదీసి రామదేవుని కందిచ్చెను. రామదేవుడు దాని నందుకొని గాలవునకు విశ్రమింప సెలవొసంగి యుత్తరమువిప్పి చదివెను. అందేమి వ్రాయబడియున్నదోగాని మరల దానిని రెండు మారులు చదివి యాశ్చర్యము నభినయించి భీషణదేవా! యోరుగంటిలోని మనరహస్య పరిశోధకుఁడగు సిరోచను డచటి సమాచారమును వ్రాసి పంపినాడు. ఇందు ధనిమ్యద్విపత్తు సూచింపఁబడియున్నది.

భీష—రాజా! విన నపాయంబు లేదేని యుత్తరమంతయును సాంతముగా జదువ ప్రార్థితులు.

రా—మచ్ఛ్రీయోభిలాషులగు మీవంటి ప్రజ్ఞులకు దీనిని తెలుప నపాయ మెద్దియును గలుగబోదు. అని లేఖనిట్లు చదువ నారంభించెను. లేఖ — సార్వభౌమా ! నేనింకను గొంత రహస్యాన్వేషణమునకై యుచ్చట నుండవలసి వచ్చినది. ఏక శిలానగర సేనానులలో పరస్పర కలహము

లుపయించినవి. మతావేశ వశంవదుడగు ప్రతాపరుద్రుడు జైనులను దేశమునుండి పారదోలుట కుద్యమించుటచే నొక కలకలము దేశమున జనించినది. మాధవుడను నొక పద్మనాయక వెలమ వీరుడు, జైనుల పక్షమున నిలిచి ప్రతాపరుద్రునితో నిర్భయముగ సంధి సమాచారమును నడుపుచున్నాడు. దీన మతగురువులగు లింగధారులు మండిపడి మాధవుని మారణహోమమును జేయ మాయా వాగురులను బన్నుచున్నారు. మరియు ప్రతాప రుద్రుడు తన జన్మదినోత్సవంబున శ్రీమాధవునే కార్యదర్శిగ నియమించి యున్నాడు. కమ్మనాయకులకును వెలమ నాయకులకును మనస్పర్థలుండుటచే మాధవ కార్యదర్శిత్వము, కమ్మ నాయకులకు మిక్కిలి కష్టముగా నుండెను. ఇది యిట్లుండ ఢిల్లీ చక్రవర్తి ప్రబలసైన్యములను గూర్చి దక్షిణము నంతను మ్రింగ జూచుచున్నాడని యొక రహస్య వార్త యిటకుజేరినది. ఈదెబ్బ దేవగిరికి గూడ దగిలిన దగులవచ్చును. కావున జాగ్రతగనుండుట మంచిదని ప్రభువులకు దెలుపు కొనుచున్నాను. నా పని పూర్తియగుట తోడనే మిగిలిన వృత్తాంతమును తమసన్నిధానమున విన్నవించు కొందును.

ఇట్లు తమ దయాపాత్రుడగు,

విరోచనుడు.

లేఖ నంతను విని భీషణుడు మహారాజా యోరుగంటి సమాచారము లన్నియు మీా కనుకూలముగనే

యున్నవి. వారి సేనానులలో బుట్టిన కలతలు నీకు శుభ సూచకములు. ఢిల్లీచక్రవర్తికి యాంధ్ర సామ్రాజ్యముపై కన్నుపడుటచే మన శత్రుబలము నిశ్చయముగా తగ్గినదని నమ్మెదము. మనకును ఢిల్లీ చక్రవర్తికిని స్నేహభావముండు టచే నాతని వలన మనకెట్టి భయమును లేదు. మీ సహా యమును నాతడు తప్పక కోరగలడు. మీ రుభయులును యేకీభవించినచో నాంధ్రసామ్రాజ్యము కొంత మీవశము కాగలదు.

రామ—భీషణ దేవా? ఇప్పుడొక విషమ పరిస్థితి యేర్పడినది. అమాత్య శేఖరులతో నాలోచించి ఢిల్లీవృత్తాం తమును గనుగొనవలసియున్నది.

అని భీషణుడు శలవుగైకొని గృహంబున కేగెను. రామచంద్ర దేవుడును లేచి గృహాభ్యంతరమున కేగెను.

—• తొమ్మిదవ ప్రకరణము. •—

భీషణుడింటికి కేగుసరికి జయదేవు డప్పుడే లోన ప్రవే శించుచుండెను. జయదేవుని గాంచి భీషణుడు బావా? యని పిలిచెను. జయదేవుడు వెనుకకుఁ దిరిగిచూచి భీషణా! రా రమ్ము. నే నిప్పుడే వచ్చితిని. ఇంట నందరును క్షేమమా?

భీష—ఆ! అందరును క్షేమముగనే యున్నారు. రమ్ము లోనికిరమ్ము. అని నిద్దరును నొకరిచేయి నొకరు పట్టు

కొని లోనికేగి సుఖాసనముల గూర్చుండ భీమణుడాతురతతో బావా ఢిల్లీ సమాచారము లేమి? అనియెను.

జయ— ఢిల్లీసమాచారములు చింకిగప్పెడున్నవి. అన్నియు జెప్పెదను గాని యిచ్చటిసమాచారము లేమియో తెలుపుము.

భీమ—బావా! చేయదగిన కార్యమేమియో చేసితిని. హోమకుండంబున సమిధలునై చితిని. కానియవి యంటుకొనుట కగ్ని చాలకుండెను. అగ్నికి వాయువు తోడైనగాని ప్రజ్వరిల్లదు. ఏవిసరుకర్రిచేతనో గట్టిగ విసరుదమన్న మందతేజమైయున్న యీసూక్ష్మాగ్ని యెగిరిపోవునేమోయని భీతి కలుగుచున్నది.

జయదేవు—అవసరపడిన కార్యమగునా? క్రమంబుగ కొంతసేపటి కదియే రగుల్కొనును. ఆపదునెరిగి యందాజ్యమును పోసిన నది ప్రజ్వరిల్లును. ఆయగ్నిజ్వాలలచే పగతుర నసంహరించి మనపగదీర్చుకొనగలము.

భీమ—ఇంతకును సమిధలభారముచే నగ్ని నశింపక ప్రజ్వరిల్లిన గదా? మనమిట్లు దలంచుట.

జయ—ఏమిది? ఎంతపిచ్చవాడవు. నశించిన నశించుగాక? మనమీతని నేసమ్ముకొనియున్న పిచ్చిబ్రాహ్మణులము కాము.

భీమ—నేటికి రెండుమాసములనుండి నీరాకకై యెదురుచూచుచున్నాను, ఢిల్లీనగరంబున నీవెట్టి యిక్కట్టుల నందుచుంటివో యని కుందుచున్నాను.

జయ——నేను జిక్కులలో బడునంతటి యవివేకినిగాను. కార్యసాధనమునకై యనేక పన్నుగడలు పన్ని యలసివచ్చుటచే సంతయాలస్యమైనది. అనేకాంతః కలహంబులకు లోనై ఢిల్లీ నగర రాజ్యలక్ష్మి, చపలయై దినంబున కొక్కని వరించుచున్నది. అకారణంబునఢిల్లీ సింహాసనమునధిరోహించిన వారు, ప్రాణంబులఱచేతం బెట్టుకొనుచుండెను.

భీమ——ప్రస్తుతపు ఢిల్లీచక్రవర్తి యెవరు? అతనిస్థితి యెట్టిది?

జయ——జలాలుద్దీను. అతడుచాలవృద్ధుడు. రక్తమును బ్రసరింపజేయు నాతని కిష్టము లేదు. మిక్కిలి నిరుత్సాహుడై యున్నాడు.

భీమ——అట్లయిన నాతని యసమర్థతను జూచి శత్రువులు ఢిల్లీసింహాసనంబునుండి త్రోయయత్నించుట లేదా?

జయ——అటులనే యగునుగాని సైన్యాధ్యక్షుడైన నీతని సోదరపుత్రునిగాంచిన శత్రువులు భయమందుచుండిరి.

భీమ——ఆతని పేరు

జయ——అల్లాయుద్దీన్

భీమ——ఈతడు మిక్కిలి పౌరుషశాలియై యుండనోపు

జయ——మాళవదేశముపై దండయాత్రవెడలి మాళవరాజును జయించి రాజ్య మాక్రమించుకొన్నాడు.

భీమ——నీవాతనితో బరిచయమునుగలుగ జేసికొంటివా!

జయ—పట్టిపరిచయమే కాదు, ఆతనిని నావలతోవేసి కొంటిని.

జయ—భళీ? నీవెంతకైన తగుదువు తరువాత తరువాత?

ఇట్లువీరిద్దరును మాటలాడుకొనుచుండ నరుణాక్షీ ప్రభు డరుదెంచెను. భీషణు డాతనిగాంచియరుణప్రభా? రా! రమ్ము జయదేవు డిప్పుడే ఢిల్లీనుండి వచ్చినాడు అల్లాయుద్దీనుని వలలోవేసుకొనివచ్చినాడు. దానినే చెప్పుచున్నాడుకూర్చుండివినుము. బావా? జయదేవా? తరువాత తరువాత?

జయ—ఆతడిదివఱకే దక్షిణమునంతను మ్రింగజూచుచున్నాడు, ఆతని బురికొల్పివచ్చితిని.

అరుణ—ఆయ్యూహ చాలప్రమాదమైనది. మిక్కిలి హానికరము మహాసంక్షోభ ముప్పతిల్లును. అది నెరవేరకుండుగాక.

జయ—యేమి, అట్లనుచున్నావు.

అరుణ—ఔను; దక్షిణమున నాతిని నడుగుపెట్టనిచ్చినచో హానికలుగును. ఆతడు మిక్కి క్రూరస్వభావుడు. మహాసంక్షోభ ముదయించును. దేశమట్లుడికినట్లుడుకును.

భీమ—అట్లయిన మనముచేయునదేది?

అరుణ—మగతనమున్నచో నిశితకరవాలమును చేబూని పగతుని బరిమార్పుము.

జయ—అది మనబోటి జన్మకష్టములకు సాధ్యపడునది కాదే!

అరుణ—కాదేని ముక్కుమూసికొని ముక్తిమార్గ [redacted]చూచుకొనుట మంచిది.

భీష—నీవు పరిహాసానికని యట్లుతెగులుచుందువు. ఒక తైలింగరాజ్య నిర్మూలనమే మనముకోరునది. వీరైన నొక్క ప్రతాపరుద్రుని, రాజ్యపదభ్రష్టుత్వమే మనముకోరునది.

జయ—స్థలభాండవిసర్జనమై, సర్వమును గోలుపోయి దయాదాక్షిణ్యములులేక హతాత్ముగ వనితలకు గెంటువేయ బడినను నింకను నోరుగంటి సామ్రాజ్యమునకై జాలిపడు చుంటివే? ఆమహాపాతకునకు బ్రతాపరుద్రునకెట్టి ద్రోహ ముజేసినను పాపముగలదా? నీపడినపాట్లు తలంచుకొనిన నీ విట్టులనవరుణవ్రభా?

అరుణ—మిత్రులారా ? మీరుహ్రస్వదృష్టితో మాటలాడుచున్నారు. నేను సర్వస్వమును గోలుపోయినను యది నామాతృభూమి పదపంకజములకే యర్పణకాబడినది. కారణాంతరములచే నేడొకని యన్యాక్తత వలన గొందరకు బాధగలిగినంత మాత్రమున, నాతనిపై గల కోపముచే జన్మ భూమిని మ్లేచ్ఛాధీన మొనరించు మీ దుర్వ్యవసాయముమా తృద్రోహకరంబని చెప్పకతప్పదు. ఒకానొక సమయమున వ్యక్తిపరముగా నొకనికి నష్టము గల్గినను భారతీయునకు భారత రాజన్యుని పాలనమే శ్రేయోదాయకముగాని భారతీయేత

రుని పాలనముపవ్రవహేతువు. ఒకనిపై గలనీ యాజ్ఞా సాధనమునకై, నీకోప దాహమునకై, నీదుఃఖానుభవము నకై నవనవోన్మేషశాలినియై, సస్యశ్యామలయై, సకలార్థ ప్రదాయినియై, రత్నగర్భయై సకలకళాకళ్యాణఫలప్రపూర్ణ హృదయై దేవరూపమున విరాజిల్లు మాతృమూర్తిని మైల పఱచి రక్తపంకమున బొరలించుట తగదు, తగదు. పరశు రామునివలె నీమాతను నీచేతులతో జంపుకొనిన జంపుకొను ముగాని, నీసోదరుని, నీనిశితకరవాలమునకు గురిజేసిన చేయుము గాని, గోమాంసభక్షకులగు మ్లేచ్ఛుల కరవాలమునకు గురి కా నీయకుము. నీసోదరునిసొత్తును నీవపహరించిన నపహరించు ముగాని పరమ్లేచ్ఛాక్రాంతము కానీయకుము. పిల్లియు బిల్లి యు దగవులాడినట్లు మన సంపదను మారుజాతివాని కప్పగిం చుట న్యాయము కాదు. మిత్రులారా; ఈదురంత దుస్తంత్ర ములచే మాతృభూమిని మారణహోమము జేయకుడు. ఆప చ్ఛిత్రులకును, క్రూరవ్యాఘ్రమును,నాభారతసంపదాపహర్త ను,నాయల్లాయుద్దీనుని నాహ్వానించి, మాతృ స్తన్య మప్పగిం చుట మర్యాద కాదు. మరియు, ప్రతికూలమతస్థు డని ప్రతాపరుద్రుని ద్వేషించి, యుభయమత విధ్వంసకుండగు మహమ్మదీయుని లాలించుట, కప్ప బెక బెక లాడినదనుకోప ముచే పామును బెంచుట వంటిదని యెఱుంగుడు. ఎలుకబట్ట కొరికిన దను కోపముచే నిల్లు దగులబెట్టుకొను యుక్తి.నేకి

మార్గమును జనుట సర్వనాశనహేతువు. కాఫిరులకు నీ మ్లేచ్ఛాధములవలన నుత్తరహిందూస్థాన రసపుత్రస్త్రీలు మానరక్షణకై ప్రాణముల గోలుపోవుట యెఱుంగరా? కాలయమునితో గంఠాశ్లేషణ మేల? .

జయ—మమ్మేల నిందించెదవు. స్వసుదాభిమానినై యుండియు, శిరచ్ఛేద మగుచున్నప్పుడుగూడ శ్రీరంగనీతు లేనా? ఏవిధంబుననైన స్వమతరక్షణ మొనరించుట మానవ ధర్మము. ఈధర్మమునే మే మొనరించుచుంటిమి. దీనికే ప్రచండ ప్రళయ భయానక భూరి విపత్తుగ సూచించుచున్నావు.

అరుణ భూతవర్తమానములలో నుత్తరమున జూపట్టుచున్న దారుణ పరిణామమును కనులార జూపించుట భావి భూరి విపత్తుగాక మరేమిటి. దేశోపద్రవమును గల్గించు మతము మతమనియెదవా ? ప్రజానాశమునకై బూనిన మతము మతమా? జననీజన్మభూమిశ్చస్వర్గాదపిగరీయసీ యనవినమా? మాతృమర్మచ్ఛేదన మొనరించెడి యోపాదు మతమా? మాతృ పాదముల కడ బలియగుము.

భీషణ జయదేవులు మారుపలుకలేదు. సౌమ్య గంభీర్యమానసుండగు యరుణప్రభుని వాగ్ఝరి పొంగి పొరలుచున్నప్పుడు దానికి నెదురీదుటకు సాధ్యముకాకపోయెను. ముగ్గురును మూకీభావమును వహించిరి. ఈస్థితి కొంతవరకట్టులేయుండెను. అంతె గొంతపడికి భీషణుడు బేలయై యరుణ

పరీక్షా? యీ యదపమార్గమేయగుచో, మా యవివేకమును మన్నింపుము. మాహృదయమందిరమున విషమ సంశయ దహానలమును దరికొల్పితివి. ఇది శమించినగాని పునరాలోచన పొసగదు. అనుటయు నింతలో భీమణుని భార్య సాధుశీల వచ్చి అన్నావంటమైనదని యెదున నందరును నిష్క్రమించిరి.

---

## పదియవప్రకరణము.

ఇది వసంతకాల సాయం సమయము. "ఈదివసావసానము స్వభావ రమణీయమై విరాజిల్లుచున్నది. కలని స్వనంబులు కమశ్రావ్యములై వెడలుచుండెను. లేత కెంపులకాంతిననుకరించు లేజిగుళ్ళ సంజకెంజాయితో సఖ్యమొనరించు గున్న మామిడులయందు జంట కోయిలలు దాగుడు మూతలాడుచు బంతములాడుకొనుచు నొకదాని వెనుక నొకటి పంచమస్వరంబునఁ గూయుచున్నవి. అస్వరముస్వభావ రమణీయము. అది శుశ్రూషచే నేర్చుకొనినదికాదు జంటకోయిలము తమ్ము గొరికెతినవేయుచున్నదను భయమున చలించుచుండెనా యనునట్లుచూతపల్లవములు మందమారుతమున కల్లలనాడుచున్నవి. ఆగున్నమామిడులందు గోయిలలు దాగుడుమూతలాడుకొనుచు కుహూ-కుహూ స్వరములచే దమ గుప్తస్థలములను దెలుపుకొనుచుండెను. పుష్పలతాపల్లవములు మందమారుతములతో బెనగులాడుచు గ్రీడిం

చుచున్నయది, ఇది, యేకశిలానగరశాస్త్రవ్యాఖ్యానస్థానము. ఇందు వివిధ విచిత్రపుష్పలతాచ్ఛన్నంబగు నొకమంటపము విరాజిల్లుచుండెను. దానియందు ప్రతాపరుద్ర సార్వభౌముడు విద్వన్మహాజనసంసేవితుండై యుపవేష్టించి యుండెను. ఒక శ్లోకపత్త్రమును నత్యుత్సాహముతో బండితులకు జదివి వినిపించుచుండెను: అదిరసగంగాధరమను యలంకారశాస్త్రము. అందలి కల్పనాచమత్కృతి యెట్టిదియోగాని విద్యానాథ ప్రభృతులు నడుమ నడుమ దలలూచుచుండిరి. పత్త్రము జదువుట ముగిసెను. పిమ్మట మతాచార్యులగు లింగధారులు శైవసిద్ధాంతములను దెల్పుచు మహారాజునకుత్సాహముగలిగించుచుండిరి. ఇట్లుండ నొకసేవకుడరుదెంచి ప్రాం నిలిచి నమస్కరించెను. వానింగాంచి ప్రతాపరుద్రుడు యోరీ? భద్రా మాధవుడేడీరా?

భద్ర— మహాప్రభూ? అల్లదే గుఱ్ఱము నెక్కి వచ్చుచున్నారు.

ప్రతాప— ఇంతయాలస్యమైనదేమి?

భద్ర— మహారాజా? మాధవరాయలు రాజవీధి నుండి వచ్చుచుండగా బుద్ధమందిరముకడజైనులు వారిగుఱ్ఱమునకడ్డమువచ్చి మొఱపెట్టుకొనుటచేనింతయాలస్యమైనది.

ప్రతా— ఏమని మొఱపెట్టుకొనిరో చెప్పగలవా?

భద్ర— భయమునభినయించుచు మారుపలుకకూరకుండెను.

ప్రతా—భద్రా? యేమట్లు భయపడియెదవు, యేమి జరిగినదో చెప్పుము.

భద్రు—ఏలినవారి యాజ్ఞయైన నాకు భయమేల ? మమ్ము నన్యాయముగ బాధించుట తగదనిసార్వభౌమునితో జెప్పుడనియు, మామడులనుమాన్యంబులను నాక్రమించుకొని మామతద్వేషులగు శైవులకు ధారవోయుట తగదనియు ఆలుబిడ్డలతో మమ్ముఁబరదేశములఁ బాలుసేయుట మహారాజునకు శ్రేయస్కరముగాదనియు, మొఱపెట్టుకొనిరి. అన్నియును యేలినవారికడ విన్నవింప నాకు జ్ఞప్తియుంచులేవు.

ప్రతా—అప్పుడు మాధవుడేమనియెనురా?

భద్రు—మీరు భయపడకుడు. మీ మతముజోలికీ మేము పోవువారము కాము. సార్వభౌమునకు మీపై మీమతముపై గినుకలేకుండ జేసెదను. మీరుపరదేశములకుఁ బోవవలదు. మీమాన్యంబుల మఱల మీకిచ్చునటుల జేసెద. చింతింపకుడని పలికిరి.

అనఁ బ్రతాపరుద్రుడు, సరియే, నీవు పొమ్మని పలికి మాధవునికై నిరీక్షించుచుండెను. ఇంతలో మతగురువు లిదే సమయమని, ప్రతాపరుద్రునితో నిట్లనిరి. మహారాజా! మాధవుడు జైనపక్షపాతి. మమ్ముల నాతడు చాలనీచముగా జూచుచున్నాఁడు. ఎప్పుడును మాపై తిరస్కారభావమునే చూపుచుండును. సార్వభౌముని గురువుల కట్టియున

మానము కలుగఁగూడదు. మాయపమానమే, మీయపమానము. ఇంతియేగాక మీరు గావించుచున్న పని మంచిది కాదని చాటుచున్నాఁడు. ఇప్పుడు జైనులతోఁ జేసిన సంభాషణము వింటిరికదా! మీకేమో హితవుగరవ్వునఁట. అట్లయిన తానిపాటికే వీరస్మార్తమాని మతాచార్యుఁడుగ నుండిన బాగుండును. చూడఁబోయిన నిరువదేండ్లు తిన్నఁగలేవు. సంఘ సంస్కర్తవలె మమ్ముల దిద్దఁజూచుచున్నాఁడు. మహారాజులకింతగా జనువిచ్చినఁ జాలవిమర్శించును. ఆతని యవిధేయతను జూచి సహింపలేకున్నాము. సేనానులలోఁగాని యితరోద్యోగియులలోఁగాని యెవ్వఁడును మమ్మిట్టులగౌరవముగఁ జూచి యుండలేదు. ఈతఁడు మతద్వేషియు, గురుద్వేషియునై యున్నాఁడు. అని యింకను నుద్రేకవాక్యములను బలుకఁ బ్రతాపరుద్రుఁడేమియును మారుపలుకలేదు. ఇంతలో మాధవుఁ డశ్వంబునుండి దిగి మహారాజు చెంత కేతెంచి చేతులుజోడించి శిరంబును వంచి నమస్కరించెను. ప్రతాపరుద్రుఁడు మాధవు నమస్కృతి నందుకొని తన పార్శ్వంబున గూర్చుండ సంజ్ఞచేసెను. మాధవుఁ డాతని యానతి నట్లు గూర్చుండెను. ఇదివరకే మాధవునిపై మిక్కిలి కోపభావముతోనున్న మతాచార్యు లిప్పుడుగూడ మాధవుఁడుతమకు నమస్కరింపకుండుటచే వారి నేత్రములరుణములై యొప్పారుచుండెను.

ప్రితా:—మాధవా? నీరాకకింతయాలస్యమైన దేమి!

మాధ:—మహారాజా? మార్గమధ్యమున జైనులచే నవరోధింపఁబడితిని. నేనుద్వరపడుచున్నను వారలు వదలక మొఱవెట్టుకొనుచుండుటచే నారాకకింత యాలస్యమైనది.

ప్రితా:— జైనుల మొఱకు గారణమేమి ?

మాధ:—సార్వభౌమా? వారిక్షేత్రములు గ్రహింపఁబడుటచే జీవనోపాధిలేక దారపుత్రా[illegible]తో మిక్కిలి కుందుచున్నారు. వారి మతగ్రంథములు దగ్ధముగావింపఁ బడుటచే విచారించుచున్నారు. వారలస్థితి మిక్కిలి శోచనీయమైయున్నది. మామతంబుపై కత్తిగట్టుట మహారాజునకుఁ దగదనియు; మమ్మిమున్నువలెఁ బరిపాలించుట మహారాజునకు శ్రేయస్సనియు మొరపెట్టుకొనిరి.

ప్రితా:—వారల యుద్దేశ్యము చాలఁ క్రూరమైనది. స్వమతంబును వ్యాపింపఁజేసి పరిశుద్ధమతంబును నాశనమొనరింపఁజూచుచున్నారు. మతవాదంబుల గెలువలేక యీర్షచే తాముపట్టిన కుందేటికిఁ మూడేకాళ్లని పట్టినపట్టు వదలకున్నారు. కనుకనేదానికి, దగినఫల మనుభవించుచున్నారు. వారలనిప్పుడు దయదలఁచిన మతతత్వముల మరుగుపఱచి లోకమున కపకారమును గలుగజేయుదురు. నీవువారల దరికిఁబోకుము. అది మదిష్టంబునకు వ్యతిరేకము.

మాధ:—మహారాజా ? తాము ప్రజాశరణ్యులు. ప్రజాక్షేమము మీ ముఖ్యధర్మము. తామిట్టి కిన్కనబూనం దగదు. ప్రతిమతంబునందును బరమార్థము గలదు. దాని యందు వారలకు దృఢవిశ్వాస మమరియుండును. నిర్బంధమ తావలంబనమునఁ బ్రయోజన మేమియులేదు. తాము జ్ఞానైకదృక్కులు; స్వోదర పోషణంబునకై కొందఱిచ్ఛకము లాడుచు నిర్మలంబగు ప్రభుచిత్తంబునఁ జెఱుపుచుందురు. ప్రభువుపర్యాలోచన గావించి సర్వమతంబులవారిని సమానదయతోఁ బాలించు టుచితము.

మాతాచా:—మాధవా? నీవు జ్ఞానివి. సార్వభౌము డజ్ఞాని. అస్మదుపదేశంబునఁ గలుషితంబగు ప్రభుచిత్తమును నిర్మలంబుగ నొనరింప నీవొక్కఁడవే సమర్థుడవు. పాపమునీవు మిక్కిలి శ్రమతీసికొంటివి. సార్వభౌమునికడ నీబోధ లింకఁ జాలును.

మాధ:—గురువులట్లు కోపంబు జూపంజనదు. సార్వభౌముని మంచిచెడ్డలు మీయందున్నయవి. జైనమతము నందు మీ కభిమతము లేకపోయినఁ బోనిండు. వారలపైఁ బగబట్టి సాధించుటనుచితము. ఇతర మతంబులపై ప్రభువునకు రోషమును బుట్టించుట దేశమునకు ప్రభువునకును గూడ హానికరము.

మతా—సార్వభౌమునకు మేముగావించు బోధన లన్నియు రోషమును బుట్టించునవియేనా ?

మాధ:—నేనట్లు నడువ సాహసించను. భగవద్విష యైకచర్చలను శాస్త్రవ్యాసంగములను సల్పి మోక్షమార్గమును జూపిన నెల్లఱకును సమ్మతంబేకాని మతచర్చలచే బృథివీశుని నావేశునిగా జేయఁగఁగదు. ఈమార్గము దేశమునకును ప్రభువునకునుహానికరమని తెల్పితిని. ఇంతియేకాని మీబోధనలన్నియు రోషమును బుట్టించు నవియే యనినేననను.

మతా:—మాటిమాటికిని హానిహానియనిపలుకుచుంటివి, అదియెద్దియో తెలిపెదవా?

మాధ:—కుమింతురేని యింతకంటె దారుణవిపత్తు వేరొకటలేదు. దానిని హానియని చెప్పజాలను. మహాపిశాచమని చెప్పందగును. మతావేశము చాలపెద్దది. ఆదేవని పూర్తిగ నావేశించెనేని యెట్టిఘోర కార్యములనైనఁ జేయించును. ప్రాణంబులపై నాసవదలించును. ఆత్మబంధువులకును నాలుబిడ్డలకును గలహంబులఁబెంచును. ఇదియెన్నియో రాష్ట్రంబులఁ గ్రూలద్రోసెను. సార్వభౌముని మేలుకోరుదురేని మీరుప్రభువున కన్యమతంబుపై రోషమును బుట్టింపకూడదు.

ఈకడపటి వాక్యమునకు మతాచార్యులనేత్రాగ్నులు జ్వాలాయమానములయ్యెను. ప్రతాపరుద్రుఁడు వ్యాకులమనంబుతో నిట్లనియె.

ప్రతా:—మాధవా? నీకిటువయిని మతవిషయము గూర్చి మాకడఁ జర్చింపకుము. నాయాజ్ఞనఁ జెల్లింతువే

నేటినుండి నీవు జైనుల జోలికిబోకుము. జైనులును జైనమతమును నాకువిరోధములు. నీవు వానినిఁ బహిష్కరింపఁ జేసిన నాయనుగ్రహమునకుఁ బాత్రుడవగుదువు.

మాధ:—ఈవిషయములో సూత్రము సార్వభౌముని కడ చనవుగలిగియే మసలుదును. తాము విష్ణు సన్నిభు లగుటచేఁ బాలింతురని నమ్మియీకష్ట మింకొక వాక్యము నొక్కి చెప్పుచున్నాను. నేను జైనమతముపై నభిమానముతోఁ జెప్పుచుంటినని తలంపకుడు. దేశమున కుపద్రవము రానున్నప్పుడు మతములన్నిటిని నొకమూలఁ బెట్టి కేవలము దేశాభిమానముతోనే పనిచేయవలెను. జైనులు పరదేశంబునకుఁ బోయిన-చో నిచ్చటి రహస్యములెల్లఁ బరరాజుల కెరింగింతురు. దానసామ్రాజ్యమునకు హానికలుగును. ఇంటిగుట్టు లంకకుఁ జేటన్నట్లు మనగుట్టంతయు బరరాజున కెఱిఁగించిన-చో ముప్పువాటిల్లును. కావున నోసార్వభౌమా! వారల కభయమిచ్చి మునుపటివలెనే యాదరింపదగు. దేశహితమును గోరియు, ప్రభుక్షేమమును గోరియు, నిష్కల్మష హృదయముతో సత్యమును బలికితిని. రాజు మహావిషయంబులఁ గలుగఁ జేసికొనిన స్వాత్మరక్షణంబునకు హానికల్గును.

పిమ్మట సార్వభౌముని చిత్తము.

మత:—బాగుగ నాలోచించిచూడ నీవే జైనులను బురికొల్పి రాజుపై గుట్రలు పన్నుచున్నట్టుకనఁబడుచున్నావు.

లేకున్న వలదువలదని సార్వభౌము డెన్నివిధంబుల జెప్పినను వినక మరలమరల నావిషయంబునే యేలచర్చించెదవు? మహారాజునకడ నిట్టియమంగళముల నూరకవచింపదగదు— మాధవుని నేత్రములరుణములై నిప్పులు గ్రక్కుచుండెను. శరీరము కంపించుచుండెను. రక్తనాళములు పొంగి ముఖ మెఱ్ఱబడియెను. ధీరుడును, వీరుడును, నగుమాధవు డావరాభవమును సహించువాడు కాడు. అతడిట్లనియె.

మాధ:—ఓ బ్రాహ్మణులారా! మీరు మీబ్రాహ్మణధర్మమును వీడి మాటలాడుచున్నారు. మాధవుడు పద్మనాయక వెలమవీరుడను మాటమరువకుడు, మీరు గురుపదమును నధిష్ఠించి యుండుటచేతను, బ్రాహ్మణులగుటచేతను, నేను చక్రవర్తియాజ్ఞకు లోబడియుండుట చేతను నాఖడ్గమొఱలో మూల్గవలసివచ్చెను. మీరుమీస్వధర్మమును వీడితిరి. మాధవుడు స్వధర్మమును వీడువాడు కాడు. ఉన్న యథార్థమును బ్రభువునకు విన్నవించితిని. ప్రభువునకు మంగళములు చేకూరునిమిత్తమే నేనట్లు పలికితిని. రోగికి పథ్యము చేదగునటుల నవి మీకు నమంగళములునటె దో చెను. మతమునకును రాచకార్యములకును సంబంధమును గలపిన నతుకుగొనుటకు బదులు విషమించును, విమ్మటసార్వభౌముని చిత్తము.

ప్రతాపరుద్రునకు విషమపరిస్థితి దాపరించినది. మాధవుని యుద్రేకము ధారాళమైనదే యైనను, యీసమయ

మున వానిని లక్ష్యముచేయకున్న నిషమించునని తలంచెను. గురువులను మందలించుట కంతరాత్మయొప్పినది కాదు. తుద కాతడిట్లనియె.

ప్రతా:—మాధవా? వలదువలదని యొప్పినిధముల జెప్పినను వినకనీవాసిషయమునే సాగించుచుంటివి. నాకును మతాచార్యులయూహసత్యమే యని తోచుచున్నది. గురువుల నిట్లు నిందింపదగునా? నాకడ నిట్లు గురువులనవమానపరచిన నాకపకీర్తి కాదా? నీవిప్పుడైన మతాచార్యులకు క్షమాపణ జెప్పి ఇంతటనుండి ప్రసంగమునకు బోకుండిన నాకడనుండ నర్హుడవు—మాధవుడు, హృదయావేగము ను బలవంతముగా నాపుకొనుచుండెను. పొంగిపొరలి వచ్చు చున్న కోపముతో శాంతభావము ఢీకొని యణచివేయుచుం డెను. ఈరెంటికినిగల పోరాటములో మాధవుని మేను గడ గడ వడంకుచుండెను. ఆసమయమున నామూర్తిని జూచిన నెవరికి భయముగలుగదు. ఎవనికి జాలిపుట్టదు. మాధవుడు ప్రతాపరుద్రుని సన్నిధినుండి చటాలున లేచెను. మతాచా ర్యులు దూరమునకుఁ దొలంగిరి. వారిగుండెలదరుచుండెను. చైతన్యములేదు. మాధవుడు తమ్ము మ్రింగివేయునేమోయని భీతిల్లుచుండిరి. అంత మాధవుడు గంభీరస్వరముతో నిట్లనియెను. ఓపిచ్చిబ్రాహ్మణులారా! మీరేల భయపడియెదరు? మీ బోటి జన్నిగట్టులపై మాధవు డెప్పుడును గత్తికట్టువాడు

కాఁడు. సామ్రాజ్యసంరక్షణభారమును భుజశీర్షములపై నిడు
కొనిన సార్వభౌముఁడుగూడ యుక్తాయుక్తంబుల దూరపఱచి
యిట్లు పలికినందులకు మిక్కిలి విచారించుచుంటిని. సార్వ
భౌమునివంకకుఁ దిరిగి, యో సార్వభౌమా! పొట్టపోషించు
కొనుటకై మిమ్ముల నాశ్రయించుకొని యుండలేదు. ప్రభు
హితంబును గోరియు దేశహితంబును గోరియు, నీపాదసేవ
నాసించితిని. అట్టి నామనోనిశ్చయమును బండకత్తితో గోసి
వేసితిరి. దానిని గోలుపోయి మాధవుఁడు నీకడనుండఁజాలఁడు.
ఏయడవినైన నేకందమూలములనో దిని మాధవుఁడు జీవింప
గలఁడు. నేను మతాచార్యులయెడ గావించిన మహాపరాధ
మేమి? వారలను క్షమాపణము వేఁడుకొనునంతటి దుష్కార్య
మేమి యొనరించితిని. అపరాధములేనిదే మాధవుఁడు క్షమా
పణమును వేఁడఁడు. మహారాజా! మఱల నేనొకవాక్యమును
జెప్పుచున్నాను. ఇంటిగుట్టు లంకకుఁ జేటనుమాటను మఱువ
వలదు. సర్వమతపాలనంబు సమ్మతంబు. జైనులను విడిచితి
రేని మీకెన్నటికైన హానికలుగకమానదు. త్రైలింగరాజ్య
మును రక్షింపుము. మీకహితుఁడైన మాధవుఁడు మీకడ
నుండ నర్హుఁడు కాఁడు. మేనఁ బ్రాణంబులున్నంతవఱకు మాధవు
డెప్పుడును బ్రభుశ్రేయమునే కోరుచుండుఁగాక! ఇదే నాకడ
పటివందనము. అని చేతులుజోడించి నమస్కరించి—యిదే
మాధవుఁడు పోవుచున్నాఁడు— ఆశీర్వదింపుము. అని పలికి

యోలతామంటసముసాం శీవలకుం జె. గుసుని నొకగింతు నై చెను. పరితాపరుద్రుడు తటాలున లేచి పరివడిబోయి మాధవుని కరంబును బట్టుకొని, మాధవా! తొందరపడకుము. పోవుటకుగానిచో, నాయాజ్ఞ లేనిదే నీవు పోవుట పాడిగాదు. రేపటి దినంబున సమ్మానించి మాయాజ్ఞనుగాని పనుపుటకు నీవు చ్చివచ్చిననాటికిం బోవచ్చును. తొందరపడక నిలింపుమికం బొమ్మనిపలుక మాధవుడు మారుపలుకక దలయూచెను. సార్వభౌముడు గోష్ఠిచాలించి మంత్రాచార్యులతోడను విద్వన్మహాకవులతోడను నిజభవనంబున కరిగెను. మాధవుడు నశ్వంబుపైనధిరోహించి నగరోన్ముఖుండై పోయెను.

---

## —: పదునొకండవ ప్రకరణము :—

ఆత్మవిజ్ఞానము. ఆత్మగౌరవము, సమతనుంబులెల్ల, భూతదయ, యను నీయైదుగుణంబు లెవరియందు విరాజిల్లుచుండునో, నిజముగ వారేకదా లోకమాన్యులు. ఎవరు తమ్ముం దెలిసికొని మెదరో వారు బ్రహ్మనుం దెలియనగుదురనుటలోక విదితము. ఈయైదుగుణంబులలో నాత్మవిజ్ఞానము ప్రశస్తము. తాననేమియో, ప్రస్తుతము తానెట్టిస్థితియందుండెనో. యనంతరము తాం జేయవలసినం గార్యమెద్దియో, తన గమ్యస్థానమెటులలభించునో, యీమొదలగు ప్రశ్నలన్నియుం

బ్రీతి వాని హృదయమునందును, మెఱంగుచుండవలయును. ఇది మానవుడాచరింపదగు ముఖ్యధర్మము. ఇది సుఖైకసాధనము. సుఖమనునది స్వాతంత్ర్యము ననుసరించియుండును. మానవుడు సుఖమునందగోరుచో స్వాతంత్ర్యమును సంపాదించితీరవలయును. స్వాతంత్ర్యములేనివాఁడు పంజరములోని చిలుకవలె యొరులసహాయ మపేక్షించుచు దాస్యజీవనముఁ జేయవలసినవాడగును. మాధవు డాత్మవిజ్ఞాని, స్వేచ్ఛాపరుడు. ఆత్మగౌరవముకలవాడు. దమ శమంబు లీతనికిఁ జిన్ననాఁటిమిత్రములు. భూతదయ స్వభావగుణము. చక్రవర్తిగావించిన యవమానము శూలమువలె నాఁటును, అంతరాత్మకు సత్యమని తోఁచిన విషయమును నిర్భయముగ తెలుపు స్వభావముగలవాడు. చక్రవర్తి తనపై యాగ్రహముగలిగియున్నాఁడని తెలిసియుండియు వెరువక తనధర్మమును దాను నెరవేర్చుచునే యుండెను. ఎవరిమేలునుగోరి తా నీపనికిబూనెనో తుదకాతని యాగ్రహమునకే పాత్రుఁడయ్యెను. ఆంధ్రసామ్రాజ్యమును స్థిరసామ్రాజ్యముగా జేయవలెనని యాతనితలంపు. మతకలహములు దేశమునకు హానికరములని మాధవుడు గట్టిగ నమ్మియుండెను. ఇప్పుడా తడు శ్రీధరునియింట పడమటిమహాలులో పడకకుర్చీపయిని పరుండియుండెను. శ్రీధరుఁడు చక్రవర్తిపనిమీఁద గ్రామాంతరమునకుఁ బోయెను. విశ్వాసరాయుడు కొంచె మస్వస్థతగనుండుటచే యెచ్చటనో బరుండెను.

కోకిలకూడ నాతనియుపచారమునకై యాతనివద్దనే పడియుండెను. రుక్మిణి, శ్రీధరునిగదిలో బరుండి మధుమతిని తనయొద్ద బరుండుమని బిలిచెనుగాని మధుమతి, నీవు బరుండుము నేను కొంత కాలము చదువుకొనివచ్చి పరుండెదనని చెప్పి తనగదిలోనికి బోయెను. మాధవుడు నేడు బద్ధకముగానున్నదని పాలు మాత్రమే త్రాగెను. మాధవుడు నాడు భోజనమును మానుటచే మధుమతి కేమియును దోచుటలేదు. ఆమె తనగదిలో నిటునటుదిరుగుచు గవాక్షమునుండి పడమటిమహాలును విలోకించెను. మాధవుడు కుర్చీనుండి లేచి యిటునిటును బచారు చేయుచుండెను. చక్రవర్తి కోపానలము హృదయమును గాల్చుచుండుటచే యావేశనపడుచుండెను. దానికిందోడు ముందుగతియేమి, యనునాలోచనతోడై మరింత పిచ్చియెత్తించుచుండెను. అతని బచారునకు నియమములేదు. ఒకమారు తిన్నగను వేరొకమారు వక్రముగను సష్టముగను దిరుగుచుండెను. తుదకు దాను బచారుచేయుచున్నట్లుగూడ నాతడెరుంగడు. ఈయవస్థలో అతనినోటనుండి, ముందుగతియేమి, పోవుటెట్లు— మధుమతిగతి— విడిచియేనా? అనువాక్యములు వెలువడెను. అవి గవాక్షమునుండి లక్ష్యముతో జూచుచున్న మధుమతి చెవిలో సూటిగావచ్చిపడెను. మధుమతి మనసున నొకవిధమగు గందరగోళముపుట్టెను. మాధవునకేదియో విషమపరిస్థితి దాపరించినదని దలచెను. ఇంతలో మాధవుని

యాలోచన నిలిచెను—మాధవుడును నిలిచెను. అతడు తన తలనుపైకెత్తి యిటునటును జూచెను. గవాక్షమునందుమధుమతీ వదనచంద్రబింబమును గాంచెను. కాంచుటయేతడవుగ నాతనికనులశ్రుపూరితములై గంతలుకట్టినట్లు లయ్యెను. ముఖమునువంచి యుత్తరీయముచే గనుల దుడుచుకొనెను. ఇక మధుమతి తాళలేకపోయెను. ఇటునటుచూచి మహాలులోని కున్న ద్వారమును నెమ్మదిగ దెఱచి రెండడుగులు మహాలులోనికివైచి నిలిచి మందస్వరముతో ప్రాణేశ్వరా! యేమి? విపత్తనెను. మాధవుడుతొట్రుపడుచున్న నడకతో మధుమతిని సమీపించి మధుమతీ! ఈమందభాగ్యుడు నీకు దూరమైపోవుచున్నాడు. చిన్ననాటినుండియు వర్ధిల్లిన మనస్నేహలతాపాశము నేడు విచ్ఛిన్నమగుచున్నది. నేనుఏకశిలానగరమునుండి గెంటివేయబడుచున్నాను. మతాచార్యుల దుస్తంత్రములచే బ్రతాపరుద్రుని మూఢవకన్ను తెరవబడినది. దానినుండి యవమానాగ్నిజ్వాల వెలువడి నాశరీరమును దహింపజేసినది. తెలవారిన బ్రతాపరుద్రుడు నాకొఱకు వర్తమానమంపును. ఈయవమానముతో మరల నేను కోటగుమ్మమును ద్రొక్కుట పొసగదు. నాయంతరాత్మ యిందుల కంగీకరించుటలేదు. ప్రాణేశ్వరీ! పోవుచున్నాను. క్షమింపుము. భావివిపత్తులెన్ని యోనిన్నెదుర్కొననున్నవి. ఎట్లు తప్పించుకొందువోగదా? మధుమతీ!—మధుమతి కనులనుండి యశ్రుబిందువులు బొట

యీమె నావంటి మిత్రుని సహాయమును గోరుచున్నది. ఆమె పాదారవింద పూజావిధానమునకు నాశరీరమందలి జీవరక్తకణములన్నియు పాద్యాదుల కుపయోగపడునెడల ధన్యతగాంచవలెనని తలంచుచున్నాను. నాసంకల్పసిద్ధికి గాలభగవానులు యెన్నోసారులు మరలనిన్ను గలసికొనియెదను. మాధవుడు కపర్దిగుడు, సౌభాగ్యహీనుడని తలంపకుము. మాధవుని యర్ధశరీరమే యిప్పుడేగుచున్నదని తలంపుము. నాప్రేమైకస్థానమా, నాబహిఃప్రాణమా? నాజీవితసర్వస్వమా? మధుమతీ; అనుజ్ఞ, యిమ్ము. హృదయేశ్వరీ, దయయుంచి పంపుము, అనిపలికి యామెకరకమలమును తనహస్తాబ్జమునబట్టి హృదయమున జేర్చికొనియెను—మధుమతి యాతనికేమి జవాబీయగలదు. క్షుభితమనస్కయై కంపితగాత్రియై, బేలయై గోలుగోలున నేడ్చుటకన్న జవాబేమీయకలదు ?కానియట్లు జరుగలేదు. అద్భుతపరిణామము, ఆప్రేమచంద్రుని చంద్రికను తదేకలక్ష్యముతో దనివితీర గ్రోలుటలో చకోరమైకను లాడించుచు హృదయేశ్వరా? నాకరమును నీహస్తాబ్జమున బట్టినీహృదయపీఠమున జేర్చుకొంటివి. ఇదియేపాణిగ్రహణము, నేనిక నీకద్దు—అనునంతలో రుక్మిణిమేలుకాంచి, మధుమతీ మధుమతీ యింకనుజదువేనా? రా? రమ్మనిపిలిచెను. ఆపిలుపుతో మాధవుని హృదయతల్పమున హస్తాబ్జాశ్లేషితమై సుఖనిద్రనందుచున్న మధుమతీ హస్తమధువము, సూర్యకిర

—: సండ్రాండన ప్రకరణము :—

ప్రతాపరుద్రచక్రవర్తి యాబాల్యకవి. తారసజ్ఞుడను విద్వద్గోష్ఠీప్రియుండును, నగుకతంబునఁ దన యాస్థానంబున విద్వన్మహాజనములను, కవిసార్వభౌములను, ననేకులనిలిపిపోషించు చుండెను. ఈతఁడు మిక్కిలిరసజ్ఞుడు. ధీవిశారదుడు. కవులలోఁ గవి—పండితులలోఁ బండితుడు. భాషాభిమాని, అప్రతిహత ప్రతాపుడు—వీరశిఖామణి—ఈతనినినొరులతో సాటిచెప్పుటకు వీలు పడదు. ఈతనికీతఁడేసాటి. ఈతడు వజ్రసింహాసన ము నధిష్ఠించియుండెను. ఆతని పురోభాగంబున విద్వత్కవి సార్వభౌములును, మతగురువులును, నుచితాసనంబుల నుపవే శించియుండిరి. వీరలలో నొక్క మహాపురుషుడు, సువర్ణతం తువులచే నల్లబడిన లతాపుష్పమయంబై విరాజిల్లు పట్టుశాలు వను మేనునిండఁ గప్పుకొని కూర్చునియుండెను. ఆతని వదన మతివిశాలము. భ్రూమధ్యభాగమున కుంకుమతిలక మలంకరిం పఁబడియున్నది. కర్ణపీఠమున రత్నకుండలములుయ్యాలలూగు చుండెను. ఆతఁడు తనకేల నిటునటును గదుపుచు నేదియో వ్యాసంగము జేయుచుండెను. ఆతడు విద్యానాథమహాకవి. ప్రతాపరుద్ర యశోభూషణంబను యలంకారశాస్త్రమును జదివి వినిపించుచుండెను. ఈ యలంకారశాస్త్రమును ఈ మహాకవి రచించి ప్రతాపరుద్రున కంకితముజేసెను. దానిని

ప్రతా—అయ్యనవ్రోలు తండ్రికడ కేగియుండనోపు.

భ్రమ—లేదు. అచ్చటినుండియే శ్రీధరనాయనంగారు వచ్చియున్నారు. ఈవార్త, యయ్యనవోలునకప్పుడే చేరినదట

ప్రతా—అయ్యనవ్రోలుసంగతులింకేమైన దెలిసినవా?

భద్రమ—నాతనయు నవమానించుటకుఁ జక్రవర్తికే నేను యపరాధమొనరించితినని సింగనాయనగారనినట్లు వారిబంధుగులాకరన్నారు.

ప్రతా—సరియే నీవుపొమ్మని వారికి సెలవొసంగి [తనలో] నాడు నేనాడినమాటకు మాధవుడలిగినాడు. అది తప్పిదమైనమాటయేమైననునాసమయమునకట్టులనవలసివచ్చె (ప్రకాశముగా) విద్యానాథా! చిన్నతనమగుటచే మాధవు డోర్మిని జూపలేకపోయెను.

విద్యా—మహారాజా! మాధవుడు మొన్న నుద్యానవనములో నను సన్నిధినిబలికిన వాక్యములు కల్మషరహితములు. అందుఁ గొంతయథార్థమున్నది. అతఁడు బాలుడయ్యును—ప్రభుసేవాపరాయణుఁడు.

ప్రతా—ఆసంగతి నాకుఁ దెలియును. పట్టినపట్టు సాధింపఁజూచుచుండును. కార్యసాధనమగువరకు భయములేక మాటలాడుచుండును. అతఁడు కోపముతో లేచిపోవుచున్నప్పుడు నివారించితిని. రేపు నాదర్శనమొనరింపు మని శాసించితిని. మరల నాచెంతకే రామానెను. శాంతింపజేసి యాతనిక్కపట్టునుండి మరలింపఁ దలంచుకొంటిని.

మతా—రాజా! మాధవునివిషయములో మీరింకను పొరపడుచునేయున్నారు. ఆతఁడు బాలుడని దయదలపరాదు ఉద్దేశ్యము చాలక్రూరమైనది. జైనులను బురికొల్పి తనసామ్రాజ్యమున నీకపకారమునుఁ జేయదలంచుకొనియున్నాఁడు. మీరు విరుద్ధముగా జైనమతము నుద్ధరింపవలెనని దలంచుకొని యున్నాడు. ఏదియోయొక మిషయుండినగాని తప్పించుకొనుటకు వీలులేదని యీపన్నాగమును బన్నినాడు. ఆనాడెచ్చటనో రహస్యముగగుట్రలు బన్నుచునేయుండును. చెడుకాలమునకే యీతని కీబుద్ధిపుట్టినది. నిజముగ దాసభిక్షువునకు నా దలచుకొన్న వలదువలదనుచున్నను మీతో సంతసమ్మాన్యముగ వాదించునా'

మతాచార్యులవాక్యములకు విద్యానాథుడు మందహాసమునుచేసెను. దానియర్థమును మతాచార్యులుకనిపెట్టలేదు. ఆహాసము చాలభావగర్భితమైయున్నది. మహాకవి హాసభావము లందరకును సుఖబోధకములు కావు. అది మతాచార్యులపై నొలతీక్ష్ణబాణప్రయోగము. ఈబాణమునకు రూపము లేదు. ఇది గాయపరుపకయే హృదయమును జొచ్చును. మతాచార్యులు, విద్యానాథుడు తమవాక్యములకుసంతసించుచున్నాడనుకొనిరి. ఆమందహాస మర్ధనిముషములో సంపూర్ణమొందెను. అది ప్రతాపరుద్రుని కంటబడియెను. అతఁడు రసజ్ఞుడు, భావమును సులభముగా గ్రహించెడిశక్తి యీతనికి

గలదు. గోచరమాత్రముననే యాత డన్వయమును జేసికొన గలడు. అందుచే నామందహాసము సార్థకమునొందెను.

ప్రితా—అట్లుతలంచుటకు వలనుపడదు. నాయంత రాత్మ యంశుల కంగీకరించుటలేదు. ఆతఁడు నాకు ద్రోహమునుఁ దలంచునను యనుమానములేదు. ఆతని హృదయము పరిశుద్ధమైనది. కార్యదక్షుఁడు. మాసామ్రాజ్యమున కాతని సాహాయ్యము చాలఁగ గలదు. ఎటకుబోయి యుండెనోగదా?

విద్యా—నాటితమవాక్యముల కాతఁడు నొచ్చియుండెను. మరల మిమ్ములఁ జూచుటకు సిగ్గుపడియెను. ఆతని సామ్రాజ్య సంరక్షణ సంకల్పమునిష్కల్మషమైనదియే యని తలంచుచున్నాను.

ఇటు విద్యానాథుఁడును నటుచక్రవర్తియుఁ బలికిన బలుకులు, మతాచార్యులకుఁ జాలగష్టముగా దోచెను. మాధవునిపై వీరిట్లు సదుద్దేశ్యమును బ్రికటింతురని తలంచియుండ లేదు. తమ నీచభావమును వెల్లడించి మనోదౌర్బల్యమును జాఱవిడిచిరి. తమవాక్యములకుఁ జక్రవర్తి ఖండనపూర్వక ముగా బదులుచెప్పెను. విద్యానాథుఁడు దానినిబలపఱచెను. తమవాదము నెట్లయినను స్థిరపరుపవలెనని మతాచార్యులు యుక్తుల వెదకుచుండిరి. గొంతుకపడిన పచ్చివెలగకాయ వలె మ్రింగుటకును గ్రక్కుటకును గూడవీలులేక బాధపడు చుండిరి. ఎటులయినను మరల మాధవుని పునరాగమనము

లేకుండ జేయవలెనని విశ్వప్రయత్నముల జేయుచుండిరి. దానికిది సమయముకాదని కనిపెట్టిరి. ఆకారణమున వారేమియును బదులుచెప్పక మిన్నకుండిరి. కాని మరల కొంత వడికిట్లనిరి.

మతా:—అతఁడీ యూరనే యుండునని తలంచెదము. ఏ జైనమందిరముననో గుప్తముగా నుండును. ఎన్ని చెప్పినను నాతనికి జైనులయందుఁ బక్షపాత ముండెనని చెప్పవీలగును. జైనుల నిర్బంధపఱచిన నాతనియునికిఁ దెలియగలదు.

విద్యా:—మతాచార్యులకు నాదొక మనవి. కొరివి పెట్టి తలగోకికొన వద్దని చెప్పుచున్నాను. మీతలంపు సరియైనది కాదు. ఆతఁడు రహస్యముగ జైనమందిరమున దాఁగియుండువాఁడు కాఁడు. ఆతఁడెచ్చటనున్నను స్వేచ్ఛగనుండును. ఆతనికొక మతమునందు పక్షమున్నట్లు దోఁచదు. సర్వమతసమత్వమును గూర్చి యానాఁడాతఁడు పలికియున్నాఁడు.

మతాచార్యులకు విద్యానాథుని మ్రింగివేయ వలెనని యున్నది. ఆవిద్వత్కవి మార్తాండుని కన్నెత్తిచూచుటకు వీరితరమా? నిరంకుశాః కవయః, అను నార్యోక్తిని బాగుగా నెఱింగినవారు కవులపై కుఱకఁబోరు. స్వాతంత్ర్యము వీరి సొమ్ము, నాఁడట్లు మాధవుఁడే మాటలాడఁగలిగినాఁడు. నేఁడిట్లు విద్యానాథుఁడే మాటలాడఁగలిగినాఁడు. మతాచార్యులయశక్తి దుర్జనత్వమూ బాల విరు సీపుంభావ సరస్వతిని ; యేమిచేయఁగ

లను. కమలిన వంకాయవలె ముఖములు నల్లనడి దుర్జన స్వభావమును వెల్లడించుచుండెను. మతాచార్యులు తుద కిట్లనిరి.

మతా:—అయుక్తప్రవర్తనుడగు కుర్రవానిని మీర భిమానించ కూడదు.

విద్యా:—బాలుడైన ప్రహ్లాదుని ప్రవర్తనముయుక్తమైనదగునో నితనిదికూడ యుక్త ప్రవర్తనయే. వృద్ధుడగు ధృతరాష్ట్రుని ప్రవర్తన, యుక్తమైనచో మీయదిగూడ యుక్తప్రవర్తనయే. ప్రహ్లాదున కండగనుండిన నృసింహుడు దోషియగుచో మాధవ బాలునభిమానించిన దోషమునన్నుఁ జెందుగాక.

ప్రతా:—ఇకనీవిషయమును వాద ప్రతివాదముతో విమర్శింపఁ జేయకుడని నాప్రార్థన. సత్యవాదికున్న నిర్భయ మితరులకుండదు. దానిని నేనెఱుంగుదును. బాల్యచాపల్యమున మాధవుడు ప్రభుగౌరవమును నిలుపుకొన లేకపోయెను. అట్లయ్యును మాధవుడు వదలుకొన దగినవాడు కాడు. మతముజోలికిబోకున్న మాధవుడు నాసర్వసైన్యాధిపత్యమున కర్హతసంపాదింపగలడు. ఈప్రథమ తప్పిదము క్షమింప దగునదియే. మఱల నాతనిరావించి వేఱొకయవకాశమిచ్చెదను.

విద్యా:—అదియే నాప్రార్థనము. అనునింతలో భోజనసమయ మయ్యెనని సేవకుడు నివేదించెను. గురువులకు

శైలవాసంగి ప్రతాపరుద్రుడు లోనికిఁ బోవుచుఁ దనలోనిట్లను కొనియెను. నేను తొందరపడి యిప్పుడే మాధవునికై యత్నించితినా? యాతనికి మరింత జైనపక్షపాతము హెచ్చును. కొన్నిదినము లుపేక్ష సేయుటమంచిది. లేకున్న గురువులకు వ్యసనమును గలుగజేసిన వాడనగుదును. కానిమ్ము, ఎందుకైన నిరీక్షణమే మంచిది.

---

## —•పదమూడవప్రకరణము.•—

మధుమతికిఁ దనకన్నీటినిఁ దుడుచుకొనుటకుశక్తిలేదు. హేమంతకాలపు కొన్నిప్రాతర్వేళలయందు నాకాశ మానిరిచేఁ గప్పఁబడి వృక్షపత్రముల నుండియు, లతాపల్లవములనుండియు మంచుకణంబు జలజలరాలుచుండును. అటులనే యాలతాంగిహృదయాకాశము శోకంబను యానిరిచేఁ గప్పఁబడి కనుకలువరేకులనుండి, హారంబుననుండి తెగిన ముత్తియంబుల పగిది యశ్రుబిందువులు రాలుచుండెను. ఆమెకీజగ మంధకారమువలె జూపట్టుచుండెను. ఆమెచేత నొకపత్రమున్నది. దానినొకమారు జదువుటచే నామెకీయవస్థ దాపరించినది. రెండవమారు జదువవలెనని యత్నించెను గాని యవకాశము చిక్కుటలేదు. అందేమున్నదో మనకుఁ దెలియదు. ఒక్కనిట్టూర్పువిడిచి యామె కుర్చీపయిని జతికిల

బడియెను. ఇప్పుడామె కనులనుండి నీరుగారుటలేదు. హృదయము శోషించి యుండెను. వదనము రసహీనమై యుండెను. ఇక కనులనుండి జలమెక్కడనుండి వచ్చును. ఇటు జూడుము:—ఈమూల నొక వృద్ధుడు కూర్చునియుండెను. అతడు. విశ్వాసరాయుడు అతడట గూర్చుండుట మధుమతికిఁ దెలియదు. గోడకుఁ జేరవేయబడిన నాతనిఁ జేతికఱ్ఱ జారినేల బడి చప్పుడయ్యెను. మధుమతి యదరిపడి లేచెను. విశ్వాసరాయు డామెకంటబడెను. ఆమె మఱల గుర్చీపై నట్లే చతికిలబడెను. విశ్వాసరాయు డిట్లనియె.

విశ్వా:—అమ్మా! మధుమతీ! అట్లేలవాపోయెదవు. నీకుదైవముచాలఁ బ్రతికూలుడై యున్నాడు. నీదుఃఖమును జూచి నేను సహింపలేను. నిన్నుజూడనాకు జాలియొదవుచున్నది. బిడ్డా! నేనేమిసేయుదును. ఈఘోరవార్త నాచెవిబడినప్పటినుండియు నాగుండెలవియుచున్నయవి.

మధు:—తాతా! నీవిప్పుడిక్కడ కెప్పుడువచ్చితివి, అయ్యగారి యత్నమేమియో తెలిసినదా?

విశ్వా:—నేనిక్కడకు వచ్చియొకగడియ కాలమయినది. నారాకనుగూడ నెరుంగలేని దుఃఖమునబడి యుంటివి. అయ్యగారు మాధవుని గనుగొను విషయములో మిక్కిలి శ్రద్ధదీసుకొనుచున్నాడు. పంపినభటులు తిరిగితిరిగి యాతని జాడను గానక నిరుత్సాహులై వచ్చియున్నారు. అయ్యగారేమియును సంతోషముగ లేరు.

మధు—నాజనని తలంపెట్టులుండెనో కనుఁగొంటివా?

విశ్వా—మండుచున్న శోకాగ్నిలో నాస్యమును బోయుట నాకిష్టములేదు. అదేమి శుభంబని తెలుపుదును.

మధుమతి మాఱుపలుకలేదు. ఆమెహృదయమున నా వాక్యమతిగాఢముగ నాటెను. దానంజేసి కనులుమూసికొని వాపోవుచుండెను. తనతల్లి మనోరథ మీడేరుట కిప్పుడు చాల యవకాశము చిక్కెను. ఆమె జయమందుటకు సందియము లేదు. మధుమతియాశలు మాధవునను సరించి యంతర్హితము లగుచుండెను. ఎట్టకేల కామె యిట్లనియె.

మధు—తాతా! నాదురదృష్టమున కేమిచేసెదవు? ఈమందభాగ్యురాలెట్టికష్టములకైన నొడిగట్టి సిద్ధముగ నున్నది.

విశ్వా—బిడ్డా! మాధవరాయల పోకడనుగూర్చి మీ యమ్మ యెట్టివికారమునుఁ జెందియుండలేదు. ఆమెకా చింత యేలేదు. తన యన్నతో నుత్తరప్రత్యుత్తరములను జరుపుచునేయున్నది. నేటిసాయంకాలమునకు నీయత్తయు మామయుఁగూడ వత్తురు. కామపాలుఁడు నేఁడువచ్చునో రాఁడో తెలియదు. కాని రెండుమూడురోజులలో తప్పక రావచ్చును.

మధు—వారి నింతత్వరగలో రప్పించుటకు హేతువేమి?

విశ్వా—నీవింకనుఁ బెడదారిలోనేయున్నావు. నిన్ను గామపాలున కీయుమని నీతండ్రినడుగుటకై రప్పించుచున్నది

విశ్వా—బిడ్డా! వగ యుడుగుము. సాహసములేని ధీశాలి కార్యపరిణామమును గూర్చి యిప్పుడే [illegible] గలము. ఆసమయమునకు భగవానుడేదియో తెలుపుజూపిం చును. ఊరకవిచారించిన లాభమేమి?—అమ్మా! నీచేతిలోని పత్రిమేమి? దానిం జదువుచు నీవమితదుఃఖము ననుభవించి తివి. దానిసంగతి యేమియో చెప్పెదవా? చెప్పజాలనియెడల నా చపలత్వమును మన్నింపుము.

మధు—తాతా! నీకన్న నాకాత్మహితుడెవ్వడు. నీకసాధారహస్యమును దాచెదనా? నేన[illegible] నీకు తెలియక పోదు. తాతా! నేడొకబైరాగి [illegible]గిటనిలిచి భ[illegible]రి త్రమైన రామగానమొనరించెను. ఆరామగానము నన్నాకర్షించెను. నేను వీధిగడపకడకేగి నిలిచితిని. ఆతడు [illegible] పాడుచు నా దరికేతెంచి సోదరీ యీపత్రముందికొనుము. [illegible] నా చేతబెట్టి తక్షణమే యటనుండి బోయెను.

విశ్వా—ఈలేఖ యెవరువ్రాసినది?

మధు—మాధవరాయలు.

విశ్వా—లేఖను బాగుగాఁ జదువుకొంటివా?

మధు—తాతా! నాకనులు [illegible] చున్నవి. నాయుత్సాహ మడుగంటిపోయినది. [illegible] నీవే దానినిదీసికొని చదువుము.—అనుటయు విశ్వాసరాయుడా లేఖను దీసి యిటునటును రెండుసారులు త్రిప్పి—అమ్మా?

నేను చాలఁబెద్దవాఁడను. అక్షరములగుర్తుపట్ట లేకుంటిని. నీవు చదివిన, వినియెద" అని, యాలేఖ నామెచేతికిచ్చెను. లేఖలో నివిషయము, తాతకుఁదెలియుట యామెకిష్టము. తాత కేమియును బదులుచెప్పక యిట్లు జదువనారంభించెను.

లేఖ—ప్రేయసీ! మధుమతీకల్పలతికమా? భవన్మకరందాస్వాదనతత్పరతతో, మాధవమధుపంబింత కాలము, సంతోషముగ నీచుట్టును బరిభ్రమించినది. నీవాశ్రితకల్పద్రుమంబవు. నాపరిభ్రమంబునుగాంచి, నాకు సంతోషమును జేయఁగోరి వికసితమంజరీనివహంబులతో, నామోదమును వెదజల్లుచు, నిండుయౌవనమునుఁబూని పండువెన్నెలవలెఁ బరమానందమునుగూర్చు స్నిగ్ధరూపమునుదాల్చిన కల్పలతికవు. నేనును, నీస్నిగ్ధరూపమునజూచి యుబ్బుచు, మందహాసంబునఁ బ్రేమపూర్వకముగ, నీవొసంగు స్వాగతంబునకు మురియుచు, నీవునాకొఱకుసిద్ధముచేయుచున్న, మకరందరసాయనంబునుగ్రోలిదేవత్వమునందవలయునని శుభముహూర్తమునకై నిరీక్షించుచుంటిని. దైవమునకు కన్నుకుట్టినది. ప్రతాపరుద్రుని మూఁడవకన్ను తెరువఁబడియెను. దానినుండి దట్టమగు నొక ధూమదండము వెలువడి నాకిచట నిలుచుటకవకాశమీయక యుపఘాతమొనరించెను. ఆధూమోపఘాతముచేఁ దూలి నగరమున కావలబడితిని. సర్వాంగంబులును నొచ్చెను. మనసు వకావకలయ్యెను. 'నాజీవిత మాకాశమున నుయ్యాలనూగు

చున్నది. ఆశాతంతువు లతిదుర్బలములుగ నుండెను. పూర్ణ విడిపోవుచున్నది. తెగుట నిశ్చయము. దెబ్బనుమాన్పుకొనుటకై ప్రాణాచార్యుల నాశ్రయించెదను. నా గాయము మాని పూర్ణారోగ్యమును జెందితినేని, మరల నెన్నటికైన నీచెంత కే తెంచెద. నాయందలి ప్రేమచే నావియోగంబును సహింపనేరక నీసిద్ధరూపమును కృశింపజేయుదువని నేనెఱుగుదును. అదియే, తటస్థించుచో, యాచింతచే నా గాయము మానక మాధవుడు మాధవపదంబున కేగును. మధుసుత్నిక యొకండు నిన్నాశించుచున్నదని నే నెరుంగుదు. దానికిఁబ్రబల ప్రయత్నములు జరుగుచున్నయవి. దానినుండి నీవుతప్పించుకొనుటకష్టము. వ్యతిరేకముగ జరించితివేని నీజీవితమునకు హానిగల్గును. అయ్యో! నీవు త్తమరాలవు. ఆనరకాసురుడు నిన్ను బెల్లగించి తనయింటబంధింపఁజూచిన నీవేమిచేయఁగలవు? మాధవుఁ డడ్డుపడు ననునాస నీకులేదు. ఏమిసేయుదు వెటు తప్పించుకొందువు. నీ రూపదల కుపయోగపడజాలని మాధవుని మన్నింపుము. నీకెవ్వ డేడు గడయని నమ్మితివో యామాధవునిచే నీవుమోసపోతివి. అతనినిందింపకుము. ఆ విధి యిట్లుండె. ధైర్యమేనీకుశరణ్యంబు. నిన్నీశ్వరుడు రక్షించు గాక!

ఇట్లు

నీప్రేమానుజీవి, మందభాగ్యుండు మాధవుండు.

లేఖ చదువుట, ముగిసెను. మధుమతి కనులశ్రుపూరితములయ్యెను. దుఃఖము హెచ్చెను. నిట్టూర్పు విడచెను. ఇంతలో నచ్చటికెవరో వచ్చుచున్న యలుకుడయినది. అది నూపురమంజులరవంబు. ఆమె, కోకిల. ఇంకను గదినిసమీపించలేదు. అక్కడినుండియే, కోకిలమందహాసముతో, మధుమతినిబిలుచుచు, మధుమతిగదిలోనికొక గంతువైచెను. మధుమతి, కన్నీటినిదుడుచుకొని, యేమిటాతుందురు. ఎందులకాహడావిడనియెను. కోకిల, హడావిడికాదామరి. నీయత్తయు మామయువచ్చిరి. నేగనుగారమ్మనుచున్నారను. మధుమతికి గుండెలో రాయిపడినట్లులయ్యెను-నీవుపొమ్ము. నేను వచ్చెదననిపలికి మధుమతి కోకిలనుబంపివేసెను.

---

## —పదునాలుగవ ప్రకరణము.—

సాయంసమయములు, యువతీమణుల కానందదాయకములు. తరుణీమణులు కమ్మసంపెంగనూనెచే, కురులకు మెరుగుపెట్టి, సున్నగదువ్వి కొప్పులనుసవరించుకొనుచుందురు. కొందరు పూదండలవేణీబంధంబుల బంధింపఁజేసి దానికివన్నెఁదెచ్చుటలో మిక్కిలిపాటుపడుచుందురు. ముఖేందుల, శీతలజలంబులచే జలకమాడించి శుభ్రవస్త్రంబులనొత్తి తడియార్చి దర్పణసేవంగావించి, కస్తూరీకుంకుమాది తిలకంబ లనలంకరించి, నూత్నవికాసపుష్పముల నర్పించి శోభదెత్తురు. కనుగవలకు

కాటుకలు దిద్దికువలయంబుల నపహాస్యము జేయఁజూచుచుం దురు. సాయంతనమందమారుతములకు వారలయధరపల్లవములు వికసించి రాగరుచుల వెలువరించుచుండును. ఈయత్నములన్నియును ప్రేమైకసాధనములు. జననీజనకులకు వాత్సల్యము, అపత్యములకు భక్తి, భర్తలకనురాగము, అతిశయిల్లుచుండును. సేవకులకు విశ్వాసమలవడును. మరియు, ప్రేమకు నీశ్వరుడు సంతసించుచుండును. ఆతఁడు ప్రేమైకస్థానుడు. ప్రేమమయుఁడు. ప్రేమనుసంపాదించుటకై యాతడనేక రూపంబులనందుచుండును. ప్రేమలేనిప్రపంచముశూన్యము. ప్రేమలేక ప్రపంచమునిలువదు. కావున దానినిసంపాదించుటకై యెల్లరునుపాటుపడుచుందురు. ప్రేమనుప్రేమచే సంపాదింపవలయునుగాని వేరుసాధనములచే నదిలభ్యముకాదు. తనయంశ మెచటనుండునో, దానిని తనలోఁగలుపుకొనఁజూచుచుండును. మాయ, యొకానొకప్పుడు, ప్రేమరూపమునుదాల్చి, మోసగించుచుండును. ఆభేదమునుగనుపెట్టనేరని వారలాపదలలో దగులుకొందురు. వివేకవంతులాభేదమును గనిపెట్టి రక్షవేయుచుందురు. మాయస్వరూపముతోఁ బ్రత్యక్షమై తనయపరాధము నొప్పుకొనుచుండును. ఇది సాయంసమయము. రుక్మిణీ శ్యామలలొకరిహస్తంబుల నొకరుబట్టినొక్కుచు, తమప్రేమ లగలిపివృద్ధినొందించుకొనుచుండిరి. అంతరుక్మిణి, తనదృష్టిని యన్నపైఁబరపి, శ్యామలహస్తంబును వదలి కుశలంబడిగి

పానీయాదిసత్కారంబులాచరించి శ్యామలతో హాస్యోక్తులాడుచు, గూర్చుండెను. అంతకోకిల వెండిపళ్లెరములతో భక్ష్యములను గొనివచ్చి శ్యామలముందర బెట్టెను. మరలవేఱొక పళ్లెరమును భక్ష్యములతో గొనివచ్చి భాస్కరనాయుడుంగారి ముందర బెట్టెను. భాస్కరుడు వానిం గుడిచిముహాలులోనికి బోయి పడకకుర్చీపై పరుండెను. శ్యామల మధుమతిని బిలువుమని మరలగోకిలనంపెను. కోకిల గంతులువేయుచు నచ్చట నుండియే, మధుమతిని బిలుచుచు, నామెగదిలో వాలెను. మధుమతిలోనికేగి శ్యామలాదేవింగాంచి, మందహాసముతో, అత్తా! క్షేమమా? మామయ్యయేరి.

శ్యామ—కోడలా మమ్ములమఱచిపోతివికదా? మేము వచ్చియెంతకాలమైనదో నీకు తెలియునా? ఇప్పుడా మమ్ముల నడుగుచున్నావు. కోకిలను రెండుసారులంపితిని. గదలివచ్చుట యేగష్టగానుండెనా? ఇంతసేపుక గదిలోనేమిచేయుచున్నావు.

మధు—నీసం దేహములనీవే వెళ్ళడిచేసికొనుచున్నావు నన్ను మఱచిపోయియట్లనుచున్నావు. నేనుచిన్నదానను. నాపై నీకుం బ్రేమయున్నచో మొదట నీవునాగదికేవచ్చియుందువు. తాతతో మాటలాడుచు యత్తకునాపైం బ్రేమయున్నదో లేదో చూతమని యొక్కనిమిషమచ్చటనే గూర్చుండియుంటిని.

శ్యామ—ఎంతగడుసుదానవే. నేనువచ్చినప్పుడుముందు నీవుపలుకరింపవలెనా? నేనుపలుకరింపవలెనా? నేనువచ్చి

నప్పటినుండియు నీమాటలే చెప్పుచున్నాను. నీతప్పును గప్పిపుచ్చి, తిరిగినాపై నే నేరమారోపించుచున్నావా?

మధు—ఎవరువచ్చిన నేమి? చిన్నవాండ్రక్షేమమును ముందుగ పెద్దలువిచారింపవలెనా? పెద్దలక్షేమమును ముందుగచిన్నవాండ్రు విచారింపవలెనా? న్యాయముచెప్పుము. న్యాయమెవ్వరుతప్పుదురో వారు దోషులగుదురు. ఇప్పుడు తప్పెవరిదో నీవేచెప్పుము.

రుక్మి—వదినా! నీవోడితివి. పోనీ నీవుచెప్పినమాటయె నిజమనుకొందము. ముందుగనిన్ను, మధుమతియేగదా, పలుకరించెను. నీవు బిడ్డనుపలుకరింపలేదు. బిడ్డయందు దోషములేదు. ఇంకవాదమేల.

శ్యామ—వదినా! నీవును బిడ్డయునుగలిసి నన్నోడించితిరి. ఇప్పుడిక్కడ, మాకామపాలుడుండిన మేమిద్దరమును గలిసి, మధుమతినోడించియుందుము.

మధుమతి ముఖమునువంచుకొనియెను. కామపాలశబ్దమామెకు కర్ణకఠోరము. మధుమతి లజ్జించుచున్నదని, శ్యామలతలంచెను. ఈపరిదర్శనమెంతయో రుక్మిణికిసంతోషమునుగలుగజేసెను. మరలశ్యామల యిట్లనియె.

శ్యామ—మధుమతీ! నీకంతసిగ్గేల? కామపాలుడికకూడనున్నాడనుకొంటివాయేమి? ఇటురా! నీకురులట్లు చెదరియు

న్న వేమి? నీకన్నులు వాడినట్లున్న యవి. నీకు తలదువ్వుకొనుట కైనసందీరిక లేదా? తలదువ్వెదవచ్చెదవా?

మధు—వద్దు. నేనుతలదువ్వుకొనను. కొంచెముతల నొప్పిగానున్నది.

శ్యామ—అదేమిచిత్రమే? కొంచెముతలనొప్పిగా నున్న, తలదువ్వుకొనుటమానివేసెదవా? ఈవేళశుక్రవారము అట్లుండకూడదు. నేను తల గదలకుండ దువ్వగలను. అని, కోకిలవంక చూచెను.

కోకిల చెంగుచెంగున గంతులువైచుచు, లోనికేగి, సంపెంగనూనెయు, దంతపుదువ్వెనయుకొనివచ్చి, మధుమతి కురులనువిప్పి, నూనెరాసిదువ్వుచు, విసుగుకొనుచుండెను. అంత శ్యామల కోకిలవిసువునుగాంచి—ఏమే, కోకిలా? నీవట్లువిసుగుకొనుచున్నావు. నీచేత కాకపోయిన నామువ్వెననాచేతికిమ్ము. నేనుదువ్వెదను.

కోకి—(కోపముతో) తలదువ్వుటయే, నాచేతగానను కున్నారాయేమి? ఇట్లీమె నేలకూర్చుండిన నేనెట్లు దువ్వగలుగుదును? కురులు నేలకుంగులుచున్నయవి. చేతితో పట్టి యెత్తి దువ్వుటకష్టముగానున్నది. అంతియే కాని తలదువ్వుటనాచేత కాకపోలేదు.

శ్యామ—కోకిలా! నీనిగా నీకింతకోపము. అమ్మా మధుమతీ! నీవీకుర్చీపయినిగూర్చుండుము.

మధుమతి కొంచెముకోపముతో నిక్కడనుండక్క

కును, అక్కడనుండిక్కడకుఁ దిప్పుచున్న నేనుతలదువ్వుకొనను.—అని లేచి కుర్చీపయిపఁగూర్చుండెను. కోకిలవిసుగుకొన్నదన్న నేగమేమున్నది. కుర్చీపైఁగూర్చుని యుండినను యామెకురులునేలకుఁజగులుచునేయుండెను. ఇప్పుడే నడుము వంచుచు నెత్తుచు కష్టముగా దువ్వుచున్నయది. నేలఁగూర్చుండియున్నప్పుడామె యెట్లుదువ్వగలుగును.

తనకోడలికురులసౌరునకు శ్యామల లోన మురియుచుండెను. కోకిల తన నేర్పునంతసుజూపి, యందముగ మధుమతికి జడవేసెను. తానల్లినజడనుగాంచి, తననేర్పునకుఁ దన్నుతానే పొగడుకొనుచుండెను. మధుమతి నలంకరించుటలో కోకిలకింకను దృప్తితీరలేదు. ఒకవెండిచెంబుతో మంచినీటినిగొనివచ్చి మధుమతిముఖమును గడుగుటకు యత్నించెను. మధుమతి దానిచేతినుండి యాచెంబునుదీసికొని ముఖముగడుగుకొని, శుభ్రవస్త్రముచే తడియొత్తికొనియెను. ఇంతలోకోకిల, కాటుకభరిణియు, నంగారును, గొనివచ్చి మధుమతిముఖమువంకజూచి, కోపముతో, శ్యామలాదేవిగారూ! నేనువచ్చెడునంతలోనే, తొందరపడవలయునా? ఆకాటుక మీరేపెట్టితిరా?

మధు--నవ్వి—నీకుపిచ్చియెత్తినదా? ఏమి? కాటుకనెవరు పెట్టుకున్నారు.

కోకి—అదేమిటి. నీకనులు కాటుక బెట్టికొనినట్లున్నవే

శ్యామల నవ్వెను. కోకిలచిన్న పోయెను. నిజ

ముగ మధుమతికనులు కాటుకదిద్దినట్టులే యుండెను. పరాకు గాజూచిన సందరిల్లే యనుకొనకమానరు. కోకిలంగాటుకను దిద్ది తిలకముంచెను. ఇప్పుడుకోకిల సంతోషమునకు మేరలే కుండెను. ఆమె పలుమారులు మధుమతి, ముఖమునిటునటు ద్రిప్పుచుఁ బాపిడి వంకరలేక తిన్నగానున్నది. బొట్టంతచిన్న దియునుఁ బెద్దదియునుగాక, యెంతయుండవలయునో నంత యున్నది. కాటుక కొలికలుబాగుగా దిద్దితివి. శ్యామలా దేవిగారూ? నాకుఁదలదువ్వుట చేతఁగాదంటిరి. ఇప్పుడా జడ కేమి వంకలుపెట్టెదరో చెప్పుడు—మధుమతికి, నవ్వువ చ్చెను. శ్యామల నవ్వుచు కోకిలా? కోపపడకుము. హాస్య మున కట్లంటిని. నీవులోని కేగి యొక వెండి పళ్లెరమును దీసి కొనిరమ్ము. కోకిల మధుమతి ముఖమువంక జూచుకొనుచు లోని కేకి పళ్లెరమును దెచ్చియిచ్చెను. అంతశ్యామల తనకు రుక్మిణి యొసంగిన భక్ష్యములను మూడుభాగములుగ జేసి కోకిల తెచ్చిన వెండిపళ్లెరములో రెండుభాగములుంచి మధు మతి ముందుఁబెట్టెను.

మధు:—అత్తా! ఎందునకవినాకు ౦దర బెట్టుచున్నావు?

శ్యామ:—నీవుతినుటకు.

మధు: —నేనిప్పుడు తినను.

శ్యామ:—నీవుతినకున్న నేనునుదినను.

మధు:—అటులయిన నాకు రెండు భాగములనిచ్చితి వెందుకు?

శ్యామ:—న్యాయముదప్పిన దోషముబ్బునని యిప్పు డేగదా నీవంటివి. మాటయనుపించుకొనుట యెందుకని న్యాయముగనేబోతిని.

మధు:—నీమాట నాకర్థముకాలేదు. ఇటన్యాయాన్యాయములకు జోటెక్కడ.

శ్యామ:—నాకొకపాలును, నీకొకపాలును, కామపాలునకొకపాలును వేసితిని! మావాడిక్కడ లేకుండుటచే వానిపాలుగూడ నీకిచ్చితిని.

మధుమతి చటాలునలేచి లోనికిబోవుచుండెను. ఈమె నాకాళ్ళకు బంధములువేసి కామపాలునకు నన్నంటగట్ట జూచుచున్నది. నాజీవిత నాటకమునకు విషాదగర్భిత మగు నాంది, యిప్పుడే ప్రారంభమైనది. కామపాలునితలపున నీమెః నాగళమునకు సూత్రమును బిగించుచున్నదని మనంబున దలంచుకొనియెను. శ్యాముల మధుమతి కడ్డమువచ్చి చిరునగవుతో, కోడలా? నీకింతకోపమేల? ఇప్పుడు భాగమును దిరస్కరించినట్లులే రేపునూ కామపాలునిగూడ దిరస్కరించెదవా యేమి? కూర్చుండుము. కామపాలుని భాగమును నీకీయనులే, నీవువద్దన్నభాగమును నేనుతీసికొని నాభాగమును నీకిచ్చెదను. అనిచేయిః బట్టుకొని బలవంతముగః గూర్చుండఃబెట్టె మధుమతి, యత్తా? నన్నింత బలవంతపెట్టెదవేల? నాకుఃగోపమువచ్చినదను కొంటివా యేమి? ఇప్పుడు నీపాలిచ్చిన

మాత్రమున నేనుపుచ్చుకొందు ననుకొంటివా? చిన్నతనము నుండియు నీపాలు గామపాలునకే యిచ్చుచుంటివి కావున నిప్పుడుగూడ నీపాలాతనికే దాచియుంచవలెను. మధుమతి వాక్యమత్కృతికి శ్యామల యచ్చెరువందుచు గ్లిష్టస్వరముతో మధుమతీ!నాపాలును. కామపాలునిపాలును వద్దనుచున్నను, నీవుమాకామపాలుని పాలుగాక తప్పదులేయనెను. ఈవాక్య ము మధుమతి హృదయమును బ్రద్దలుచేయుచుండెను. ఆమె ముఖమెఱ్ఱబడియెను. లోసదడపుట్టెను. దానినాపుకొనుటకై ముఖమావలకుద్రిప్పి యిటునటును జూచుచుండెను. శ్యామ లకు బదులుచెప్పుట కామెకిష్టములేదు. ఇంతలో గోటనుండి శ్రీధరుడువచ్చి శ్యామలనుగాంచియాశ్చర్యముతో శ్యామలా! నీవెప్పుడువచ్చితివి. అందరును గుశలమాయన శ్యామల, అన్నా! యిప్పుడేవచ్చినాము. పాపముమాధవునకెంతచిక్కు వచ్చినదనెను. శ్రీధరుడు ముఖమువంచుకొని మాఱుపలుక లేదు. ఈసమయములో మధుమతి నెమ్మదిగ తనగదిలోనికిఁ బోయెను.



## —పదునైదవప్రకరణము—

ప్రతాపరుద్రుడు శివయోగుల నెక్కుడుగ గౌరవించు చుండుటచే. నేకశిలానగరమునకు బెక్కండ్రు శివయోగులు

రాఁదొడంగిరి. ఈశివయోగులలో రెండు తెగలుగలవు. భార్యాపుత్రాదులతో సంసారగోష్ఠి నడపుచుఁ బ్రభుసత్కారమే ప్రధానపోషకముగా సదాశివార్చనారతులగు వారొక తెగవారు- సంసారసంబంధములేక కేవల లింగార్చనాతత్పరులై ప్రభుపోషకత్వమున నుండువారొక తెగవారు. ఈ రెండు తెగలవారికిఁ బ్రభుసంబంధముగలదు. మరియుఁ బ్రభుసంబంధములేని తెగయింకొకటికలదు. కేవలమీశ్వరారాధనమే ప్రధానసాధనముగాఁగ మోక్షమే పరమావధిగాఁ బెట్టుకొని కాలమును గడపుకొనుచుండువారు. వీరు కందమూల ఫలాదులనే భుజించుచు బరాపేక్షకులోఁబడనివారు. జనసంకులమగు నగరావాసమును వీరిచ్చగించరు. నగరమున కావల రమ్యప్రదేశమున మఠముల నేర్పరచుకొని శిష్యులకుదత్త్వబోధను గావించుచుందురు. ఇట్టిమఠములు బహుకొద్దిగ నున్నవి. వీనిలో బహుస్వల్పకాలములో వెలసినదయ్యును, బ్రహ్మానంద శివయోగీంద్రునిమఠము ప్రభావంతమై కీర్తిదాయకమై విలసిల్లుచుండెను ఈతడు త్రికాలవేదియను ప్రతీతికలదు. జనులు తమ గతాగత ఫలములనుఁ దెలిసికొనుటకు దరుచు వచ్చుచుందురు. ఈమఠము ప్రతాపరుద్రుని బాహ్యోద్యానమునకు బ్రక్కనే యున్నది. ప్రభుత్వప్రధానోద్యోగియులు కూడ నప్పుడప్పుడువచ్చి వీరి దర్శనమును జేసికొని తమ భవిష్యత్ఫలములు వినిపోవుచుందురు. చక్రవర్తిగూడ నీతని నీశ్వరుని యపరావతారమని

నమ్మి యుద్యానవనమునకు పిక్కావచ్చినప్పుడెల్లను బ్రహ్మా
నందుని దర్శనము జేయుచుండెను. ఆకారణమున మిగిలినప్రజ
లందరకును నాతనియందు మిక్కిలి భక్తియుదయించెను.
మతగురువులకుగూడ నీతనియెడ విశేషభక్తి యంకురించెను.
బ్రహ్మానందుడు మిక్కిలి చిన్నయసువాడు. బ్రహ్మతేజమీ
తనిముఖమున బ్రస్ఫుటమగుచుండును. ఎప్పుడును చిరునగవు
గలిగియే యుండును. ఈతడెప్పుడును బ్రహ్మసమాధియందే
యుండుటచే బ్రజల కీతనిదర్శనము లభించుట చాల దుర్లభ
ముగానుండెను. పగలీతనిదర్శనము దొరకుటయేలేదు. దీప
ములు పెట్టినది మొదలు పగడియల రాత్రివరకును నీతనికి
దీఱుబడియగు సమయము. ఈకాలమునకు వచ్చినవారలకే
యీతనిదర్శనము సులభసాధ్యమగుచుండెను. అక్కాలంబున
నాంధ్రదేశములో శ్రీశైలము, గోటిఫలి పుష్పగిరి, గోసంగి
దాక్షారామము, త్రిపురాంతకము మొదలగునవి మిక్కిలి
పుణ్యప్రదములగు శివక్షేత్రములుగా దలంపఁబడుచుండెను.
అయినను వీనియన్నిటికంటెను బ్రహ్మానందుని యాశ్రమమే
పుణ్యప్రదమును ఫలప్రదమునునై విరాజిల్లుచుండెను. బ్రహ్మా
నందునికడ మంత్రపూతమై వస్త్రబద్ధమగు నొకదండము
కలదు. ఎవరైన దనదర్శనమునకు వచ్చిరేని యాదండమునకే
నమస్కరింపవలెను గాని తనకు నమస్కరింపగూడదు. తాను
నమస్కారమును బ్రతిగ్రహింపడు. ఇట్లుండ నొకనాడు బ్రహ్మా

నందుడొకశిష్యునితో బ్రాహ్మీముహూర్తమున లేచి నదికి స్నానమునకై పోవుచుండెను. ఇంతలో నొకబాటసారియా ప్రక్కనుండి వడివడి పోవుచుండెను. బ్రహ్మానందు డాతనిని తదేకదృష్టితో వీక్షించుచు శిష్యునితో నీవుబోయి సత్వరమే యాబాటసారి నిటకు దోడ్కొని రమ్మని పంపెను. గుర్వాజ్ఞను యాశిష్యుడు బాటసారి కడకేగి మాగురువు గారియాజ్ఞయైనది రమ్మన వాడు మీగురు వెవ్వడన—శిష్యుడు బ్రహ్మానంద శివయోగీంద్రులని చెప్పెను బాటసారి వారి ప్రసిద్ధిని విన్నవాడె కావున లోన ననుమానపడుచు, నాకుమిక్కిలి తొందరపని యున్నది. తిరిగివచ్చునప్పుడు వారిదర్శనమును జేసికొందును. క్షమింపుమని చెప్పుడని బాటసారి వడివడి పోవుచుండెను. శిష్యుడాసంగతి బ్రహ్మానందున కెఱిగించెను. బ్రహ్మానందుడు సరియే నీవిటనుండుము. నేనుబోయి వానిని దోడితెచ్చెదనని యొక్కపరుగున బోయి యాబాటసారి కడ్డమువచ్చి యెక్కడికిబోయెదవు? బ్రహ్మానందుని యాజ్ఞ యవిలంఘ్యమని యెరుగవా? రా! రమ్ము? ఆశ్రమమునకు రమ్ము? బాటసారి తొట్రుబాటుతో లేని ధైర్యమును దెచ్చుకొని సన్యాసులకు సంసారులతో బనియేమున్నది. చక్రవర్తి పని మీద తొందఱగా బోవుచున్నాను. తాపీలులేదని తప్పించుకొని పోబోయెను. ఓరీ! పిచ్చివాడా! నాకీశ్వరాజ్ఞయైనది. నిన్ను బట్టుకొనిరమ్మని నన్నుబంపినాడు. ఆగుము,నన్నుతప్పిం

చుకొని పోవుట నీతరము కాదు. చాటసారి యోగి కలతనొందిన మనస్సుతో నెద్దియో యోచించి స్వామీ! మీకెందులకింత యాగ్రహము. పనితొందరచే రా వీలులేదంటిని. తప్పనిసరియే యగుచో దయచేయుడు వచ్చుచున్నానని బ్రహ్మానందుని వెనుకనే నెమ్మదిగ నడచి వచ్చుచు మొలపై జేయివేసి చక్షునకృపాణమునుదీసి బ్రహ్మానందుని వెన్నుపై బొడిచెను. భూతభవిష్యద్వర్తమానవేది యగు బ్రహ్మానందుని కడనా, దుష్టయత్నములు నెఱవేఱుట, చాటసారి, చేయినెత్తి పొడుచుసమయమున శివయోగి తటాలున ప్రక్కకు దాటెను. పోటుగ్రుడ్డులేక పోవుటచే చాటసారి ముందునకు సాష్టాంగముగఁ గూలెను. అంత శివయోగి యొకచేత వానిమెడబట్టినొక్కి రెండవచేత వానిచేతినున్న కృపాణమును లాగివైచి, వస్త్రముచే కాలుసేతులు బంధించి శిష్యునిబిలిచి యాశ్రమమున కీడ్చుకొనిపోయెను. శిష్యుడాశ్చర్యముతో స్వామీ! యిదియేమి? ఈతడెవడన, శివయోగి వత్సా! చూడుము, వీడెవడో వేషధారియగు మోసకాడు వలె గనబడుచున్నాడు. నాయంతరాత్మ శంకించుటచే వీని నిటకుదెచ్చితిని. వీనిని బరిశోధించి లేఖలేవైన నున్నవేమో చూడుమన శిష్యుడు వానియుడుపు లన్నియు బరిశోధించి యొకలేఖను బైకిదీసి స్వామీ! ఇదిగో! యేదోయొకలేఖ దొఱకినదని శివయోగి కందిచ్చెను. అది శీలు వేయబడిన

కవరయగుటచే దాన్నిని జింపి దీపారాధన జేసిలేఖ నంతను జదువుకొనియెను. అం దేమున్న దోగాని క్రోధారుణిత నేత్రుడై వత్సా ! దయానందా! దేశద్రోహియగు మహాపాతకిదొరకినాడు. ఔరా ? యెంతటిద్రోహము. ఈమ్లేచ్ఛాధముని త్రాళ్ళచే బంధింపుము.

దయా:—స్వామీ ? యేమి యుపద్రవము! అందే మున్నది? ఈ ద్రోహియెవడు? ఇదంతయు నొకగారడీవలె నున్న దే ?

బ్రహ్మ:—ఈమోసము గారడివంటిదికాదు. ఆంధ్ర సామ్రాజ్యమునకు మహావిపత్తురానున్నది. ఇటురమ్ము ఈ లేఖ నొకసారి చదువుము.

దయా:—లేఖనందుకొని యిట్లు చదువ ప్రారంభించెను. లేఖ—శ్రీ శ్రీ ఢిల్లీసింహాసనాధీశులగు అల్లాయుద్దీన్ సార్వభౌములకు తమసేవకుడు సరదారు జఫరాలీఖాన్ సలాములు. నేనిచట మారువేషముతో యేకశిలానగరమునందలి రహస్యములనెల్ల దెలిసికొంటిని. కోటచాల దుర్భేద్యముగ నున్నది. కొన్నిరహస్య మార్గములను గనుగొంటిని. ఇచ్చట ప్రతాపరుద్రుడు ప్రమత్తుడై యున్నాడు. సేనానులలో (?)రస్పరకలహములుదయించినవి. జైనులపై జగ్రత్తి యలుగుటచే నగరముచు విడిచిజైనులుపోవుచున్నారు. కోట యొక్క రహస్యాన్వేషణములో జైనులె,నాకుజాలగ దోడు

పడినారు. మాధవుడను వీర సేనానిచక్రవర్తిచే, యవమానింపఁ బడి దేశాంతరముల పాలైనాడు. అతడు సింహకిశోరము వంటివాడు. ఆతఁడెప్పుడెప్పుడు సామ్రాజ్య రక్షణమునకే పాటుపడుచుండెడువాడు. ఈతఁడు జారిపోవుటచే నిప్పుడట్టి ప్రబోధము చేయువాడెవఁడునులేఁడు. ప్రసిద్ధ సేనానులగు నీతని తండ్రియు మేనమామయు మాధవు నవమానించినందుకు జక్రవర్తిపై గ్రోధమునఁ గణిగియున్నారు. ఓరుగల్లుసామ్రాజ్యమును గబళించుట కిదే మంచితరుణము. ప్రచండసైన్యమును సమకూర్చి, యెక్కడికి వెళ్ళునదియు నేరికిని దెలియకుండ నొకానొకని వచ్చి కోటను ముట్టడించవలయును. సాధారణముగ సర్వసైన్యమే యీతరుణమున మీకు సహకారికాఁగల దని నాయభిప్రాయము. మీరువచ్చుదనుక నేనిటఁ బచ్ఛన్నముగనుండి మిమ్ములను గలసికొనియెదను. దేవగిరి రహస్యములేవైన దెలిసిన దెలుపప్రయత్నింతును. ఈలేఖను దెచ్చిన యబ్దుల్ ఖరీముకు దగిన బహుమతి నిప్పించెదరని నమ్ముచున్నాను. కొద్దిరోజులలో దక్షిణహిందూస్థాన మంతయు మీకైవశముగాఁగలదు. త్వరపడుడు, త్వరపడుడు. అల్లా రక్షించుగాక. — ఇట్లువిధేయుఁడు సరదార్ జఫరాలీఖాన్.

లేఖజదువుట ముగియగనే దయానందుని మేనుకంప మొందసాగెను. సంసారమును ద్యజించి సన్యాసియై మోక్ష

సాధనము జేయుచున్న దేశనాశకుడు నీ కుతంత్రలేఖా స్త్రమును గ్రహించి దయానందుడుగ్రుడై, స్వామీ! ఎంత ద్రోహ మెంతద్రోహము. ఈపిడికిలిచే ద్రోహియగునీ ఖరీ ముగుండెస్సై నొక్కిపోటుపొడిచి వీనిని యమసదనమునకు బంపించెదనని లేచెను. బ్రహ్మనందు డాతని చేయిబట్టుకొని నివారించితొందరపడకుము. ఇంకను వానివలన గొన్నిరహస్యములు తెలిసికొనవలసియున్నవి. రమ్మని ఖరీముకడకేగి యోరీ! నీకుటిలయంతయును దెలిసిపోయినది. బ్రదుకదలంచితి వేని యదార్థమునుదాపక చెప్పుము. నీచేరేమి?

ఖరీ — ఓహో? నీవా? నన్ను రక్షించువాడవు. నా పేరు నీకుం జెప్పవలసిన యవసరము లేదుపొమ్ము.

బ్రహ్మ — ఓహో! యటులనా! నీవు చెప్పకున్నను నీ పేరు యబ్దుల్ ఖరీమని తెలిసికొంటిమి. నీయజమాని జఫరాలీ ఖాను. ఆతనియాజ్ఞను పాలించుచున్నావు కాబోలును.

ఖరీ — ఔను? ముమ్మాటికిని యటులే.

బ్రహ్మ — ఓరీ! దేశద్రోహి, ప్రాణావసానసమయమున గాని నీవు రహస్యమును జెప్పదలంచుకొనలేదు కాబోలును.

ఖరీ — ఆ! ఏమంటివి? నేను దేశద్రోహినా? నామహమ్మదీయరాజ్యమును బెంపొందించుటలో నాప్రభువునకు దోడుపడి నాధర్మమును నెఱవేర్చితిని. నేను ద్రోహి నెట్లగు

దును. నా దేశాభివృద్ధికొఱకే నేను పాటుపడితిని. నేను ద్రోహి నెట్లగుదును. నాక త్రిపోటునకు నీవుబడుటయే తటస్థించి నచో నేనిం కను నీతో నధికమగు దేశభక్తి జూపఁగలిగినవాడనై యుందును. కంఠములో బ్రాణముఁలున్న, యవకాశమున్నంత వరకును నా దేశమునకై పనిచేయుచునేయుందును. ఈప్రాణ ములను దేశముకొఱకై యర్పింపనున్నాను. నేను దేశద్రోహి నెట్లగుదును? కాలవశమున నీకుఁ బట్టువడినంతమాత్రమున దేశద్రోహినగుదునా? ఎన్నటికినిగాను.

బ్రహ్మో—చహాబాష్ నీ దేశభక్తికి మెచ్చితిని. నీ దేశ మునకు నీవు ద్రోహివి కావు. నా దేశమునకు ద్రోహివి. కావున నిన్ను నేను దేశద్రోహియనుట తప్పులేదు. నీ దేశముకై నన్నెట్లు చంపఁజూచితివో? నా దేశమునకై నిన్నిప్పుడు వధిం చుట కభ్యంతరమున్నదా?

ఖరీ—లేదుకాని, నీవు సర్వసంగపరిత్యాగ మొనరిం చిన సన్యాసివి. నీవిప్పుడు చూచుకొనుచున్నది మోక్షమా ర్గము. హింసాకృత్యము నీధర్మమునకు విరుద్ధము. నీధర్మ భ్రష్టత్వమునకై భగవంతుని ప్రార్థించుకొనుము. నా యెదు టనుండి పొమ్ము.

బ్రహ్మ—ఓరీ! మూఢా! సన్యాసులయొక్క రక్షణ భారమంతయును చక్రవర్తిపైనున్నది. మరియు, దేశప్రజాసం రక్షణ మాతనిభుజములపై మోపబడియున్నది. సామ్రాజ్య

మునకు జేటుగానున్నప్పు డాసామ్రాజ్యములోని వారమగు మాకునుగూడ హానికలుగకమానదు. అప్పుడు మాకును మాతపస్సునకును మద్భక్తులకును శాంతి చేకూరదు. కావున మహాపదలనుండి చక్రవర్తిని గాపాడుకొను బాధ్యత మాయం దున్నది. దేశక్షేమమునకై, ప్రజాభ్యుదయప్రాప్తికై మహా యజ్ఞమున యజ్ఞపశువును వధించుట దోషమెట్లుకాదో దేశ క్షేమమునకై మత్సోరక్షణకై నిన్ను వధించుట దోషము కాసు. మాకోటి మహాతపస్వులు రాష్ట్రోద్ధరణ పరాయణత్వ ముతో ప్రపంచరక్షణమునందే మరియొంటరిగ, యేకాంత ముగ, ముక్కుమూసికొని కూర్చుండబట్టిరో, సత్యధర్మ తపశ్శౌచదయాగుణములకాలవాలమైనభారతభూమి మ్లేచ్ఛా ధీనమైనది. గోమాంసము నోట గుక్కబడినప్పుడు తపోభగ్న మై వెఱ్ఱివెఱ్ఱిచూపులతో భగవంతునిపైకిఁ జేతులు జాచు టయా యతిధర్మము. దేశము మహావిపత్తులలో మునిగిపోవు చున్నప్పుడు దండకమండలములను జేతబట్టుకొని చెవులు మూసికొని శివశివా యనుచు క్రూరమృగములకు బలియగు టకై యరణ్యములకు బారిపోవుటయా యతిధర్మము. ఇదియే దయాగుణమని భావించు మూఢసన్యాసినిగాను నేను. ప్రత్యే కము తనయొక్క మోక్షమునే చూచుకొనుట సన్యాసము గాదు. సర్వేజనాస్సుఖినో భవంతను న్యాయమునకై సర్వ

సంగపరిత్యాగ మొనరించువాడే నిజముగు సన్యాసి. నాదేశ మునకు స్వాతంత్ర్యమున్నప్పుడే నాయాత్మకుగూడ స్వాతంత్ర్యముండును. నీవు నాదేశమును ముచ్చిలింప కుట్రను బన్నినావు. నీ కుట్రయంతయు ను నీవు చెప్పకున్నను నేను దెలిసి కొనగలను. దయానందా! వీనినిరజ్జువులచే బంధించి యొకగది యందు భద్రపరుచుమనెను. దయానందు డట్లేయని యాపని నిర్వర్తించెను. పిమ్మట బ్రహ్మాన దుడు స్నానమునకై నదికి బోయెను.

---

## — • పదునారవ ప్రకరణము. • —

నేనుఁ జిన్నతనమునఁ దెలిసియో దెలియకయో దుండగముల నాచరించినమాట వాస్తవము. అవియే మనంబున బలపోయుచుఁ గామపాలుడు దుర్మార్గుఁడని మధుమతి తలంచుచుండెను. కామపాలు డిప్పుడుపూతుడై, తన నడవడిని మార్చుకొని యుండెనని యామెయెరుంగదు. నామాటయడిగిన వ్వామెకుఁ జాల ససహ్యముగా నుండెనని వింటిని. నేనిప్పుడు పరిశుద్ధుఁడనై యున్నాను. ఆమె నాపవిత్ర పరిశుద్ధతను తెలిసికొన్నచో ననుఁదప్పక వరించును. కాని యీసంగతి యామెకుఁ దెలియుటెట్లు? కానిమ్ము. అపనినేనే యొనరించుకొని యెదను. నాకీకార్య మొకలెక్కయా? ఎచ్చటనేవిధముగ సంచరించవలెనో నాకు బాగుగఁ దెలియును. నాసత్యవర్త

నము నామెకడ బ్రకర్షించి యామెను వశపరుచుకొనియెను మాధవునిపై యామెకు మిక్కిలి మక్కువయుండిన నుండ నిమ్ము. పరాక్రమమున మాధవుఁడు నన్ను మించు వాఁడు కాఁడు. నాకంటె నాలుగుశాస్త్రములు మాత్రమె యెక్కుడుగఁ జదివెను. ఆ చదువే యాతనికొంపఁ దీసినది. తానేమో గొప్ప విద్వాంసుడనని చక్రవర్తితో మతచర్చలకారంభించెను. చక్రవర్తి తగినశిక్షఁ జేసినాడు. ఇప్పుడాతఁడేయడవినో బట్టి పోయినాడు. నా కార్యసాధనమున కిదియొక శుభసూచకము. నేను మధుమతిని జూచి యొకవత్సరమైనది. శరత్పూర్ణిమా చంద్రునిఁబోలి సంపూర్ణకళావంతమై యొప్పారు నా ముఖమండలమును, గలువరేకులఁబోలి నల్లనై, సోగనై పరిస్ఫుటములై యందములై తనరారు నా నేత్రములును, బూర్తిశోభావహములై నవనవోన్మేషములై యలరారు యంగంబులును నామనంబునకుఁ బారిచెరుకువిలుకాని శరముల పాలుసేయుచున్నయవి. నామనంబునఁ దాండవమాడుచున్న యాదివ్యసుందరమూర్తినిఁ జూచి చాలకాలమైనది. నాజననీజనకు లక్కడనే యున్నారు గదా! నేనుగూడ నచటికిబోయెదను. అని తన మనంబున దలపోయుచుఁ గామపాలుఁడు కాంచీనగరములో దనయింట నొకయంగణములో గుర్చీపై గూర్చునియుండెను. ఇంతలో సేవకుడువచ్చి గుఱ్ఱమునకు జీనుగట్టి తీసుకొనివచ్చితినని నివేదించెను. కామపాలుడు తత్క్షణమే లోనికేగి యొక

తెల్లనివలువయు నొకతెల్లని పట్టుటంగీయును దీసి మేనునలం
కరించుకొని, యొకతెల్లని యుష్ణీషమును శిరంబున ధరించి
తనవేష మెట్లుండెనో చూచుకొందమని నిలువుటద్దంబుకడ కేగి
తనరూపము నందుఁ బ్రతిఫలింపఁజేసి తనసౌరునకుఁ దానే
యచ్చెరువందుచు, సస్మితుండై మనంబున నిట్లుతలపోసెను.
వహ్వా? నేనీరూపముతో మధుమతియెదుటఁ బ్రత్యక్షమైన
నామెవలపంత మునుగకుండునా? నాకీయందము భగవం
తుడు దయచేయఁబట్టి గాని లేకున్న మధుమతి నాకులభ్యము
కాకపోయిదే? రమ్యవస్తువు, దృష్టుల నాకర్షించుకొను
నట్లు, నాయీసుందరమూర్తి ప్రదర్శనముచే మధుమతి నాక
ర్షించెను. ఆమెను వశపరుచుకొనుట కింతకంటె వేరుసాధన
మేదియును లేదు. ఓయద్దమా? నీకునమస్కారము. నీకు
సర్వోపచారంబులను జేసెద. నాజీవితసుఖమున కంతయును
నీవేముఖ్యకారణంబవు. నీవునామేన నలంకరించి యున్నంత
కాలము నాసుఖమునకుఁ గొఱంత కలదే. నీవులేని శరీరము
దిష్టిబొమ్మవంటిది. నాకునీవే ధనము, నీవే ప్రాణము, నీయుప
కారము మరువతగినది కాదు. అని తన నూనూఁగు మీసము
లనుఁ జేతితో నిమురుకొనుచు వీధిగుమ్మము కడకరుదెంచి
తన్నుజూచి సకిలించుచున్న యశ్వంబుకడ కేగి చేతితో దాని
పృష్ఠభాగంబున దట్టి దానిపైకి లంఘించి రికాబులలో బాద
ములను సవరించుకొని కళ్లెముఁ గదపుచు గుఱ్ఱమునకుఁ సంజ్ఞ

జేసెను. అంత నావాజియు తన గ్రీవంబునఁ బైకెత్తి పేరెము వారెను. కామపాలుడు గుఱ్ఱపుసవారియందు మిక్కిలి నేర్పరి. అతఁడు తనగుఱ్ఱము ననేక చిత్రగతుల నడిపించుచు నత్యుత్సుకతతో వచ్చుచుండెను. ఇంతలో సాయంత్రసమగుటచే నొక పల్లెచేరుకొని నాటిరాత్రియందు విశ్రమించెను. దీర్ఘప్రయాణంబున జాలగ నలసినవాడయ్యును నాటిరాత్రి యాతనికి నిద్దుర పట్టలేదు. శోభనాంగియు. సౌందర్య మధురరూపిణియు నగు మధుమతియే, యాతనికన్నులయెదుటఁ బ్రత్యక్షమగుచుండెను. ఆతని హృదయకుహర మప్పుడు సంకల్పములకు జన్మభూమియై కోర్కెల నీనుచుండెను. కరస్పర్శనములు, ఆలింగనములు, చుంబనములు, గిలిగింతలు, ఆస్వాదనములు, హాస్యము, పరాఙ్ముఖత, యైక్యానుసంధానము, నిమీలితనేత్రత్వము, ఒకటేమిటి, వివిధవిచిత్రభావవికారచేష్టాతరంగడోలికలపై నూగుచుండెను. అందులోఁ దెఱపిమరపులు, మఱపులో నైకముతప్ప వేరుగోచరించుటలేదు. తెఱపిలో తెలివితేటల చాకచక్యమగుపడుచుండెను. తా నందగాండ్రలో నెల్ల నందగాడనను గర్వపుతలంపు. ఈతప్పటూహాయే యాతని జీవితమును తప్పుదారి కీడ్చుకొనిపోవుచుండెను. ఈతఁడు చదువను వ్రాయను నేర్చియుండెను. అంతకంటె విద్యయందెక్కుడు ప్రజ్ఞ యాతనికిలేదు. ఇంతవరకు నాతనికాచింతయే లేదు. ఇప్పుడది లేకుండుట చాలలోపముగా గనుపించెను. మధుమతి

విద్యలయం దారితేరిన విదుషి. సంగీతసాహిత్యములయందు నిపుణురాలు. కవిత్వమును జక్కగ జెప్పగలదు. కామపాలు డామెప్రియుని గోఁజిదలంచెదను. ఆకారణమున దన విద్యలే మికి మిక్కిలి విచారపడుచుండెను. ఈలోపమును దన సౌంద ర్యముచే మరుగుజేసికొన దలంచుచుండెను. ఇంతలోఁ దెల్లవా రుటచే గామపాలుడు కాలకృత్యములనొనరించుకొని ప్రాతరా హారమును భుజించి గుఱ్ఱమునకు దానాపెట్టించి, తనవేష మునంతను బాగుగ సవరించుకొని గుఱ్ఱమునలంకరించి దానిపై నధిరోహించి ప్రయాణమును సాగించెను. త్రోవలో మధ్యాహ్నమున నొకవృక్షచ్ఛాయను గొంతకాలము విశ్ర మించి యాహారమును భుజించి మఱల ప్రయాణమున కుపక్ర మించెను. ఏకశిలానగర మచ్చటికి నాలుగుక్రోశముల మేఱ యుండెను. అప్పటికి పొద్దుకూడ నాలుగుగడియలకంటె నెక్కు డుగలేదు. ఆకాశమున నచ్చటచ్చట గోదుగులవలెఁ దనరారి యున్న నీలమేఘములు క్రమక్రమముగ పెద్దవియై యాకాశ మునంతను గ్రమ్మివేసెను. దానికిఁదోడు ధూళిదూసరితమగు పెనుగాలిలేచి మొరిని పొగ క్రమ్మినట్లు దేశమునంతను గ్రమ్ముచుండెను. పుట్టకయేపోవలెనుగాని మహాభూతముల నుద్రేకము నెవరాపగలరు! కామపాలు డీధూళిలో జిక్కు కొని యొక్కయడుగైనను గుఱ్ఱమును ముందునకు నడుపలేక పోయెను. ఆతడట్లే కొంతకాలముగదలక నిలువవలసివచ్చెను.

ఇంతలో గాలి కొంచెము తగ్గినను నారంభమై క్రమక్రమముగ ధారాపాతముగా వర్షమారంభమాయెను. ఘూళియు గాలియుం దగ్గుటచే వర్షమును లక్ష్యముచేయక గుఱ్ఱము నడలించుచుం బ్రయాణమును సలుపుచు నేయుండెను. వర్షపుజల్లులు రివ్వురివ్వుమని వీచుచు మేనంతయు జలుకగొట్టుచున్నను నగరమును జేరవలెనను తొందరచే నతికష్టమున ముందునకు బోవుచుండెను. ఇంతవరకును నాతని గుఱ్ఱము స్వామిభక్తిని జూపగలిగెను గాని, క్రింద నీరును, మీంద వర్షపాతమును తోడై యెదిరించుటచే నిక గుఱ్ఱము నడువలేకపోయెను. కామపాలుడు గుఱ్ఱమునుండి దిగి కళ్ళెము జేతంబట్టుకొని యొకప్రక్క నిలువబడెను. తొలకరి వర్షమగుటచే గొంతవడికి వర్షముకూడ తగ్గెను. అంతకామపాలుడు తడిబట్టలబిండుకొని గుఱ్ఱమునకుం దడియొత్తి మఱలగుఱ్ఱముపై నధిరోహించి మధ్యమధ్య నడ్డువచ్చెడి సెలయేరుల నెట్టులో దాటుచు, దుదకు ఆనగరబాహ్యోద్యానమును సమీపించెను. అప్పటికి చీకటి బాగుగాపడినది. మేఘములింకను నాకాశమును గ్రమ్మియేయుండెను. అడపతడపం జినుకులుకూడ పడుచుండెను. ఇట్లుండ నొక బ్రహ్మాండమైన మెఱుపుమెఱయుటయు దాని వెనుకనే దిశల బ్రద్దలుసేయు మహాధ్వనితో నొకపిడుగుపడుటయు నొక నిమేషమాత్రములో జరిగెను. గుఱ్ఱము బెదరి పైకెగిరి చెంగున నొకదాటుదాటెను. ఆ, వేగమునకు

గామపాలుడు కెవ్వున కేకవైచి గుఱ్ఱమునుండి తూలి నేలపై దబ్బునబడియెను. గుఱ్ఱమునకుం గూడ నట్టిగతియే దాపరించెను. బ్రహ్మానందుని యాశ్రమ మచ్చటికి మిక్కిలి సమీపముననే యుండుటచే నాయాక్రందన మాతనిచెవిని బడియెను. బ్రహ్మానందుడు గుభాలునలేచి దయానందా? యేదియాపత్తు సంభవించినది. దీపములాంతరును బట్టుకొని నావెంటరమ్ము. ధ్వనిననుసరించి కామపాలుడున్న స్థలమునకు నొక్కపరుగునవచ్చి చేరెను. ఇంతలో దయానందుడుకూడ దీపముతో నేతెంచెను. పడియున్న గుఱ్ఱమును, గామపాలుడును గంటఁబడిరి. వెంటనే బ్రహ్మానందుడు కామపాలునిలేవనెత్తి యొడిలోఁగూర్చుండబెట్టుకొని శరీరమును దడిమి నాడిని బరీక్షించి దయానందా! ఈతడు బ్రతికియున్నాడు. అశనిపాతముచే బెదరి గుఱ్ఱమునుండి తూలి యిట్లుపడియుండనోపు. మరియు వర్షపుదెబ్బ బాగాతగిలినట్లు కనఁబడుచున్నది. నీవాశ్రమమునకుఁబోయి త్వరితముగ నగ్నిగుండమునుండి, నిప్పులను గొనిరమ్మన దయానందు డట్లుచేసెను. కామపాలుని తడిచొక్కాతీసివైచి బ్రహ్మానందుడా నిప్పులసెగచే గామపాలుని మేనంతయును గాచెను. ఆయుష్ణోపచారమునకు నాతని శరీరమందలి రక్తము వెచ్చబడి కామపాలునకు దెలివివచ్చెను. అది, యిసుకభూమియగుటచే శరీరమంతయు నలిగెను గాని యపాయకరమగు దెబ్బయేమియును దగులలేదు. కామపాలు

ఆశ్చర్యయుత హీనస్వరముతో నయ్యా! మీ రెవరు. నన్నిట్లు కాపాడగలిగితిరన—నా పేరు బ్రహ్మానందుడు—మాయాశ్రమ మిచ్చటనే యున్నది. నీ కేకవిని యిట కరుదెంచితిమి. నీ వే రేమి? ఎచ్చటనుండెచ్చటికిఁ బోవుచు నీయవస్థకుఁ బాల్పడితివ నుటయు, కామపాలుడు మహాత్మా! నాది కాంచీనగరము నా పేరు కామపాలుడు. భాస్కరనాయనంగారి కొమారుడను. ఈనగరములో సుప్రసిద్ధవేనాని యగు శ్రీధరనాయినింగారి యింటికి బోవుచున్నాడను. ఆయన నా మేనత్త పెనిమిటి. స్వామీ మీ దయవలన బ్రతికితిని. నా శరీరమంతయు బచ్చిపుండువలె నున్నది. నేను నడచిపోలేను నా గుఱ్ఱ మేమైనదో కదా? యని త్రోవలో దామపడిన శ్రమనంతను జెప్ప—బ్రహ్మానందుని మనసు కరగి కామపాలా? భయపడకుము. అదిగో నీ గుఱ్ఱ మిప్పుడే లేచినది, దయానందా నీవు సత్వరమే నగరమునకుఁ బోయి యొక బండిని గొనిరమ్మన దయానందుడు నగరమునకుఁ బోయి కొంతకాలమునకు బండితో గూడ తిరిగివచ్చెను. అప్పుడు కామపాలు నందు బరుండబెట్టి గుఱ్ఱపుగళ్ళెమును బండి వెనుకను గట్టి దయానందా! నివీతని సురక్షితముగా శ్రీధరుని యింట జేర్చి రమ్మని దయానందునితో బండిని సాగనంపి, బ్రహ్మానందుడు తనయాశ్రమమునకుఁ బోయెను.

---

## —• పదు నే డ వ ప్రి క ర ణ ము. •—

ఉత్తరహిందూస్థానము నందలి ఢిల్లీ సింహాసనముపై ఖిల్జీ వంశస్థుడగు జలాలుద్దీను పేరునకు మాత్రమే నిలిచియుండెను. సర్వరాజ్యాధికారములను యల్లాయుద్దీనే వహించి రాజ్యచక్రమును దిప్పుచుండెను. ఈతనికి రానురాను రాజ్యతృష్ణ హెచ్చి హిందూరాజ్యములను గబళింపవలెనను దురూహజనియించెను. ఇదిసామాన్యమైన పనికాదు. అటురసపుత్రులు, వేరొకప్రక్క మహారాష్ట్ర కుంతలులు, ఇటుసుప్రసిద్ధులగు నాంధ్రులు, స్థిరరాజ్యములనేర్పరుచుకొని యుండిరి. ఇట్టిస్థితిలోదురంతమగు నీసంకల్ప మీతని కుదయించినది. దురాశాపిశాచ మీతని బూర్తిగ నావేశించుటచే గరవాలమును జేబూని చిందులు ద్రొక్కుచున్నాడు. ఈనిన యాడుసింగమువలె రౌద్రమూర్తియై యల్లాయుద్దీ నొకనాటి సాయంకాలమున సమరప్రయాణ సూచకభేరీ మ్రోగించెను. భూనభోంతరాళముల దద్దరిల్లజేయు నీనినాదమున సైన్యాగారములలో గలకల ముదయించెను. వీరపురుషుల కావేశమెత్తుచుండెను. కొందరు మీసములు దువ్వుచుండిరి, కొందరు తమకత్తులను సవరించుకొనుచుండిరి. కొందరు తమదృఢగాత్రంబుల వంకజూచి యుప్పొంగుచుండిరి. సేనావార మంతయును జైతన్యమును నారాధించి యుండెను. అల్లాయుద్దీనొక యున్నతాశ్వం

బుపై నధిరోహించి సేనామధ్యమున నిటునటు దిరుగుచు, సైన్యంబుల కుత్సాహముగలుగ జేయుచుండెను. ఈతడెటకుం బోవునో యేరికినిం దెలియదు. ఈతనిహృదయ మగాధము. సైన్యములకుంగూడం దామెటకుం బోవలయునో తెలియదు. గుఱ్ఱపుసకిలింపు లతిభీకరములై యుండెను. గుఱ్ఱములు డెక్కలనేలం గొట్టుచు గ్రీవంబులం గదపుచుం గళ్లెములం గొఱకుచుండెను. పత్రిభటుడున గళ్లెములం బట్టుకొని గుఱ్ఱములం దట్టుచుండిరి. తిరిగి రెండవసారి భేరీమ్రోగెను. వాహకులశ్వములపైకి లంఘించిరి. అశ్వము లావేగమున ముందరకురక యత్నించుచుండెను. వాహకులు బలవంతముగం గళ్ళెముల బిగియంబట్టి యావేగము నాపుచుండిరి. అల్లాయుద్దీ నిప్పుడు సిద్ధముచేసిన సైన్యమంతయు నశ్వసైన్యముగనే యుండెను. అదాటున నెవరిపయినో బడునట్లులు తోచుచున్నది. సమయముతప్పినప్పుడు తప్పించుకొని పారిపోవుటకును, సమయము చిక్కిన నదాటున మీదబడుటకును, నశ్వసైన్యమే సాధనం బని యాతడెరింగెను. ఈసైన్య మెనుబదనేలుండెను. దీనిచే నీతడే దేశమునో కబళింపం బూనెను. రణయజ్ఞమునకు దగిన సన్నాహము లన్నియు సిద్ధమయ్యెను. యజ్ఞభూమి నెచ్చట నేర్పఱచెనో తెలియదు. మరల భేరీమ్రోగెను. సైన్యంబుల నెల్ల గంగాతీరమునందలి ఖురాసను బ్రదేశమునకుం బోవ శాసించెను. సైన్యములు నడచుచుండెను. ఇంతలో నల్లా

యుద్దీనుని మనోగత దౌష్ట్యంబు నెఱింగి హస్త్యాదిపై నిలిచి యెఱ్ఱబడిన దేహముతో గోపగించుచున్న వాడుంబోలె లోక బాంధవుడు చూపట్టెను. సౌరభంబుల వెదజల్లుచు గంగాజల శీతవాతపోతములానాయంతన సమయమున నల్లాయుద్దీను నప్పు (బ్రసరించి యుత్సాహము నుబుకిగొల్పుటచేదనగుణ్ణమును జకచక నడిపింపుచుండెను. ఈతఁడిప్పుడు బోవుచున్నది విదర్భ దేశముచకుఁ బోవుమార్గము. ఈమార్గము పొడుగున నున్నఁ బట్టణములను బల్లెలను దోచుకొనుచు నగ్నిజ్వాలల దరిగొ ల్పుచు హాహాకారము లెత్తించుచు మహాభీభత్సమును గలుగ జేయుచుండెను. ఈతనికి రాజ్యతృష్ణతోఁగూడ ధనతృష్ణతోడై యనేకదుష్కార్యములను జేయించుచుండెను. ఇటులనే కొన్ని దినంబులుసడచి రెండుమాసము లగునకి విద ర్భనుదాటి యచట రెండుదినంబులువిశ్రమించి తన యరుణ నేత్రము నొక్కమారుసక్షిణమువయిబ్రసరింపఁజేసెను. ఆదా రిని బ్రయాణముఁ జేయు పాంథులు మహమ్మదీయ గంభీర సేనాసముద్రము దారికడ్డుగ నుండుటచే వెనుకవారు వెనుకను కును, ముందువారుముందునకును బోవుచుండిరి. అల్లదే చూడుడు, ఈసేనావాహినికి భయపడికాబోలు నొకపాంథు డింకను సైన్యము రెండామడదూరమున నుండగనే వెనుకకు మఱలి రొజుచు పరుగుపరుగునఁ బోవుచున్నాఁడు. ఆతడలసి నెమ్మదిగ బోవుచున్నాఁడు. కొంతసేపదేరి మఱల పరుగునకు

దొఱకొనినయెను. కాని యీ పర్యాయ మెంతదూరమో పరుగిడలేకపోయెను. మేనంతయు జెమ్మటపట్టెను. అలసెను. మనస్సుముందునకు లాగుచుండుటచే దానిబలమున నెట్టులో మందమందముగ నడచుచుండెను. ఆతడిట్లు పోవుటజూడ నేదో యొక కార్యభారమును బూనియుండెనని దోచెడిని. రాత్రి రెండు యామములయ్యెను. ఆతడు దేవగిరి జేరియొకవీధింబడి పోవుచుండెను. గమ్యస్థాన మచటికి గోచర మగుచున్నను నాస్వల్పదూరమే మిక్కిలి దవ్వుగాఁ దోచుచుండెను. గృహముసమీపించిన కొలదిని, యాతనికి బలము క్షీణించుచుండెను. అడుగులో నడుగులువేయుచు నెట్టకేల కొకగృహముకడకేగి వీధియరుగుపై జతికిలబడి యొక్కనిమిషమట్లే కూర్చునిలేచి తలుపుతట్టెను. ఎవ్వరునుబలుకలేదు. మఱలఁదట్టెను. అప్పుడు లోపలనుండి యొకపురుషు డెవరువారని పలుకరించుచు దలుపుదగ్గఱకునచ్చి నిలువ నేనుఁ బ్రిచండుడనని బాటసారిబదులు చెప్పెను. మొన్నబోయిన బ్రిచండుడేల నింతత్వరలో దిరిగి వచ్చెనని లోనిబురుషు డనుమానించి ప్రిచండాయని పిలువ ఆ! యేమి! తలుపులుతీయుచున లోని పురుషుడు గుభాలున తలుపులను దెఱచి, ప్రిచండా! యేమిది, ఇంతత్వరలో దిరిగి వచ్చితివేమి? విశేషము లేమియనియడుగ, బ్రిచండుడాతని మాట వినుపించుకొనకే లోనికిఁబోయి వసారాలో జతికిలబడి యెను. ఇంతలో జయదేవుడు లేచి ప్రిచండునిగాంచి ప్రిచం

డాసీవు ఢిల్లీకిబోలేదా? వెంటనే తిరిగివచ్చితివేమి? అనియడుగ, దానికిబదులుగప్రచండుడు, నాగొంతార్చుకొనిపోవుచున్నది మంచినీళ్ళను దెచ్చియిండు. ప్రాణము లెగిరిపోవుచున్నయవి. అనుటయు భీమునకు వెంటనే మంచినీటినిదెచ్చియీయ త్రావి సేదదేరి యింకేమన్నది. ఏమని చెప్పుదును, పెద్దపులి నోరు దెఱచుకొని మ్రింగివేయవలెనని పరుగు పరుగున వచ్చుచున్నది. ఏమిజేయవలెనో త్వరపడుడు.

భీమ—ఏమిది ప్రచండా! స్పష్టముగాఁజెప్పుము. అల్లాయుద్దీను బయలు వెడలినట్లు తెలిసినదా యేమి?

ప్రచం—ఔను—సముద్రముప్పొంగి పాఱలి వచ్చుచున్నది.

జయ—అత డోరుగల్లునకుఁబయలువెడలి యుండనోపు.

ప్రచం—కాదు. కాదు, ఆత డోరుగల్లునకుఁ బోవు మార్గమును దాటి ముందునకు వచ్చెను.

జయ—ముందున కనగా నెచ్చటికివచ్చెను.స్పష్టముగా జెప్పుము.

ప్రచం—విదర్భ దేశమునుదాటి దేవగిరి సరిహద్దుల లోనికి వచ్చియున్నాడు.

భీమ—దేవగిరి సరిహద్దులలోనికా! అయ్యో! కొంప మునిగినది. ఆతడు దుష్టబుద్ధియని యరుణప్రభుడు చెప్పినప

టినుండియు నాకు భయము గలుగుచునేయున్నది. అప్పుడే నాలుగామడ దూరమునకు వచ్చిచేరెను. ఏమియుపద్రవము రానున్నదో గదా!

జయ—ఆతడు దక్షిణమునంతె నొక్కమారు మ్రింగ జూచుచున్నాడు. ఇప్పుడోరుగల్లుమీదబడిన జయించుట కష్టమని తలంచి దేవగిరిని మ్రింగ దలపెట్టినాడు.

భీమ—ఆతనిసైన్యమెంత యుండెనో నీకుఁ దెలియునా!

ప్రచం—తెలియదు. సుమారొక లక్ష యుండునను వదంతి.

జయ—లక్షకు మించని సైన్యమే యగునో రామచంద్రదేవు డాతని యోడించుటకు సందియము లేదు.

భీమ—తురుష్కులు తనపై బడుదురని స్వప్నమందైనను దలంపక యేమరియున్న రామదేవుడ దాటున మీదబడిన శత్రువు నెట్లెదురొక్కగలడు?

జయ—సరియే కానిమ్ము! ముందు కార్యమాలోచింపవలెను. త్వరపడుము.

భీమ—యేమి చేయుమనియెదవు!

జయ—అరుణప్రభుని దోడుకొనిరమ్ము! ఆతడు దూరాలోచనపరుడు. ధైర్యసాహసములుగలవాడు. ఉపాయమాలోచింపగలడు. అరుణప్రభు డెదురింటిలోనే యుండెను. భీమణుడు వెంటనే లేచివెళ్ళి యరుణప్రభుని లేపి కారణమునుఁ

జెప్పకయే దోడుకొని వచ్చెను. వారిరువురును గూర్చున్న పిదప జయదేవు డిట్లనియె.

జయ—అరుణప్రభా! దేవగిరి రక్తపాతము గానై యున్నది. అల్లాయుద్దీన్ ప్రచండ సైన్యములతో దేవగిరిసరిహద్దులకుఁ జేరినాడు. ఆకస్మికముగ నిట్లు దేవగిరిపై బడుసని కలనైన దలంపమైతిమి. నీవు బుద్ధిమంతుడవు. ముందుగతి యేమను సమస్య పరిష్కరింపవలెను.

అరు—ఆగ్రహముతో,—ఔరా! యనుకొన్నట్లైనది. హైందవ సామ్రాజ్యములకు వినాశము దాపరించినది కాబోలు మీబోటి విభీషణుల దుస్తంత్రముల ఫలితమేయిది. కొరివిపెట్టి తలగోకికొంటిరి. ప్రతాపరుద్రునిపై గలయీర్ష్యచే హైందవరాజ్యలక్ష్మికి వైధవ్యమును, గర్భశోకమును దెచ్చిపెట్టుచున్నారు. జన్మభూమిని రక్తసిక్తమొనరించెడి మీమతమేమిమతము. కరకుతురకల కరవాలముచే మీమతము రక్షింపబడు ననుకొంటిరా? దయాలవాలమగు మతము నెంత పాడుచేసితిరి? ఎంతటి యపరాధ మెంతటి యపరాధము. ఓజననీ! వసుంధరామతల్లీ, సకలఫలప్రదాయినీ, నీభారతజననీత్వమును లుప్తమొనరించెడి దుష్టపుత్రులకై యెంతగా వగచెదవో తల్లీ? అనితలవాల్చి గుడ్లనీరుగ్రుక్కుచు మాటలాడ కూరకుండెను.

జయ—అరుణప్రభా! మమ్మేల నిశితవాగ్జాలముల నొప్పించెదవు? పొంగిపొంగి ప్రవహించుచున్న మహానదీప్ర

వాహములో నొక యుద్ధరిణౌషదకము బోసినట్లు, మహాన్మదీయ రాజ్యతృష్ణా మహాప్రవాహములో మాయత్న మొక యుదకబిందువును జార్చుటవంటిదే కాని వేరుకాదు అయిన దేదియో యైనది. గతమును ద్రవ్వకుము.

అవు—ఆపత్కాల వేదాంతము, మనస్సమాధానమున కుపకరించిన నుపకరించును గాని భావిభారత సంతతికి మనస్తాపకరమని నమ్ముము. కానిమ్ము, ఇకనైన దేశద్రోహమునకు దిగకుందురుగాక? మీకుధైర్యమున్న నావెంట రండు. అతిసాహసమైన పనియొనరింప వలసియున్నది. నిద్రించుచున్న సైన్యముల మేలుకొలుపవలెను. కోటలోని కీవార్త వెంటనే వ్యాపింపఁ జేయవలెను. సాహసముతో రణభేరి మ్రోగింపవలెను. నేనుబోయి భేరీమ్రోయించెదను. భీషణా! నీవు గోటకు బరువెత్తుము. జయదేవా? నీవుసైన్యముల మేలుకొల్పుము. ప్రచండా? నీవుపౌరులను బ్రబోధింపుము. అనిశగవేగమున నరుణాప్రభుడు బోయి యడ్డంకుల సరకుగొనక యుద్ధభేరిని మ్రోయించెను జయదేవుడు సేనానివేశనంబులకుఁ జేరెమువాడెను. భీషణుడు కోటకుబోయెను. ప్రచండుడు పట్టణమంతయునుఁ జూచుచుండెను. దిశలు దద్దరిల్లునటుల భేరీనినాదము వెడలెను. సైనికులెల్లరును త్రుళ్ళిపడిలేచిరి. కోటలో నల్లకల్లోల ముదయించెను. నగరవాసులు మేల్కని కలవరపడుచుండిరి. ఇంతలో దెల్లవారెను

## —•పదునెనిమిదవ ప్రకరణము•—

ఏకశిలానగరము దీపములు బెట్టినదిమొదలు రాత్రి పదిగంటలవరకును మిక్కిలి సమ్మర్దముగానుండును. తమతమ పనులనుఁ జాలించి కోటనుండి యింటికిఁ బోవుజనము పుష్పములను ఫలహారపు వస్తువులను గొనిపోవుచుండు టలవాటు యగుటచే బెద్దబజారు మిక్కిలి సమ్మర్దముగనుండెను. రామనారాయణసింగను నొకబొందిలి యువకుఁడు క్రొత్తగాఁబెట్టినఁ బండ్లయంగడి మిక్కిలి ప్రసిద్ధిగాంచెను. అక్కడ దొరకని పండ్లేమియును లేవు. ఆయంగడికడ జనమెప్పుడును గిక్కిరిసి యుందురు. బేరముచుఱుకుగా జఱుగుచుండెను. ఇట్టిసమయమున నొకయువకుఁ డిటునటు బచారుచేయుచు, బేరమంతయును జూచుచుండెను. పదిగంట లగుసరికి జనసమ్మర్దము తగ్గినది. రామనారాయణుఁడమ్మకపుడబ్బును లెక్కబెట్టుకొనుచుండెను. పచారిఁజేయుచున్న యువకుఁడు నెమ్మదిగ నంగడి దరికేగి, జేబులోనుండి యొకయుత్తరమును దీసి రామనారాయణున కందిచ్చెను. ఆతఁడుత్తరమును జదువుకొని యంగడి నుండి తటాలునలేచి నౌఖరుతో నంగడిమూసి యింటికిఁ బొమ్మనిచెప్పి మాటాడక నాయువకునితో బోయెను. వీరిద్దరును నొకరితో నొకరుఁ బలుకరించుకొనకయే బాహ్యోద్యానమునుదాటి యొకమామిడి తోపులోఁబ్రవేశించిరి. అచ్చట

వీరలకై యెదురుజూచుచున్న యొకపురుషుడు వీరురాగానే రామనారాయణుని పరిజేరి కరంబుబట్టి యూచుచుసరదార్ జఫరాలీఖాన్? వచ్చితివా! అల్లాయుద్దీను చక్రవర్తి నన్నునీ కడకంపినాడు. త్రోవలో—నబ్దుల్ ఖరీము కనబడినాడు. చక్రవర్తి సైన్యముసంతను సిద్ధముచేసినాడు. నీవద్దనుండి యుత్తరము రానికతమున సంగతినికనుగొనిరమ్మని నన్నుపంపినాడు. నీయాజ్ఞయైనచో వెంటనే బయలుదేరి కోటనుముట్టడించును. రహస్యము లేమి?

జఫరాలీ—ఓయీ!రహీమాన్,ఒకమాసాంతమునలో దేవగిరిని ముట్టడించెదనని చక్రవర్తి జాబువ్రాసియున్నాడే. ఎనుబదివేలయశ్వసైన్యమునుసిద్ధముజేసినట్టుకూడావ్రాసినాడు. దేవగిరి ప్రయాణమునుమాని యిక్కడకేవచ్చుచున్నాడా యేమి? ఇదేమో గందరగోళముగా నున్నది.

రహీమాన్—సరదార్? గందరగోళమున కేమున్నది? ఏకశిలానగరమును జయించి నిన్నిరాజ్యమునకుఁ బట్టాభిషేకముఁజేయవలెనని తొందఱ పడుచున్నాడు. నీకష్టమునకిది తగిన ఫలమేకదా?

జఫరా—రహీమాన్? ఎకసక్కె మాడుచున్నావా? నాకట్టియదృష్టము పట్టుటకుబ్రతాపరుద్రుడంత యసమర్థుడు కాడు.ఆతడువలలోఁ బడవలెనుగదా?

రహీమాన్—సర్దార్! నీకింతయాశ్చర్యమేల? అల్లాయుద్దీనునితో నీకుబనియేమి? నేనేనిన్ను రాజ్యాభిషిక్తునిజేసె

కను. ఆపని యిష్టుఁడే జలూకు టమంచిది. ఇదిగో కిరీటము. ఇదిగో చంద్రహారమని, యొకచేత, నెత్తిపై మొత్తి వేఱొకచేత మెడబట్టి గెంటెను.—ఆ దెబ్బకు జఫరాలీ క్రుంగి ముందుకుఁ దూలి పడెను.—జఫరాలీ, సాధారణుఁడా! మహామోఘుఁడు మంచి బలముగలవాఁడు, తలదిమ్మెత్తినను వెంటనేలేచి యరె! తుచ్ఛా ఎంతకెంత సాహసము. ఎవఁడవు నీవని మెల్లగా మొలపై జేయివైచి కత్తిదీయుచు నిలఁబడెను. అంత రహిమాన్! జఫరాలీ! నాపేరు నీకుఁ గావలెనా! అట్లయిన వినుము. నా పేరు బ్రహ్మానందుఁడు. సన్న్యాసిని. ఏమది మొలపడుము కొనుచున్నావు? కత్తికొఱకా తుచ్ఛా! నిలువుమని గుభాలున మీదకురికి గుండెలపై నొక్కి పోటుపొడిచెను. జఫరాలీ మరలపొడిచెను. ఈద్వంద్వయుద్ధములో నొకరికొకరు దీసిపోవుటలేదు. సమయముజూచి జఫరాలీ మొల నుండి కత్తి నూడఁబెరికెను. వెనుకనుండి దయానందుఁడు చటాలున వచ్చి చేతిపై నొక్క దెబ్బగొట్టెను? చేతిలోని కత్తియూడి తూలిపడియెను. ఖాన్ వెనుదిరిగి జూచునంతలో బ్రహ్మానందుఁడాతనిని సందిటబట్టి బంధించెను. ఆతఁడు గింజుకొనుచుండ దయానందుఁడు త్రాళ్ళదెచ్చి కాలుసేతులు బంధించెను. జఫరాలీ పట్టుపడెను. గురుశిష్యు లిద్దరును నా ద్రోహిని సాయముబట్టి యాశ్రమమునకుఁ గొనిపోయిరి. పిమ్మట జఫరాలీ యిట్లనియె.

జఫరాలీ—స్వామీ! బ్రహ్మానందా! నన్నుబట్టిన

నీ క్షేమలాభము. నన్ను వదలినచో లక్షరూకలిత్తును. ఢిల్లీ చక్రవర్తిచే నీవుగోరిన కోరికలెల్ల నీడేర్పజేతును.

బ్రహ్మ—ఓహో! అట్లనా ఎంతటిసమయోపాయుడవు! సన్యాసి ధనమేమి చేసికొనును. సర్వసంగ పరిత్యాగికి కోర్కెలెక్కడ నుండును నీమాయలో బడు తుచ్ఛసన్యాసి కాడువీడు. నీప్రియమిత్రుడు డబ్బుల ఖరీముకూడ యిక్కడనే బంధింపఁబడి యున్నాఁడు. నీవుచేయు దేశద్రోహమంతయును తెలిసిపోయినది. ఛీ! వీనితో నిక మాటలాడఁదగదు. దయానందా? వీనినంతఃగృహమునబంధింపుమన దయానందుడట్లొనరించెను. ఆమరునాఁడు సాయంసమయమున చక్రవర్తి యుద్యానవనమునకుఁ బండితులతోను గురువులతోను కొంత మంది సేనానులతోను విహారమున కరుదెంచెను. బ్రహ్మానందుడు దయానందుని జేరబిలచి దయానందా? చక్రవర్తి యుద్యానవనమునకు వచ్చినటులున్నది. నీవుతక్షణమేపోయి బ్రహ్మానందులు మీరాకకై నిరీక్షించుచున్నారని తెలిపి రమ్మన, దయానందుడు నట్లేయని యుద్యానవనమున కేగి కావలివానితో నీవుపోయి బ్రహ్మానందులవారి శిష్యులుమీకడకు వచ్చుచున్నారని చక్రవర్తితో నివేదింపుమన వాడుతక్షణమే చక్రవర్తికడకుఁ బోయి నమస్కరించి మహారాజా? బ్రహ్మానంద శివయోగీంద్రులవారి శిష్యులు మీదర్శనమునకై వేచి యున్నారని నివేదింప,జక్రవర్తి యాశ్చర్యముతో స్వామిశిష్యు

లేనా? సత్వరమే తోడుకొనిరమ్మన వాడుపోయి దయానందు నితో దరిగివచ్చెను. చక్రవర్తిలేచి నిలుచుండెను. అందరును లేచిరి. స్వామీ! దయచేయుడని చక్రవర్తియొక్క యాసనమును దయానందునకుఁ జూపించెను. దయానందుఁడు కూర్చొనక యే మహారాజా! బ్రహ్మానందులు మీరాకకై నిరీక్షించుచున్నా రనెను. చక్రవర్తి మహదాశ్చర్యచకితుడై స్వామీ? కారణ మేమన, దయానందుడు నాకుఁ దెలియదనెను. సాధారణముగా స్వామిదర్శనమే దొరకుటకష్టము. అట్టిస్థితిలో స్వామియే స్వయముగఁ గబురంపుట యందఱకునుగూడ నాశ్చర్యముగలి గెను. చక్రవర్తి కదలెను.ఆతనితో బాటు పరివారమంతయును గదలెను. బ్రహ్మానందుని యాశ్రమము కడు జేరువనేయుండుటచే బదనిమిషములలోఁ జక్రవర్తి స్వామియాశ్రమమును జేరుకొని యెను. బ్రహ్మానందుడు నిలువుటంగీని దొడుగుకొని ముఖమున విభూతియు, గంఠమున రుద్రాక్షమాలికలును మెఱయ, దండ మును గుమ్మముకడనుంచి లోన సమాధిమందిరమున గూర్చుం డెను. చక్రవర్తిస్వామిసన్నిధి కరుదెంచి దండమునకు నమ స్కరించెను. మిగిలిన పరివారమంతయునట్లే యొనరించెను. అంత బ్రహ్మానందుఁడు చక్రవర్తికి గూర్చుండ సంజ్ఞజేయు చక్ర వర్తితో నందరును గూర్చుండిరి. ఒక్కనిమిష మందరును మౌనముతోనున్న పిదప బ్రహ్మానందుడు, రూక్ష భావముతో మహారాజా! చక్రవర్తి, సామ్రాజ్య సంరక్షణమునం దేమరి యుండుట హానికరముగాదా!

ప్రతా—స్వామీ! ఏమిది! అట్లనుచున్నారు ఏమరి యుండుటయా!

బ్రహ్మ—ఔను! సర్వవిధముల రాజ్యమును గాపాడినగాని మాంబోటి యోగులకు నిలువనీటుండదు. నీనగరమున గలుగు విద్రోహమేమైనఁ దెలిసికొనగలిగితివా! సర్వనాశనము -సర్వనాశనము — ప్రతాపరుద్రుఁడు" నిశ్చేష్టుడయ్యెను. అంధకారములో బడినట్లయ్యెను. ఊహ పొడకట్టుటలేదు. బుఱ్ఱ గిఱగిరదిరిగి పోవుచుండెను. సంశయాకుల చిత్తముతో నిట్లనియె.

ప్రతా—స్వామీ! విద్రోహమేమిటి? సర్వనాశనమేమి? సెలవిండు. ప్రతాపరుద్రుఁడు సహింపలేకుండ నున్నాఁడు.

బ్రహ్మ—రాజా! శాంతింపుము. చక్రవర్తి వేయి గన్నులతో రాజ్యమును దిలకించుచుండవలెను. అని దయానందు నీక్షించి, దయానందా! వారిరువురునిటకుఁ దోడుకొని రమ్మన దయానందు డిద్దఱుభటుల సాయముగొని యాతుఱకల నిద్దఱను గొనివచ్చెను. చక్రవర్తికి వారిద్దఱనుఁజూపి, యీతఁడు సర్దార్ జఫరాలీఖాన్. ఆతడబ్దుల్‌ఖరీము. వీరిద్దరును ఢిల్లీచక్రవర్తియగు యల్లాయుద్దీనుని సహచరులు, మారు వేషముతో నగరమునుండి రహస్యములన్నియు ఢిల్లీకి వేగునడుపుచున్నారు. ఇదిగో చూడుడీయుత్తరము. దీనిని దయానందా? చదువుమన నాతడాయుత్తరమును నుచ్చైస్స్వరమున

జదివి స్వామి యాసతిని జక్రవర్తికిచ్చెను. చక్రవర్తి మరల దానినంతను జదువుకొనియెను. ఆతనికిసిగ్గు—భయము—క్రోధమును నొక్కసారి యావేశించెను. పరివార మంతయును గుండెలపైని జేయివైచికొని యెంతపని, యెంతపనియని పలువరించిరి. అంత బ్రహ్మానందుడు జఫరాలీఖానుని బట్టుటలో దానుగల్పించిన యుత్తరమునుం బ్రతాపరుద్రునకిచ్చి జఱిగిన సంగతియంతయును తెలిపెను. చక్రవర్తి స్వామిమహిమకును దేశభక్తికిని యమితానంద భరితుడై యాదేశద్రోహుల నిద్దఱను బందిగములోనుంచనాజ్ఞయొసగి సెలవిప్పించుడని వేడ, బ్రహ్మానందుడు రాజా! యింకొక నిమిషమాగుము. నీకు రెండు వాక్యములు జెప్పవలసియున్నవి, వినుము. రామచంద్రదేవుడు శత్రువని యాలోచించక తక్షణమే తద్రక్షణార్థమై సేనలనంపుము. అల్లాయుద్దీ నీపాటికే దేవగిరిని సమీపించునని మాదివ్యదృష్టికి బొడకట్టుచున్నది. దేవగిరి తురకల వశమైనచో నీకెన్నటికైన, హానికలుగక మానదు. మరియు ములికినాటి సీమను బాలించుచున్నం ద్రిపురాంతక దేవుడును, గండికోటసీమనుం బాలించుచున్న నంబయదేవుడును నీసామ్రాజ్యమును ధిక్కరించుచున్నట్లు తెలిసికొంటిమి. అట్లగుచో నరాజకమగును. అనఁ బ్రతాపరుద్రుఁడు స్వామీ! నాకాసంగతి యిప్పుడే తెలియవచ్చినది. త్వరలోనే శాంతి నెలకొల్పు యత్నమునుం జేసెదనని బలికి స్వామికడ సెలవుదీసి

కొని స్వామియొక్క మాహాత్మ్య ప్రజ్ఞాప్రభావములను స్తుతించుకొనుచు నందరును తమ తమ యిండ్లకుఁజనిరి.

—·—

## —• పందొమ్మిదవ ప్రకరణము •—

కామపాలుడు చావుదప్పి తుద కెట్లులో శ్రీధరుని యింటికిఁ జేరుకొనియెను. శ్యామల విచారముతో గొడుకున కుపచారము జేయుచు నాయనా! యెంతసాహస మొనరించితివి? నాయదృష్టము బాగుండి జీవముతో గంటబడితివంతే చాలునన, రుక్మిణినీవే కాదు. మేముకూడ చాల యదృష్టవంతులము ఈ యుపకారమంతయును బ్రహ్మానందశివయోగిది. అతని మహిమ లోకాతీతమని చెప్పుకొనుచున్నారు. కామపాలా, నిన్నటికంటె యీరోజున నొప్పులు కొంచెము తగ్గినవా? యన కామపాలుడు, తగ్గినవి. నొప్పులు లేనే లేవన్న మాట, కొంచెమించాక కఱ్ఱపట్టుకుని నడచినాను, రెండుమూడు రోజులలో బాగుగా నడవగలుగుదును. వైద్యుడిచ్చినమందు బాగుగాపనిచేసినదనెను. అంత గొంత సంతోషముతో రుక్మిణీ శ్యామలల ముఖములు వికసించెను. రెండురోజులుగడచిన పిదప కామపాలునకుఁ గఱ్ఱయొక్క యక్కఱ లేకయే లోనదిరుగుటకు శక్తి గలిగినది. అతడిల్లు వెడలునప్పుడు మిక్కిలి యుత్సాహమును, షోకైన యుడుపులతోను, దిద్దబడి నిగనిగలాడు తల

క్కులతోను, హుషారుగా బయలుదేరెను. మార్గమధ్యమున గలిగిన విషమపరిస్థితిచే నివన్నియును దారుమారయ్యెను. తడిసి ధూళిదూసరితమైన, బురదబట్టలతో జబ్బిబ్బిదికి యర్ధ ప్రాణములతో సత్తవారి యిల్లుజేరుకొనియెను. ఇంతవరకు మధుమతి, యీతని గంటబడలేదు. ఏదియో యొకనెపమున మధుమతిని జూడవలెనను యాతురత బాగుగా విజృంభించ సాగెను. ఇంతవరకును మంచమే శరణ్యమగుటచే దనకోర్కె కెట్టిసావకాశమును లేకపోయెను. భగవంతు డొసంగిన నీ గర్వభంగమునకుఁ బశ్చాత్తాప మాతని హృదయమునఁ జనించలేదు. కొంచెము స్వస్థత కలుగగానే మరల వేషమును దిద్దుకొనుటకుఁ బాటుపడుచుండెను. తలదువ్వుకొని శుభ్రమైన వస్త్రములను ధరించి యత్తరువును బూసికొని పడుకకుర్చీపయిని గూర్చొని మీసములను నిమురుకొనుచుండెను. ఆసమయమున గోకిల ఫలహారమును దీసికొనివచ్చి యీయ నందుకొని, చిరునగవుతో, గోకిలా! నాకేమియును దోచుట లేదు. మధుమతికడకుఁ బోయి యొకపాత్రము నడిగి తెచ్చిపెట్టుదువా? యన, గోకిల వల్లెయని మధుమతిగదిలోనికిఁ బోయి, అమ్మా! మధుమతీ! పుస్తకము కావలయునట. యిచ్చెదవా? యన, మధుమతి, యెవరికే, యేమిపుస్తకమే యనెను. కోకిల యదేమిపుస్తకమో నాకు తెలియదు. కాము పాలునకు దోచుటలేదట. నిన్నడిగి యొకపుస్తకమును దెచ్చి

పెట్టుమన్నారనెను. మధుమతి నవ్వి కోకిలా నాన్నగారి పుస్తకభాండాగారములో మంచిమంచి పుస్తకములున్నవి. కావలసిన పుస్తకమును పుచ్చుకొని చదువుకొనవచ్చునని చెప్పుమన, కోకిలపోయి కామపాలున కాసంగతిఁ జెప్పెను. కామపాలుడు నవ్వుచు మామయ్య యింటలేరు. అవితీసి యిచ్చువారెవరు? ఒకపాత్రమిచ్చిన మరల భద్రముగ నిచ్చి వేసెదనని చెప్పుము. విసుగుతో గోకిల మధుమతికడకుఁ బోయి మీయిరువురిమధ్యను నేను నలిచచ్చుచున్నాను. మామయ్య యింటలేరట. ఒకపాత్రమిచ్చిన జదివి మరల భద్రముగ నిచ్చునట. ఏమందువన, మనసున నిష్టములేక పోయినను జదువుకొనుటకుఁ బుస్తకమును గదా యడిగెనని వ్యాఖ్యగాని, టీకార్థముగాని లేని కేవల మూలశ్లోకములు గల భగవద్గీతను దీసియిచ్చి చదువైనవెంటనే నాపాత్రమును నాకుఁ దెచ్చియిమ్మని పంపివేసెను. కోకిలాపాత్రమును దెచ్చి కామపాలున కిచ్చెను. ఆతఁడాపాత్రమును దెఱచి చూడ మొదటిపత్రముపై నీపాత్రము మధుమతిదను హస్తాక్షరములుండెను. దానినే పదిమారులు జదువుకొని యక్షరముల పొందికకు మురియుచు వేఱొకపత్రము వెదఱగవేసెను. భగవద్గీతయని యుండెను. ఈపేరెప్పుడైన విన్నాడేమోకాని పుస్తక మింతవరకెప్పుడును జూచి యుండలేదు. నాలుగుశ్లోకములు చదివెను. అర్థముకాసందున

బైటికిఁబోలేదు. మరల నొకటిపత్రమునకువచ్చెను. ఈపొత్తము మధుమతియను వాక్యమునే మరల జదివెను. ఈవాక్య మొక్కటియే, యాపుస్తకముయొక్క మొత్తములో నీతని కర్థమైనది. ఎన్నిపర్యాయములు చదివిన నావాక్యమొక్కటియే. ఎంతసేపని జదువును. పొత్తమును మూసివేసెను. ఇది తనకొక పెద్దయవమానమని యాతఁడెంచెంగిన మరలస్వస్థముగ నటఁగూర్చొని యుండలేడు. ఆతఁడొక నిమిషమట్లే యోచించి కలమును గాగితమునుదీసి యేదియో వ్రాసి చదువుకొని మడచి మరల విప్పి చదువుకొని మడచి చేతబట్టుకొని యుండెను. ఇంతలో గోకిలవచ్చి పొత్తము జదువుటయైనదా? అయినచో నాపొత్తము నిటు తెండు. మధుమతికిచ్చివేసెద ననెను. కామపాలుం డింకను బూర్తిగ జదువలేదు. కొంతకాల మింకను నావద్దనుండనిమ్ము. మధుమతివలె దీని నాదరింతును. కోకిలా! దీనికేమికాని నాదొకపని. నీకు మంచి బహుమానము. ఏమందు వనియెను. కోకిలగడసరి. ఆమె యిట్లనియె. నాయదృష్టము బాగున్నది. నేడు కడపెదుట్లైనది. అప్పుడే యనుకొన్నాను. ఏదోలాభమున్నదని ఏమిటా పని సెలవిండన, కామపాలుడు, రా యిటురమ్మని రెండురూకలు చేతులోబెట్టి నీకు మొన్ననే యిద్దామనుకొన్నాను. ఇప్పటికిగాని వీలైనది కాదు. తీసికొనుము- చూడుము కోకిలా! ఈయుత్తరమును మధుమతి కెవ్వరును జూడకుండ నీయవల

యనుసుమా యని యుత్తరమునుగూడఁ జేతఁబెట్టెను. ఈ తంతు కోకిల కిష్టములేదు. అయిన నీచిత్రమే మోహనాంతమని రెండును రెండుచేతులఁబట్టుకొని మధుమతికడకుఁ జని కూకలును నుత్తరమును నామెచేతఁబెట్టెను. మధుమతి" యేమిటే యిది కోకిలా యనెను. కోకిల కామపాలుని నిర్హేతుక జాయమాన కటాక్షమిది. ఈ కూకలు నాకు లంచము. ఈయుత్తరము నీకు గానుకన, మధుమతి కోపముతో నీవు చాల యదృష్టవంతురాలవు. ఇటువంటి నీవిట్టిపని కెప్పుడును బూనుకొనకుము. ఇదిగో నీకూకలు తీసికొనిపొమ్మని పంపివేసెను. పిమ్మట మధుమతి యుత్తరమును విప్పి యిట్లు చదువ నారంభించెను—మనోహారిణీ మధుమతి! నేనువచ్చి వారమురోజు లైనను నీవు కనఁబడుటలేదు. నేను నీకొఱకనేక కష్టములుపడి తుదకుఁ బ్రాణములతో నీచెంతఁ జేరుకొంటిని. నీముద్దుమోముఁ జూడవలయుననినాకనులు గాయలుగాచినవి. పరిశుద్ధుఁడనై నీదయకెదురు చూచుచున్న నన్నునీవాఁడిగా భావింపుము. నీ వెంతకును కనుపించకుండుటచే సాహసించి యీలేఖ వ్రాసికొంటిని. నీకనుసన్నల మెలఁగ సిద్ధముగా నున్నానని యెరుకపఱచుకొనుచున్నాను. నీవుపంపిన పాత్రమును నిన్నుగా భావించి హృదయమున భద్రపరుచుకొన్నాను. దయయుంచి కనఁబడుచుండుము. రేపువేరొక పుస్తకమునుఁ బంపెదవని నమ్ముచున్నాను. మధుమతీ! దయయుంచుము.

కామపాలుని ఉత్తరము చదువుట ముగియగనే మధుమతి లేఖను ముక్కముక్కలుగాఁ జించిపారవేసెను. అసహ్యాభావముతో నవ్వుడే వికారచేష్ట లారంభమయ్యెను. వీనికంటెఁ బడినను బడకున్నను మహోపద్రవము గానేయున్నది. వీని వెనుక దాశమువై చుటకు శ్యామలా రుక్మిణులు సిద్ధముగా నున్నారు. కాలసర్పమింటఁ బ్రవేశించినది. కాటుబడకుండ తప్పించుకొని తిరుగుటెట్టులోఁ దెలియకున్నది. కానిమ్ము దైవమే తోడగుగాక? యని మంచముపైన బరుండి యోజనలకుఁ దగుల్కొనియెను. ఇటకామపాలుని జూచుచు రుక్మిణీ శ్యామలలు కామపాలునియొద్దకువచ్చిరి. కామపాలుని జేతిలో బుస్తకముండెను. దానింగాంచి, యదేమిపుస్తకము నాయనా యన, భగవద్గీతయనెను. శ్యామల "నీకెవరిచ్చినారు. కామపాలుడుఎక్కడనుండియో తెప్పించుకొన్నాను" అన శ్యామల పుస్తకమును పుచ్చుకొని విప్పి యీపాత్రము మధుమతిదను వాక్యమును జదివి సంతోషముతో వదినా? యీపాత్రము మధుమతిదిసుమా యనెను. రుక్మిణి చదువుకొనుట కెవరిపాత్రమైన నేమనెను. ఇంతలో గోటనుండి శ్రీధరుడు వచ్చుటచే నందరును లోనికిఁబోయిరి.



## —•ఇరువదియవ ప్రకరణము•—

రాత్రి భోజనము లైనపిదప శ్రీధరుడును భాస్కరుడును దక్షిణపు పసారాలో బడుకకుర్చీలపైఁ బరుండియుండిరి. మధుమతి యొకవిసరుకఱ్ఱను జేతఁబట్టుకొని తండ్రిచెంతఁ గూర్చొని నెమ్మదిగా విసరుచుండెను. శ్రీధరుడు కనులు మూసికొని యెద్దియో గాఢముగ నాలోచించుచుండెను. ఆతనికి మాధవునిపై గల ప్రేమ యవ్యాజమైనది. చిన్ననాటనుండియు మాధవుని మధుమతితో సమానముగ జూచుకొనుచు బెంచిపెద్దవానిగా జేసెను. మాధవు డత్యల్ప కాలముననే బుద్ధిబలముననుం, పరాక్రమముననుం, కార్యకరణమునందును సమర్థుడై, యున్నతపదవికి వచ్చెను. ప్రభుప్రీతికూలమున నిది యెంతకాలమోనిలువలేదు. శ్రీధరుని హృదయము కృంగిపోయెను. మాధవుని పరాభవమును శ్రీధరుడు తనదిగా భావించుకొనుచుండెను. మాధవునిపై గల మక్కువచే శ్రీధరుడు పుత్రులులేని చింతకుఁ బాల్పడలేదు మధుమతీమాధవుల యన్యోన్యానురాగంబును శ్రీధరుడెరుంగును. మధుమతికి మాధవుడే తగిన వరుడని శ్రీధరుని సంకల్పము. నాలుగైదు మాసములలో మధుమతీమాధవుల వివాహము చేయవలయునని నిశ్చయపరుచుకొనియెను. ఇట్టిస్థితిలో మాధవనిష్క్రమణము శ్రీధరుని హృదయమును క్రుంగింపఁ జేసెను.

మాధవునిఁ గనుఁగొనుటకై యనేక యత్నములు జేసెను. నేటి కెనిమిది మాసములైనను మాధవుని జాడేమియును దెలి యలేదు. రాజావమానమున మాధవు డాత్మహత్య గావించు కొనియెనను వదంతులు శ్రీధరుని హృదయభేదన మొనరించు చుండెను. మరియు మధుమతి వివాహోచిత వయస్సున నుండెను. ఈసమయమున వివాహముఁ జేయకుపేక్షించిన లోకులు నిందింతురు. మాధవుని కర్పించిన మధుమతిని పరుల కిచ్చుట కంతరాత్మ యొప్పకున్నయది. ఇట్టి సంకటములో బడి కొట్టుకొనుచు శ్రీధరు డీవిషయమునే గాఢముగ నాలో చించుచుండెను. మధుమతి తనచెంతఁ గూర్చొని విసరుచున్న దని యాతడెరుఁగడు. కొంతనడికి మధుమతి బాబా! నేడు కోటనుండివచ్చుట యింత యాలస్యమైనదేమని ప్రశ్నిం చెను. ఆప్రశ్నచే నాతని యాలోచన ముగిసెను. శ్రీధరుడు కనులువిప్పి విసరుచున్న మధుమతిని గాంచి, అమ్మా! భోజ నమైనదా? నీవిటకువచ్చి యెంతసేపైనది?

మధు—బాబా! మీరేదియో యోచించుచున్నట్లు న్నారు. భోజనముచేసియే వచ్చితిని. నేనువచ్చి చాలసేపై నది.

శ్రీధ—ఔను! నేనాలోచన యందేయుంటిని. దానిం దెలిపి నీకుచింతనుఁ గలుగఁజేయుట నాకిష్టములేదు. నామ నస్సున కేమియును స్వాస్థ్యము లేదు.

మధు—పోనిండు? నిమ్మాకవిషయము నడిగి మీయ స్వాస్థ్యమును ద్విగుణము చేయుదు. మీరిట్లు స్తిమితము లేక యున్న, నేనెట్లు బ్రతుకగలుగుదును బావా? ఇది మన్నిమిత్త మైనదే యగునో నేను మిక్కిలి పాపాత్మురాలను. అని కనులనుండి వెడలు బాష్పములను, ముఖమానలముఁ ద్రిప్పి పయ్యెటచెఱగున దుడుచుకొని బావా! మీరు మిక్కిలి యలసి నట్లున్నారు. ఒకమారు పాదంబులొత్తుదునా? అనెను— ఈపలుకులు శ్రీధరుని హృదయమునకు జొచ్చి నీరు గావించెను. మనోచింత వృద్ధియయ్యెను. దాని నాపుకొని యిట్లనియె.

శ్రీధ—అమ్మా! వలదు. వలదు. నాకిప్పుడెక్కడా యాస మేమియును లేదు. నేను రేపటిదినమున, దేవగిరి సహా యమునకై సేనతోఁ బోవలసియున్నది. అవ్యవధానమునకుఁ జాల చింతించుచున్నాను.

భాస్కర—తుళ్ళిపడిలేచి, ఏమీ? యిప్పుడు భావగా రేమంటిరి? దేవగిరికి సేనతోఁ బోవలయుననియా? ఇప్పుడు దేవగిరికివచ్చిన యుపద్రవమేమి?

శ్రీధ—ఔను. దేవగిరికే పోవలసి వచ్చెను. అల్లా యుద్దీన్, అశ్వసైన్యంబుతో దేవగిరిని ముట్టడించెనని తెలిసి నది. చక్రవర్తియాజ్ఞపై ముట్టడిని విడిపించుటకై దేవగిరికిఁ బోవలసి యున్నది.

భాస్క—చక్రవర్తికిని దేవగిరి రాజునకును మనస్పర్థ లున్నవిగదా? అట్టియెడ దేవగిరి రక్షణము సార్వభౌమున కేల యవసరమయ్యె.

శ్రీధ—బ్రహ్మానంద శివయోగీంద్రుల యుపదేశఫలితము. బ్రహ్మానందు డీమధ్యనే చక్రవర్తి సామ్రాజ్యమునకు వినాశమునుదలపెట్టుచున్న విద్రోహులగు మహమ్మదీయులను పట్టి బంధించి ప్రతాపరుద్రున కప్పగించెను. తురకలు దేవగిరినిస్వాధీన పఱచుకొనినచో నాంధ్రసామ్రాజ్యమునకు హాని కలుగును దేవగిరినుండి మహమ్మదీయులను, బాఱదోల వలయునని శాసించినాడు.

భాస్క—బ్రహ్మానందు డప్రతిహత ప్రభావుడని విని యున్నాను. నిజమేనా?

శ్రీధ—అతడుత్రికాలవేది. ఆతనికి దెలియని రహస్యము లేదు. కామపాలుడు బ్రతికి యిల్లు జేరుకొనుట కాతని సహాయమే కారణము. లోకసంరక్షణమును బూనిన యాశ్వరుడు. సార్వభౌము డాతని యాజ్ఞల జెల్లించుచుండును.

భాస్క—అట్లనా? మీప్రయాణ మవ్యవధాన మగుటచే మిక్కిలి చింతించుచున్నాను.

శ్రీధ—అవ్యవధానమునకు నేను విచారించలేదు. ఈసమయమున మాధవుడుండిన నాకెంతయో సహాయముగ నుండియుండును. నాకీకష్టమే లేకపోయియుండును. నాదురదృ

ష్టమున నాతడెటకో బోయెను. నేనేమి సేయుదును? మాధవ ఖడ్గము శాత్రవ మస్తకములపై నృత్యము చేయుచుండ చూచు భాగ్యము నాకు లేదు. హా? మాధవా? యెట్టియిక్కట్టు వాటిల్ల జేసితివి?

భాస్క—ఔను? మాధవునివిషయములో నాకును జాల విచారముగ నున్నది. విధివిధానమునకు మనమేమి చేయగలము. ఊరక విచారించిన లాభమేమి! మీకు మాధవుడును, గామపాలుడును సమానులేకదా? కామపాలున కిప్పుడు స్వాస్థ్యము చేకూరినది. మీరాతని వెంటదీసికొని పోవుట కేమియభ్యంతర మున్నది.

శ్రీధ—అట్లనే యగునుగాని యీదూర దేశయాత్రకు నాతనిఁ దీసికొనిపోవుట నాకిష్టములేదు.

భాస్క—మీకుఁదెలియని సంగతేదియును లేదు. చెప్పవలసిన దేదియో చెప్పితిని. పిమ్మట మీయిష్టము.

శ్రీధరుడు, మారుపలుకలేదు. తనతండ్రి తురుష్కులతో నీదినమే యుద్ధమునకు వెడలునని వినినతోడనే మధుమతిగుండెలు ఝల్లుమనియెను. ఒడలు కంపమొందెను. కనులనుండి బాష్పములు రాలజొచ్చెను. దీనవదనముతో తండ్రి నీక్షించి యేదియో యడుగ దలచుకొను దానివలె లేచినిలుచుండెను. శ్రీధరు డామెభావమును గనిపెట్టి యిట్లనియె.

శ్రీధ—అమ్మా! నీవెందుల కట్లువిచారించెదవు. నీవట్లు విచారించుచున్న నాకు ధైర్యమెట్లబ్బును. వారమురోజులలో

శతృవుల బారద్రోలి యింటికివచ్చెదను. ఇదివఱకే రామదే వుడు మహమ్మదీయ సేనల జీకాకుపఱచియుండును. నేను గూడఁబోయి సహాయపడితినేని తుఱకలను ఢిల్లీవఱకును పాఱద్రోలగలము. నిర్విచారముగనుండుము తల్లీ! యనెను. శ్రీధరుడిట్లు బలుకుచుండగనే, రుక్మిణీశ్యామలు, భోజనము లఁజేసి బంగారుపళ్లెరములో తాంబూలపట్టికలనుంచుకొని వికసిత ముఖారవిందములతో నోష్ఠపుటంబులనుండి మంద హాసచంద్రికలు తొంగి చూచుచుండ మందగమనంబులతో వసారాలోని కరుదెంచి శ్రీధరునిచెంత గూర్చుండిరి. పిమ్మట రుక్మిణి యూతాంబూలపట్టికలను దీసి, యొకటి శ్రీధరునకును వేరొకటి తనయన్నకును యిచ్చెను. శ్రీధరుఁడు దేవగిరికి బోవునని వీరలకు తెలియదు. శ్రీధరునకు తాంబూలసేవన మునందిచ్చలేదు. ఉత్సాహముతో నున్న రుక్మిణి మనస్సు చిన్నవోవునని తాంబూలమును సేవించెను. మధుమతి వివా హమునుగూర్చి యిదివఱకే తనయన్న భర్తతో మాటలాడి యుండునని తలంచి, యేమిజరిగెనో విన కుతూహలముతో నుండెను. శ్రీధరసింగమనాయకులుగాని మధుమతిగానియేమి యును మాటాడుటలేదు. అందరును చిత్రప్రతిమలవలెఁ గదలకట్లే కూర్చొనియుండిరి. మధుమతిముఖము చాల వాడి యుండెను. ఇదంతయుఁజూడ రుక్మిణి కగమ్యగోచరముగా నుండెను. దేవగిరిప్రయాణమును శ్రీధరుడు రుక్మిణితో జెప్పి

యేయుండునని తలంచి భాస్కరు డూరుకొనియెను. అన్న కామపాలునివివాహమునుగూర్చియడుగగా శ్రీకరుఁడు దానికి బ్రతికూలముగ బలికియుండునని నిశ్చయించి సంగతినిఁ దెలియఁగోరి రుక్మిణి యిట్లనియె.

రుక్మి—అన్నయ్యా! మీభావగారితో మాటలాడితివా?

భాస్క—నేను చెప్పవలసినంతవట్టు చెప్పితిని. కామపాలుడు దేవగిరికి తనతోగూడ వచ్చుటకు భావగా రంగీకరించలేదు.—ఆమాటలు రుక్మిణి కర్థముకాలేదు. ఆమె విస్మితురాలయ్యెను. అసంతృప్తి మనఃబుతో మరల రుక్మిణి యిట్లనియె.

రుక్మి—అన్నా! మీమాటలు నాకర్థముకాలేదు. దేవగిరికి బోవుటేమి? అంగీకరింపకుండుటేమి?

భా—ఆశ్చర్యముతో, అమ్మా! రుక్మిణీ! నీకాసంగతియేమియుఁ దెలియలేదా? ఢిల్లీనుండి, యల్లాయుద్దీన్ సేనలతోవచ్చి దేవగిరిని ముట్టడించెనట. దానిని విడిపించుటకై చక్రవర్తి యాజ్ఞను కేపటిదినంబున భావగారు సేనలతో దేవగిరికిఁ బోనై యున్నారు. కామపాలునిఁగూడ సహాయముగఁ దీసికొనుడని చెప్పితిని. అందులకు భావగా రంగీకరింపలేదు. ఈమాటలను విన్నతోడనే రుక్మిణి వదనము వివర్ణమయ్యెను. ఆమె యొడలు ఝల్లుమనియెను. కామపాలుడు తన

వివాహమునుగూర్చి మాటలాడుకొనుచుందురనియు, నప్పుడు తానటనుండుట భావ్యముకాదనియు దలంచి లోపలనే కూర్చుండెను. కాని, చాలకాలమగుటచే నీపాటికి వారి ప్రసంగము ముగియునని తలంచి యిక్కడకు వచ్చికూర్చుండెను. అందరి మొగములును చిన్నవోయి యుండెను. కాని కామపాలుని మొగము చింకిచేటంత యయ్యెను. మధుమతియొక్క సంపూర్ణదర్శనమే యిందుకు కారణము. తలగోక్కికొను నెపమునను ముక్కు నలుపుకొను నెపమునను, జెవినదుముకొను నెపమునను చేతితో ముఖముపై విసరుకొను నెపమునను మధుమతిని జూచుటయే యాతనిపని. ఈసందడిలో పెండ్లిమాటలను దెలిసికొనవలె ననుమాటయే లేకపోయెను. ఇంతవఱకు నొకమూల గోడకు జేరబడి కూర్చొనియున్న విశ్వాసరాయుడు మెల్లగ కర్రయూతగొని లేచి యెందులకీ జాగరణము. వీరులకు రణముకంటె యుత్సవమేమున్నది? మాధవుడేయున్న నీపాటికి యొరనుండి కత్తిదీసి మానవును బురికొల్పకుండునా? మహావీరుడైన శ్రీధరున కేమిగొఱత. అసహాయశూరున కొరులసాయమెందులకు. ఇదివరకెన్నియో యుద్ధముల గెలుపొందిన శ్రీధరున కిదియొక లెక్కయా? తఱక లోనరించుచున్న దేశమారణహోమమును భంగపఱచి బ్రహ్మానందము చక్రవర్తిని మేలుకొలిపినాడు. ఎందులకీ దిగులు. శ్రీధరుడు జయశ్రీని వరించి త్వరలో దిరిగి రాగలడనెను.

ఈవాక్యముతో మధుమతి విచారమిగిరిపోయెను. మాధవుని వీరత్వ మామె నావేశించెను. మాధవుడు తనకుఁ జిన్నతనమునుండి వయసువచ్చువరకును నేర్పినరణవిద్యమనో వీధిని గెంతులువేయుచుండెను. ఆమె మృదుమధుర గంభీర స్వరముతో నిట్లనియె. తాతా! ఆడుదానవని బాబా! తలంచ కున్నచో బాబాతోకూడ నేగి వీరరణ మొనరింపవలెనని యున్నదనెను. శ్రీధరుడు పట్టరాని సంతోషముతో దటాలున లేచి బిడ్డను కౌగలించుకొని, అమ్మా! నాకుఁ బుత్రులులేని కొఱంతదీర్చినావు. తల్లీ? నీవు వీరపత్నివగుదువుగాక? పురుషుల వీరత్వ మంతరించియున్నచో నిన్ను గొంపోయియే యుందుననిన మధుమతి బాబా! క్షమింపుము. నాకిక చింత లేదు. మ్లేచ్ఛుల బారదోలి రమ్మనెను. కానుపాలుడు చకితుడయ్యెను. భాస్కరుడు తెల్లవోయెను. రుక్మిణీ శ్యామలలు విస్మితులైరి.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

---

ఆమరునాడు సాయంతనసమయమున శ్రీధరుడుప్రచండసైన్యముతో బయలుదేరి దేవగిరికిఁ బోవుచు దోవలో బ్రహ్మానందుని దర్శించి చక్రవర్తి యాజ్ఞను దేవగిరి కేగుచున్నానని చెప్పెను. బ్రహ్మానందుడు జయమగుఁగాక యని

యాశీర్వదించి తుఱకల పీచమడంచిరమ్మని చెప్పిపంపివేసెను. వారముదినములుగడచెను. బ్రిహ్మానందు డొకనాటి సాయంతనమున ధ్యానము ముగిసినపిదప గమండలోదకమున గనులుదుడుచుకొని తనమనంబున నిట్లు తలంపనారంభించెను. ఆధ్యాత్మిక చింతలచే సుఖంబుగఁ గాలముగడుపు నాకీశ్వరుడు చక్రివర్తితో సంబంధమును గల్పించి రాచకీయవిషయముల దగులుకొనజేసెను. నన్నీ పనికి బురికొల్పియుండుట జూడ నాదేవదేవుడీ దేశరక్షణమునందే మరియుండనటులదోచుచున్నది. ఆంధ్రిదేశాభివృద్ధికి నీశ్వరు డానందించుచున్నట్లు దలంచెద. ఆతనిమహిమ లతివిచిత్రిములు ఆతనియాజ్ఞ యవిలంఘ్యముకదా? నేనా జగదీశ్వరునిచే నీకార్యముకొఱకు బురికొల్పబడితిని. ఈశ్వరప్రీతికై రాచకార్యంబులం బ్రివేశించితిని. నాపై యీదేవదేవుడు కృపజూచుగాక! ప్రితాపరుద్రు డీశ్వరభక్తిపరాయణుడు. ఈతనిపాలనమున నాంధ్రిసామ్రాజ్య మభివృద్ధిగాంచెను. ఆంధ్రిభాషను మాటలాడు జనులనెల్ల నేకఛత్రిము క్రిందికిఁ దీసికొనివచ్చినాడు. ఆంధ్రిదేశ మిప్పుడు నవలక్ష ధనుర్ధరులతోఁ దులదూగుచున్నది. ఆంధ్రిభాభాయోషామతల్లి యభినూపమనోహరమై యభినవాలంకార శోభితమై నవ్వుమొగంబుతో గలకలలాడుచు నానందరూపిణియై చూపట్టుచున్నది. అయినను గారణము లేనిదే ఈశ్వరుడు నన్నీపనికిఁబురికొల్పడు. ప్రితాపరుద్రిని

యందొక గొప్పలోపమున్నది. ఉత్తరహిందూస్థానమున జరుగుచున్న చర్యలు బరికింప నవకాశము ననువహించియున్నాఁడు. సాహాద్దు దుర్గములు బలపఱచ కుపేక్షించినాఁడు. ఒక్క రాజధానీ దుర్గమే బలపఱచియున్న నేమి ప్రయోజనము. ప్రఖ్యాతిగాంచిన వీరసేనానులుండినను, దుర్గబలములేనిచో నేమి లాభము. రామచంద్రదేవుని గతియే యిట్లున్నది. కాని మున్ను, దేవగిరిరక్షణార్థమై సేన లంపఁబడియెనుగదా! నేఁడు చక్రవర్తి వచ్చెదనని వర్తమానమంపినాఁడు. అదిగో! యుత్తమాశ్వంబుల నెక్కి యిద్దరు వీరపురుషు లిటువచ్చుచున్నట్లున్నది. అని బ్రహ్మానందశివయోగి మనంబున దలపోయుచు లతామంటపమున నుపవిష్టుండయ్యెను. అంత నాపురుషు లశ్వంబులనుండి దిగి యోగిదండమునకు నమస్కరించి యోగి సంజ్ఞచేయ నటఁగూర్చుండియుండిరి. బ్రహ్మానందుఁ డొకనిమిష మూరకొని యిట్లనియె.

బ్రహ్మా—అయ్యా! మీ రెవరు? మావలన మీరు కోరు కార్యమెద్ది?

పురుషు—మహాత్మా! నాపేరు గజసాహిణి గుండానాయుఁడు. ఈతని పేరు గజసాహిణి మాచానాయుఁడు. మేము చక్రవర్తి సేనానులము. త్రిపురాంతకాంబయదేవులను జయించి వచ్చితిమి. దేశమున శాంతి నెలకొనియెను. మాజయమును తమకుఁ దెలిపి తమ యాశీర్వాదము నందఁగోరి యిటకు వచ్చితిమి.

బ్రహ్మ—ఓహో! అట్లనా! మిమ్ములజూచినమాత్రమున నే మహావీరులవలె గానంబడుచున్నారు. మీరు చక్రవర్తి నయమునకుఁ బాత్రులగుదురుగాక! మీచేతిలో నాపత్రమేమి?

సేనానులు—మొన్న మేముగాంచిన జయమునకుఁ జక్రవర్తి బిరుదు పట్టంబులొసంగి యున్నారు. అవియేమి యని శివయోగి కందిచ్చెను. శివయోగి దానినిట్లు చదివెను

బ్రహ్మ—స్వామిద్రోహగండ, స్వామివాచకకరగండ శశ్యంకవీర, కలియుగవీరభద్ర, యనియూ, ఈబిరుదములకు మీరు తప్పక తగియున్నారు. ఈశ్వరుడు మీకు సర్వదా జయమొసంగుగాక? యనిదీవించెను.

అంత నా వీరపురుషు లిద్దరును యోగీంద్రుని యాశీర్వాదముల గ్రహించి నమస్కరించి సెలవుగైకొని చనిరి. పిమ్మట శివయోగి కనులుమూసికొని ధ్యానాసక్తుఁడై యుండెను. పెదవుల జిరునగవు, భ్రూలలాట సంకోచము నాతని ధ్యానమునకు లక్షణములు. మరియు నిశ్చలత్వ మొకటి యెన్నదగు లక్షణము. కొంతవడికి ధ్యానమును విడిచి కనుల దెఱచెను. ఎదుట ప్రతాపరుద్రుఁ డుపవిష్టుఁడై యుండెను. యోగి మందహాసముతో సార్వభౌమునకు క్షేమమా! యని యెను.

ప్రతా—స్వామీ! తమయనుమతిని ద్రిపురాంతకాంబయ దేవులను జయించి దేశమున శాంతిని నెలకొల్పిన గుండా

నాయినింగారికిని మాచానాయనంగారికిని చిబిరుదుపట్టంబుల నొసంగితి.

బ్రహ్మ—ఔను? వారు మద్దర్శనంబునకు వచ్చిరి. పట్టంబులజూచితిని.

ప్రతా—దేవగిరికిగూడ సేనలంపబడియెను.

బ్రహ్మ—రాజా! నీదేశసేవ యవ్యాజమైనది. నీభక్తికి పరమేశ్వరుడు సంతసించెను. కాని నీవాత్మరక్షణయందే మరియుంటివి. ఆత్మరక్షణము పరమేశ్వరునకు బ్రీతిదాయకము. తద్రక్షణము సేయనేరనివా డాత్మద్రోహియగు. పరమాత్మ నారాధించు వాని మనస్సు నిర్మలముగ నుండవలెను. వ్యసనంబుల బోజేసి యింద్రియంబుల హద్దులలో నుంచవలెను. దీనికిమూలము మనస్సు. మనస్సు చెడునేని యింద్రియములు హద్దుమీరి పరమాత్మనిలుచుటకుస్థానము లేకుండఁ జేయును. ఇటులనే స్వాత్మరక్షణముకూడ లక్ష్యితమై యున్నది. ఆత్మసంరక్షణ గోరువాఁడాయువును వృద్ధినొందించుకొనవలయును. ప్రభువున కాయువు సేన. దానిని వృద్ధినొందించుకొంటివేని నీకుదీర్ఘాయువు కలుగును. సేనారక్షణమునకు దృఢమైన కోటలావశ్యకము. దుర్గములు తగిన కట్టుదిట్టములలో లేకున్న నాత్మకుదగిన నెలవులేక యెగిరిపోవును. పరమాత్మ శూన్యంబగు శరీరమెట్లు భస్మముగావింపబడునో, సేనాదుర్గశూన్యంబగు దేశమట్టే భస్మంబగును. కామక్రో

ఖాదిశత్రువుల కవకాశమిచ్చిన నాత్మను హరించునట్లు మ్లేచ్ఛాదిశత్రువుల కవకాశమిచ్చితివేని దేశము నాక్రమింతురు. రామచంద్రదేవునకు రానున్న గురవస్థ నీవెరిగియే యున్నావు. ఆతని దేశము మేచ్ఛులచే నపవిత్రము గావింపబడి నశించుటకు సిద్ధముగానువ్నది. అతనిరాజ్యము నీకడ్డముగ నుండుటచే నుత్తరహిందూస్థానమున జరుగుచున్న చర్యలను బరికింపక మౌనమునువహించియున్నావు. మహమ్మదీయుల దృష్టి చాల కౄరమైనది. వారు క్రమక్రమంబుగ నీదేశమును సమీపించుచున్నారు. సరిహద్దుదుర్గములు పాడుపడి యున్నవి. వానిని బాగుచేయుటకు చాలాకాలముపట్టును. నీవీశ్వరాంశసంభూతుడవు. ఈశ్వర ప్రేరితుడనై నేను నీదరి నుంటిని.

ప్రతా—స్వామీ తమ యుపదేశముచే నేను నా యంతరాత్మ మేల్కొల్పబడినది. మీకటాక్షము నాపై బ్రసరించుటచే బృథివీశులలో ధన్యుడనైతిని. సదాశివుడే తమరూపమునవచ్చి నన్నుద్ధరించు చున్నాడు——అన బ్రహ్మానందుడు మందహాసమొనరించెను. దానియర్థమును చక్రవర్తిగ్రహించి యిట్లనియె. స్వామీ! నేను పొగడుట లేదు. నిష్కల్మషముగ యథార్థమును వచించితిని.

బ్రహ్మ—నీహృదయము నిష్కల్మషమయిన దని నే నెఱుంగుదును. నీవింతగా నాకడ జెప్పవలయునా? రాజా!

అటుచూడుము. ఆవృద్ధుడు మద్దర్శన మభిలషించుచున్నట్లు న్నాడు. సేవకు లాతని నిర్బంధపరుచు చుండిరి. మద్దర్శనమునకుఁ గోరివచ్చిన వారి కిట్టినిర్బంధము లేకుండఁ జేయుదువుగాక? అని పలుక చక్రవర్తి యోగిని నిర్బంధపఱుపవలదని సేవకుల కాజ్ఞయొసఁగెను. వారా వృద్ధుని విడిచిరి. వాఁడు నులోనఁ గొణుగుకొనుచు, నాచేతులఁ బట్టి నిర్బంధించుటకు వారల కెక్కడి యధికారముకలదో, సార్వభౌముఁడులేకున్న వారిట్టి దుండగములను చేయుచుందురు. నాచేతులు నొప్పియెత్తుచున్నవి. వాండ్రి ముష్కరమే కాని నాపెద్దతనమును జూతురా? నేను నడువలేక నడువలేక యలసివచ్చితిని. ఇంతకును నాపుణ్యము బాగున్నది. ఎవరో మహాత్ములున్నా విడువుడని చెప్పినారు. అని నుడువుచు చేతిని ముఖముపై నడ్డముగ బెట్టుకొని దృష్టి నిసారించి నెమ్మదిగ నడచివచ్చి యోగికి నమస్కరించి చతికిలబడియెను. ఆవృద్ధుని మాటలువిని చక్రవర్తి నవ్వెను. అంత నావృద్ధుడు స్వామీ! ఆనవ్వేడువారెవరు? నేను పెద్దవాడను, ఆజ్ఞలేనిదే కూర్చుండినందులకు క్షమింపుడు.

బ్రహ్మ—ఆతఁడు మాకాప్తవర్గములోనివాఁడు. నీవడుగదలచుకొనిన దేదియో యడుగవచ్చును.

వృద్ధు—స్వామీ! నాపుణ్యమువలన తమ దర్శనము దొరకినది. ధన్యుడనైతిని, నేను సార్వభౌముని సేనానియగు శ్రీధర నాయినంగారి సేవకుఁడను. నా పేరు విశ్వాసరాయుడు చాలకాలమునుండియు నచ్చటనే కనిపెట్టుకొని యుంటిని.

బ్రహ్మ—సరియే. నీచరిత్రము నంతను చెప్పనక్కఱ లేదు. నీవడిగెడి దేదియో యడుగుము.

విశ్వా—స్వామీ! క్షమింపుము. పెద్దవాఁడను, నామాటలుమీకు విసువుగానుండును, శ్రీధరుఁడు మాధవుడను నొక మేనల్లుడు కలఁడు. ఆతఁడు చక్రవర్తిచే నవమానింపఁబడి యెటకోపోయెను. ఒకసంవత్సరమునుండియు, నాతనిజాడగాన రాలేదు. కావున నతనినిజస్థితిని తమ ముఖంబున వినగోరి వచ్చితిని, స్వామీ! మధుమతి.

బ్రహ్మ—సరియే చాలును. నీప్రశ్న యర్థమైనది, అని కనులు మూసికొని యోచింపదొడఁగెను. చక్రవర్తి వెలవెల పోయెను. యోగి ముఖమునుండి యుత్తరమేమి వచ్చునో యని యాత్రముతో నాతను జూచుచుండెను. ఇంతలో బ్రహ్మనందుడు కనులుదెఱచి యిట్లనియె. ఆతఁడు జీవించియే యున్నాఁడు-ప్రపంచ సంబంధమును వదలుకొని యున్నాడు. పరమేశ్వర చింతలచే గాలము గడుపుచున్నాడు. ఈశ్వరుని పరిజ్ఞానును సర్వత్ర వ్యాపింపఁ గోరుచున్నాడు. ఆతడొక చోట నుండెనని చెప్పవీలులేదు. దేశమంతయును గుమ్మరు చున్నాడు. రూపమునమారియున్నాఁడు.ఒకమహాకార్యమును దలపెట్టి యిటులదిరుగుచున్నాడు. మరల నిజరూపమును బూను నని తోచదు. కాని నీప్రశ్నకొక రహస్యోత్తర మీయవలసి యున్నది.

ప్రతాపరుద్రుడు లేవబోయెను. యోగి దానినడ్డుపరచి రాజా! నీవు లేవనక్కఱలేదు, ఈతడు రహస్యముగ నన్నొక ప్రశ్న యడుగవలెనని యున్నట్లు గ్రహించితిని. వాని మనోభీష్టమును దీర్చుట మావిధి. అని పలికి విశ్వాసరాయు నీవలకు బిలచెను—విశ్వాసరాయుడు, గడగడ వడంకుచుండెను. రాజాయని యోగి సంబోధించుటచే వానిని సార్వభౌమునిగా నెఱింగి తన యపచారమును మన్నింపుమని రాజు కాళ్ళపైబడెను. ప్రతాపరుద్రుడు, నీవుచేయు యపచారమేమియు, లేదు. నీవెందులకిట్లు భయమందెదవు, నీ రహస్యమేదియో స్వామికి విన్నవించుకొను మనియెను. విశ్వాసరాయుడు యోగి కడకేగెను. యోగి యాతనిప్రశ్న కుత్తరమిచ్చి పంపివేసెను. విశ్వాసరాయుడు సంతృప్త మనంబుతో నింటికిఁబోయెను. చక్రవర్తి యోగికడ సెలవుగైకొని కోటకు జనియెను.

—— ఇరువదిరెండవ ప్రకరణము ——

అల్లాయుద్దీ నుత్సాహవాక్యములచే సేనల కుల్లాసమును బుట్టించుచు నున్న తాశ్వంబుపైనుండి హస్తమును పైకెత్తి ముందున కూచుచుండెను. ఆశ్వికులు, గుఱ్ఱముల ముందునకు బేఱెను వారించుచుండిరి. ఆకాశంబంతయు నశ్వఖురోద్ధూత రజఃపటంబులచే నాచ్ఛాదితమై సూర్యరశ్మినష్ట

పఱచుచుండెను. అగ్గిపు డెక్కలవలన గలిగినటకటకధ్వనులు దేవగిరివాసుల గుండెలవియజేయుచుండెను. ఆసైన్య ప్రవాహమున కడ్డులేకుండుటచే కనుమూయునంత కాలములో బహుభూమిందాటి వచ్చుచుండెను. నగరవాసులు, నగలను నాణెములను మూటగట్టుకొని రక్షణార్థ కోటకుఁ బరుగిడుచుండిరి. నగరమంతయు నతికోలాహలముగ నుండెను. జనులుతల్లడిల్లుచుండిరి. ఇట్లుండ భీషణుడు రాజసమక్షమున నిలువంబడి సంభ్రమముతో నిట్లనియె— రాజా చూచెదవేమి ! ఆలోచనకిది సమయముకాదు. త్వరపడుము త్వరపడుము.

రామ—ఏమిసేయుదును. సేనలన్నియు నిచ్చటలేవు, అల్పసంఖ్యగల సేనతో నెట్లెదుర్కొనగలము, కానిందు యున్న సేనయైన సిద్ధముగ నున్నదా?

భీష—జయదేవుని సేనాగారమునకుఁ బంపితిని. రణభేరికూడ మోగింపబడియెను. సేనానులు సేనల సిద్ధముచేసి యే యుందురు. తడవు సేయుంజనదు, అదిగో! జయదేవు డిటకుఁ బరుగు పరుగున వచ్చుచున్నాడు— అని పల్కుచుండగనే జయదేవుడు రాజు యెదుట ప్రత్యక్షుడయ్యెను.

రామ—జయదేవా! సేనలు సిద్ధముగ నున్నవా?

జయ—అంతయు సిద్ధముగనే యున్నది.

రామ—ఇప్పుడున్న సేనల సంఖ్యయెంత?

జయ—నాల్గువేలు

రామ—విచారముతో, అయ్యో మోసపోతిని. సైన్య మంతయు బైటనేయున్నది. మహమ్మదీయు లిట్లదాటున విరోధబడుదురని తలంపనైతిని. ఇంతలో భటుడరుదెంచిగుఱ్ఱ మువచ్చి సిద్ధముగనున్నదని చెప్పెను. రామదేవుడు దృఢక వచంబును మహాఖడ్గమును ధరించి అశ్వంబు నధిరోహించి భీమణజయదేవులను కోటలో జాగ్రతగ నుండుడని చెప్పి సైన్యస్థానంబులకుఁ బోయి హెచ్చరించుచు నగరమునుదాటి యల్లాయుద్దీ నెదుర్కొనుటకై వడివడి పోవుచుండెను. అల్లా యుద్దీను నగరంబునకు నాలుగు క్రోశముల దూరములో సైన్యంబుల నాపెను. ఆతడశ్వంబునుండి దిగలేదు. ఏదియో యోచించుచుండెను. అశ్వఖుర ధ్వానంబులు నిలిచిపోయెను. రామదేవునిసైన్యములు దేవగిరిని దాటి యొక్కక్రోశముదూరం బున కేగెను. అచట తన సేనలనాపి తనమనంబున నిట్లుతలంప నారంభించెను. నేనిట్లు మూర్ఖముగపోయి యెదుర్కొనుట వలన లాభములేదు. ఈస్వల్ప సైన్యముతో విశేషకాలము పోరాడిన మిక్కిలి ప్రమాదము సంభవించును. శత్రుసైన్య మెంతయుండునో తెలియదు. ఎదిరించి పోరాడుటయొకాని జయముకాంచుట కష్టము. ఇదంతయు నిరావరణప్రదేశము. ఇటనిలిచి పెద్దసైన్యముతో జిన్నసైన్యమును ముందునుంచు కొని పోరుసల్పుటనుచితము. ఆలోచించగా తిరిగి కోటప్రవే శించుటయే శ్రేయోదాయకము. దుర్గమంతయు భోజనపదా

ర్థములచే నింపబడినదికదా! దుర్గములోనుండి శత్రువులతో బోరాడుట సుకరము. కావున వెనుకకు మరలి దుర్గమును బ్రవేశించెదనని, తలంచి సేనలను వెనుకకుఁద్రిప్పి దుర్గమున బ్రవేశించెను. వెంటనే సేనలు తిరిగివచ్చుచుండుట గాంచి నగరవాసులును, కోటలోని వారలును మిక్కిలి భీతిల్లిరి. భీమునకు భీతిపుట్టెను. జయదేవునకు గంపముదయించెను. రామచంద్రదేవుడు తానుతిరిగి దుర్గమును బ్రవేశించుటకుగల కారణము నెల్లఱకును శ్రుతపఱచెను. ఎల్లరును నిరుత్సాహులైరి. నగరవాసు లెక్కడికైన పారిపోవుటకుఁగూడ నవకాశము లేదు. సాధ్యమైనంతవఱ్ఱు తమయాస్తుల శత్రువులకుజిక్కకుండ దాచుకొన యత్నించుచుండిరి. ఇట్లుండ నగరమున కావల రెండుక్రోశముల దూరములో నొకపెద్ద కలకలము బయలువెడలెను. ధూళిచే దిశలు పరిచ్ఛన్నంబులగుచుండెను అశ్వఖురధ్వానంబులు మఱలలేచెను. వానినివిని నగరవాసుల గుండెలు బ్రద్దలగుచున్నట్లు భయభ్రాంత చిత్తులైరి. పిల్లలేడ్చుచు తల్లుల గౌగలించుకొనుచుండిరి. పిల్లలతోదల్లులు భర్తలవెనుకకు నొదుగుచుండిరి. శౌర్యవంతు లాఱుబిడ్డలకు భయములేదని చెప్పుచు నొఱలనుండి కత్తులనుదీసి సవరించుకొనుచుండిరి. భీతచిత్తు లాలుబిడ్డలతో గలసి దుఃఖించుచుండిరి. మహమ్మదీయ సైన్యము క్రమక్రమముగ నగరమును సమీపించుచుండెను. చూచుచుండగనే కొన్ని నిమిషములకు

నగరమంతయును మహమ్మదీయులచే వ్యాప్త మయ్యెను. అహా హా! యెంతలో నెంతగతివచ్చినది. ఎచ్చటచూచినను రోదనధ్వనులే. ఏదిక్కుచూచిన నాహాకారములే. తలుపులు బ్రద్దలగుచుండెను. ఎంతభయంకరమైన దోపిడి! ఎవరడ్డగలరు. అడ్డిరిపో ప్రాణములు నిలుచుటెట్లు? ఆభీతి, యాకంప, మారోదన, మాకన్నీటిధార లాహా! యెంతకష్టమెంతకష్టము. నాప్రత్యక్షరాక్షసుల యెదుట, నా క్రూరపిశాచముల మ్రోల నొకటికి తురకలపజ్జ, నాకిరాతులచెంత నెవరునిలువగలరు. ఎవరు మాటలాడగలరు. ఇట్లుండ మహమ్మదీయ దుష్టులతో నున్న నొకయువకుడు. నిశితకరవాలమును చేబూని స్త్రీలనవమానపరుప యత్నించు తురకసైనికులను తెగనరుకుచు మానరక్షణ మొనరించుచుండెను. ఈతడొక నిముషమైనను కాలమును వృధపుచ్చలేదు. వీలైనంత వఱకీయింటి నుండాయింటికి మెల్లగబోవుచు మహమ్మదీయభటులను హతమార్చుచుండెను. ఈతడు తురకవేషమునునుండుటచే తురకలచే ననుమానింపబడనందున నింటింటికి బోవుచు తన పనిని నెఱవేర్చుచుండెను. ఈత డరుణప్రభుఁడు. ప్రాణమును లక్ష్యముసేయక నిట్టిసాహసమునకు దిగెను. క్రమక్రమముగ మహమ్మదీయులగుంపు లధికమగుటచే నిక లాభములేదని మెల్లగతప్పించుకొని యావలబడెను. రామదేవుని సైన్యములు దోడుపడునని యాసించెను కాని సేనయంతయు గోటలో

ప్రవేశించుటచే లాభములేకపోయెను. నగరమంతయును తురుష్కులకై వశమయ్యెను. నగరమంతయు గొల్లకొట్టబడియెను. దోపిడి ముగిసిన వెనుక సేనలన్నియుఁ గోటను ముట్టడించెను. అల్లాయుద్దీన్ ఒక్కిలి యుక్తిపరుడు. సమయోచితప్రజ్ఞ చాల కలదు. సైన్యమింకను వెనుక నుండి వచ్చుచున్నదనియు, వచ్చిన సైన్యము దానిలో నొకభాగమనియు వసంతినికలుగఁ జేసెను. రామచంద్రదేవు డది నిజమని నమ్మెను. మహమ్మదీయులు ముట్టడివి తీవ్రముగ సాగించుచుండిరి. రామదేవుడు బహువిధముల నాలోచించెను. ఉపాయమేమియుఁ దోచనందున మూర్ఖముగఁ బోరుటవలన లాభములేదని సంధిజేసికొనుటకు నిశ్చయించుకొనెను. లోనమునస్సు పీకుచున్నను మెట్టులో సమాధానపడి సంధిప్రయత్నముఁ జేసెను. అల్లాయుద్దీన్ తన సైన్యముయొక్క బలహీనతను బాగుగా నెఱిగినవాడే కావున విశేషముగా బంగారమును నొసంగిన ముట్టడిని విడిచిపోదునని తెలియఁజేసెను. ఈసంకటమునుండి తప్పించికొననేరక రామదేవుడు యోచనలకు దిగులొందెనియెను. ఇట్లుండ రామదేవుని కుమారుడగు శంకరదేవుడు సైన్యంబుల గూర్చుకొని యుద్రేకముతో దండికి సహాయము జేయుటకై వచ్చుచుండెను. అల్లాయుద్దీనది యెఱిఁగి వేయిసైన్యమును మాత్రమే దుర్గమునకుఁ గావలియుంచి తక్కిన సైన్యముతో శంకరదేవు నెదుర్కొనియెను. ఉభయ సైన్యములకును ఘోరయుద్ధము ఘాస

గెను. ఉభయులును వీరావేశంబుతోఁ బోరాడిరి. హిందువులు ప్రాణములపై నాసవదలి యశమో స్వర్గమో గడింపవలెనను పట్టుతోనుండిరి. హిందువులు సంఖ్యయం దధికులగుటచే మహమ్మదీయులు యుద్ధముని నిలువలేక వెనుకకుమఱల మొదలిడిరి. ఇంతలోగోటకుఁ గావలియున్న దురుష్కసేన వచ్చి కలుసుకొనియెను. దానింగాంచి శంకరదేవుని సైనికులు ఢిల్లీనుండి క్రొత్తసైన్యము వచ్చినదని తలంచి భీతిల్లి వెనుకకు బరుగిడిరి. అంత రామదేవుడు మఱల సంధిచేసికొనుటకు యత్నించెను. అల్లాయుద్దీ నమితధనమును కోరెను. ఇంతలో బ్రతాపరుద్రుడు పంపిన సైన్యము సముద్రునిభంగి గర్జించుచు దేవగిరికి వచ్చుచుండెను. శ్రీధరుడు సేనలకుత్సాహము గొలుపుచుండెను. సేన యతిరయంబున వచ్చుచుండెను. ఇట్లుప్రబలమైన, యాంధ్రసైన్యము తనకు సహాయార్థమై వచ్చుచున్నట్లు రామచంద్రదేవునకుఁ దెలియదు. అరుణప్రభున కావార్త తెలిసికోటలోనికివర్తమానమంపవలెనని విశ్వప్రయత్నములు చేసెనుగాని ముట్టడితీవ్రముగ నుండుటచే వీలులేకపోయెను. క్రమక్రమముగ రామదేవుడు నిరుత్సాహుడుకాజొచ్చెను. ఇదివరకు గోటలోనుండిన బస్తాలన్నియు ధాన్యపుబస్తాలుకాక యుప్పుబస్తాలని తెలియవచ్చుటచే నధైర్యముగలవాడయ్యెను. సేనలకు భోజనపదార్థములు చాలుటలేదు. ఈ కారణములచే సంధిచేసికొనుటయే ముఖ్యమని తలంచెను.

అల్లాయుద్దీన్ దాని కొడంబడియెను. అప్పు డారువందల మణు గులు మౌక్తికంబులును, నాలుగువేలు పట్టుపీతాంబరములును వేయి వెండినాణెములును, రెండమూల్యాభరణంబులును, బహుమానము నిచ్చుటయేకాక కొంత దేశమునుగూడ నొసగి ప్రతివత్సరమును కొంత కప్పమునుగూడ చెల్లించునటుల యొప్పుకొని సంధిగావించుకొనియెను. అల్లాయుద్దీ నాధనమం తయును లొట్టియలపైన వేసికొని ముట్టడివిడిచి సంతసించుచు ఢిల్లీకిబోయెను. ఝామురాత్రియైనది. జయదేవుడు మహమ్మ దీయ దుస్తులనుధరించి భీమణునితో బావా! నేనల్లాయుద్దీనుని కలిసికొని మాటలాడి వచ్చెదననెను.

భీమ.—ఓరుగల్లు విషయమును జ్ఞాపకము చేయుటకా?

జయ.—ఔను! నేను త్వరగా పోవలయును.

భీమ.—అరుణప్రభునకుం దెలిసిన ప్రమాదము సంభ వించును సుమా! జాగ్రత.

జయ.—భయములేదు. నన్నుగుర్తించువాడెవడనిపలికి దారి బట్టెను. అరుణప్రభునకు నిద్రపట్టుటలేదు. ఈదురంతపరి ణామమున కాతనిహృదయము పరితపించుచుండెను. కనుల నుండి బొటబొట నీరు గారుచుండెను. మధ్యమధ్యను క్రోధా వేశముచే పండ్లు పటపట కొఱుకుచుండెను. పిచ్చివానివలె నిటునటు వీధిలోనికి వీధిలోనుం డింటిలోనికిని రెండుసారులు తిరిగి భీమణుని యింటికివచ్చి తలుపుసందునుండి తొంగిచూ

చెను. భీషణ జయదేవుల సంభాషణ వినిపించెను. సంభాషణ ముగిసి జయదేవుఁడు బయటికివచ్చినప్పుడు, అరుణ ప్రభుఁడు, చప్పుడుకాకుండ వెనుకకు మఱలి యింటికిఁబోయి కరవాలమును జేతఁబట్టుకొని జయదేవుని వెంబడించెను. జయదేవుఁడు నగరమును దాటి మైదానములోని కేఁగుసరి కరుణ ప్రభుఁ డడ్డమువచ్చి యోరీ! ద్రోహి, ఆగుమాగుము. నిన్ని కరవాలమున వసుంధరాదేవికి బలియిచ్చి యీ మదుఃఖమును గొంచె ముపశమింపఁ జేసెదను.

జయ—అన్యస్వరూపముతో నోయీ! నీవెవడవు. నేను మా సైన్యములోనికిఁ బోవుచున్నాను. నన్నేల యడ్డెదవు.

అరు—జయదేవా! అరుణప్రభుని మోసగించ నీతరముకాదు. సర్వనాశనమైనను పశ్చాత్తాపమును బొందక యాంధ్రసామ్రాజ్యమునుగూడ [illegible]యనెంచితివా? నీవును భీషణుడును మాటలాడుకొనుసంగతిని నేనువినలేదనుకొంటివా? యని కుత్తిమప్పుగడ్డమును బట్టి పీకిపారవేసెను.

జయ—అరుణప్రభా! ఈతప్పుక్షమింపుము. బుద్ధి వచ్చినది. అజ్ఞానమున నిట్లొనరించితిని. జైనులకు బ్రతాపరుద్రుఁడు గావించిన ద్రో—

అరు—ఛీ! నోరుమూయుము. నీకొకమతముకూడ గలదా? దయాలవాలమగు జైనమత మెక్కడ! నీవెక్కడ? కలకలలాడు దేవగిరి సర్వనాశనమైనది. పరమపావని యగు

భరతమాతను గోమాంసభక్షకులగు మ్లేచ్ఛుల కంటగట్టెడు నీమత మొకమతమా! ప్రతాపరుద్రుడు హైందవుడు. చక్రవర్తి. నీవును హైందవుడవే. హైందవరాజన్యుని శ్వేతఛత్రముక్రింద హైందవు డవమానింపబడినను గష్టములనందినను, యుప్పు లేక గంజియే దాగినను గలిగెడుప్రీతి, స్వేచ్ఛ. పరపాలనమున నెట్లుండును. ఆకిరాతు డల్లాయుద్దీన్ నీజైనమతమును రక్షించెనా? నీకు బట్టాభిషేకమొనరించెనా! తుదకు హైందవరాజే నీకు బ్రతుకు దెరువయ్యెనే. ఇంకను బుద్ధిలేక హైందవసామ్రాజ్యవినాశనమునకై తురకలను బురిగొల్ప బోవుచుంటివా! మాతృమూర్తి తాపశాంతికై యామెపాదములకడ నిన్నేల బలియీయకూడదు. జయదేవా! నేను బ్రహ్మచారిని. నీవు పిల్లలుగలవాడవు. అయినను వధ్యుడవు. ఈహత్యాదోషము నాకుతగదు. ఇదుగో కరవాలము. ఆత్మహత్యాదోషముకూడ నిన్నే చెందుగాక! పొడుచుకొనుమని కరవాలమును కాళ్ళకడ బడవేసెను. జయదేవుడు గడగడవడంకుచు నరుణప్రభా! క్షమింపుము. బుద్ధివచ్చినది. ఇంటికిబోయెద నని గృహాభిముఖుండై నడచిపోయెను. అరుణప్రభుడు కరవాలమును దీసికొని జయదేవుని వెనుకనే పోయెను.

---

## —• ఇ రు వ ది మూ డ వ ప్ర క ర ణ ము •—



ఒకనాటి సాయంసమయమున మధుమతి, మేడపై దక్షిణపు వసారాలో గవాక్షముకడ నిలిచి యాత్రముతో వీధిని తొంగిచూచుచుండెను. ఆసమయమున గవాక్షము నుండి యేతెంచు పిన్నగాడ్పులకు నామె ముంగురులు కదలి ముఖోపరిభాగమున నాడుచు ముఖపద్మ మరందసౌరభము నాస్వాదింప నరుదెంచు తుమ్మెద జంటవలెనుండెను. ఎవరైన వీధింబడి పోవుచున్నప్పుడు ముఖమునకు జీఱచెఱగడ్డుపెట్టు కొని వాకేగినపిదప ముసుగులు దీసివేసి తనముఖమునుగవా క్షమున జొనిపి వీధిని దొంగిచూచునపు డామెముఖము మబ్బును మఱుగుజేసికొని దాగుడుమూతలాడుకొను చంద్ర బింబమువలె జూపట్టెను. ఆమె నిమిషనిమిషమున కిట్లు వీధిని దిలకించుచుండెను గాని కావలసిన వస్తువ కంటఁబడినట్లులేదు. అయిన నామె దీక్షతో భ్రూమధ్యభాగమును సంకోచింపజేసి యేకీభావమునందిన దృష్టితో జాలదూరమువఱకు వీక్షించు చుండెను. అంత నొకవ్యక్తి యామె దృష్టిపాశముల దగు ల్కొని క్రమక్రమముగ నాకర్షింపబడుచుండెను. వ్యక్తి సమీపించినకొలదిని భ్రూసంకోచముకూడ వికాసమునందు చుండెను. కొంతవడి కావ్యక్తి చూచుచుండగనే యాభవన బహిర్ద్వారమునకు వచ్చి నిలిచెను. అంత మధుమతి వడివడి

మేడదిగి వీధితలుపులను దెఱచి, యాత్రముతో, తాతా! యింతయాలస్యమైనదేమి ? నాదృష్టియంతయు నీమీఁదనే యున్నది. త్రోవలో నేబండి మీఁదబడునో యని భయపడు చు చూచుచున్నాను. ఈపెద్దకాలములోఁగూడ నిన్ను శ్రమ పెట్టవలసివచ్చిన దని పలుకుచు విశ్వాసరాయునితో గూడ తన గదిలోనికిఁబోయి కుర్చీపైని గూర్చొనెను. విశ్వాస రాయు డుస్సు రనుచు నేల జతికలబడియెను. ఆతడంత యుత్సా హముగ నున్నట్టు కనబడలేదు. మధుమతిగుండెలో రాయి పడినట్లులయ్యెను. తుదకు మధుమతి యిట్లనియె.

మధు—తాతా! తాతా!! బ్రహ్మసంసశివయోగిం ద్రులను దర్శించితివా?

విశ్వా—బిడ్డా! ఏమనిచెప్పుదును నాయవస్థ. ఆపోగ రుబోతులు నాచేతులు విఱిచి పచ్చిపుండ్లుచేసిరి.

మధు—ఏపోగరుబోతు లేమిచేసిరి?

విశ్వా—ఇంకెవరు, పహారాజవానులు. వాండ్రదుష్ట రమేమని చెప్పుదును. నన్నడ్డగించి నాచేతులుబట్టి లాగిలోనికి బోనిచ్చినారుకారు. నాపుణ్యము బాగుండి చక్రవర్తి చూచి నివారించబట్టిగాని లేకున్న వారు విడుచుదురా.

మధు—చక్రవర్తి యెవరు?

విశ్వా—ఇంకేచక్రవర్తియున్నాడు. మనప్రతాపరుద్ర చక్రవర్తియే.

మధు—అయ్యో ! కొంపమునిగినది. నేనేమి సేతును ఆతడున్నప్పుడు నీవందున కెందుకుఁబోతివి?

విశ్వా—ఆతడు చక్రవర్తియని తెలిసిన నేనుమాత్ర మచ్చటికి బోయియుందునా?

మధు—ఆతడు నీకంటికి కగుపడలేదా?

విశ్వా—నాకు దూరపుచూపానదని నీకుఁ దెలియును. దగ్గరనున్నను కొంతసేపు నిదానించిన గాని తెలియదు.

మధు—సరియే కానిమ్ము, పిమ్మట యేమిజరిగినది?

విశ్వా—చక్రవర్తి నన్నువదలమని భటుల కానతి చ్చెను. దానితో వాండ్రకండ కావరముడిగినది. నేనుతిన్నగా యోగికడకుఁ బోయి నమస్కరించి కూర్చుంటిని. యోగినీ వడుగునదడుగ వచ్చుననెను. వారిచెంత నొకపురుషుడు గూర్చుండుట నెఱిగి వారెవరంటిని, దానికి శివయోగివారు మాకాప్తవర్గములోనివారు. నీవడుగున దేదియోయడుగుమన నేను నీవడుగుమనిన దంతయు నడిగితిని. యోగి తనచెంతనున్న పురుషుని రాజా యని పిలుచుటచే నాకనుమానము తోచి బాగుగా నిదానించి యాతడు చక్రవర్తి యని గుర్తించితి నప్పుడు నాకమితభయ ముదయించెను. చక్రవర్తికి నమస్క రించి క్షమింపుమని వేడుకొంటిని. రాజు మన్నించి మాధ వునిపై మిక్కిలి వగచెను.

మధు—ఏదిరహాస్యముగా జరుగవలయునని తలంచి

యుంటినో యది చక్రవర్తికికూడ తెలిసెను కానిమ్ము. ఇంత కును యోగీంద్రు డేమిచెప్పెనో చెప్పవైతివి.

విశ్వా—ఏమనిచెప్పుదును, శుభాశుభమిశ్రమనైయు న్నది. మాధవుఁడు జీవించియేయున్నాఁడు. కేవల మాధ్యాత్మిక చింతలచేఁ గాలముఁ గడపుచున్నాఁడట. ఆతఁ డొకచోట స్థిరముగ నుండుటలేదట. స్వరూపము మారియున్నదట, నిజ రూపము నొందునని తోఁచదు. అని చెప్పెను.

యోగియొసగిన యుత్తరములో మధుమతికి మాధవుఁడు బ్రతికియే యున్నాఁడను వాక్యమొక్కటియే జీవనాధారమై యున్నది. ఆమె యెవనిపై తనజీవితమునంతను యాధారపరుచుకొనియుండెనో యాతఁడు విరక్తిమార్గ మవలంబించి రూపు మారియున్నాఁడనియు, మఱల స్వస్వరూపమును గోరుటలేదనియు వినియున్నప్పుడామె మనంబెటులుండెనో వర్ణింప నెవరితరము. మధుమతి తన జీవితమంతయును వృధాయని తలంచెను. ఆమె కీప్రపంచమే యసహ్యముగ దోఁచుచుండెను. తుదకు తనకును విరక్తిమార్గమే యుత్తమంబని తోఁచెను. తుచ్ఛములలగు నిహసుఖంబులయందు నాస వదలించుకొనవలెనని సంకల్పించుకొనుచుండెను. కాని మధ్యమధ్యను మాధవునిపై గల యాశ యడ్డుతగులుచుండుటచే విరక్తిమార్గ మరి కట్టబడుచుండెను. ఆస చాలచెడ్డది. ఆశాబంధముచే నామె జీవితసుమమ్మట్లే నిలిచియున్నది. ఈ నిలకడకు మాధవుఁడు

బ్రతికియున్నాడను యోగివాక్యమే యాధారమైనది. ఆయా శాబంధముచే నామె జీవితకుసుమము నిలిచియుండెను గాని యాజీవితకుసుమము వికాసమునందుటకు మార్గ మామెకుఁ బొడకట్టుటలేదు. అంత నామె యొకనిట్టూర్పువిడచెను. అది సోకినంతవట్టు యొడ లెఱ్ఱగ కందిపోవుచుండెను. ఆమె మనం బనియెడు పాలకడలి, చింతలనెడు మంధరముచే మథింపఁబడి వెలువడిన కాలకూటవిషజ్వాల. దానిని మ్రింగెడు యీశ్వరుడు లేమి, యామె హృదయసాగరమును క్షుభ్కింపఁజేయుచుండెను. దీనికిదోడు గర్వభూయిష్టుండగు కామపాలుని శైదములు మరింత బాధాకరములుగా నుండెను. తుదకామె యిట్లులనియె.

మధు—తాతా! మాధవుడు మరలరాడా? ఆతని యభినవకుసుమకోమల శరీర మట్లడవుల గృశింపవలసినదేనా? విధాత నన్నిట్టికష్టము లనుభవించుటకేనా పుట్టించెను. పుట్టించెపో, నాహృదయమును వజ్రముతోనో, ఱాతితోనో జేయ కింతమార్దవముగ నేలసృజించె. నేనీ బాధ నెట్లుసహింతును.

విశ్వా—బిడ్డా! నీయవస్థ మిక్కిలి శోచనీయముగానున్నది. నీవవివేకినివి కావు. నీవింతగ విచారించుచున్న నాహృదయము పరితాపమునకు లోనగును. నాజీవిత మిక నిమిషములమీాద నున్నది. ఆదుష్టవిధి, నీయిక్కట్టుల జూచుటకేనా నాకీ యాయువునిచ్చెను, తల్లీ! నన్నుజూచియైన శాంతింపుము.

మధు—తాతా! నాకష్టములు నాతో పోవుటలేదు. వృద్ధుడవగు నిన్నుఁగూడ వేధించుకొని తినుచున్నవి. నీ విటు నటు నడుచుటచే జాలయలసి యున్నావు. నీవుపోయి భుజించి రమ్మా.

అని పలుక విశ్వాసరాయుడు లోనికేగెను మధుమతి మరల యోజనలకుఁ దగుల్కొనియెను. శ్రీధరుడు దేవగిరి నుండి వచ్చినవెనుక రావచ్చునని భాస్కరుడు కాంచీపుర మున కేగెను. రుక్మిణీ శ్యామలలు లోన బనిచేసుకొనుచుం డిరి. మధుమతి గదితలుపులన్నియుఁ దెఱువబడి యున్నవి. ఆమె యుత్తరాభిముఖయై కుర్చీపైన బరుండి యోచనా యత్తచిత్తయై యుండెను. ఇట్లుండ నొకపురుషుడు శ్రీధరుని గదిలోనుండి దక్షిణపువసారాలోనికి వచ్చి, యిటునటు దొంగి చూచెను. అచ్చటేవరియును గోచరించుట లేదు. మనస్సు చిన్నబుచ్చుకొని, యటనుండి నెమ్మదిగ మధుమతి గది యొక్క దక్షిణద్వారముకడకు వచ్చి నిలిచెను. బంగారపుఁ జిత్రప్రతిమవలె మధుమతి కుర్చీపై నుండుటగాంచి యొకనిమి షమట్లే నిలచి చప్పుడుకాకుండ నామె వెనుకభాగమునకు వచ్చి చేతులు ముందునకు సాచి యామె నేత్రయుగ్మమును చట్టునమూసెను. మధుమతి తుల్లిపడి లేవబోయెనుగాని యాతడు కనులను గట్టిగ నదిమిపట్టి గదలకుండగ జేసెను. ఆమె సర్వాంగములును గంపమొందసాగెను. మధుమతి కోప

ముతో కోకిలా! యని బిలిచెను. ఎవరును మారుపలుక లేదు. మరల యత్తా యని పిలిచెను. దానికిని సమాధానములేదు. ఆమెకు భయముప్పుట్టెను. అంత నామె యాతనియొక్క పక్కోష్టమును దడవెను. అచ్చట కంకణములు లేవు. చొక్కా యొక్క చేతికొన మృదువుగ తగిలెను. ఆతడు పురుషు డని యామె గ్రహించెను. ఆమె భయము మరింత యధికమయ్యెను. మేనంతయు జెమ్మటలుపట్టెను. ఇంతచనువుతో దన కనులు మూయువా రెవ్వరై యుందురని తలంపనారంభించెను. చిన్ననా డాటలాడుకొనునప్పుడు మాధవు డిట్లు తన కనులు మూయుచుండెడువాడు. ఈతడు మాధవుడై యుండెనాయని యనుకొనియెను. తుదకా యూహ నిలిచినదికాదు. తుదకామె యావేగముతో బిగ్గఱగ యెవరువారనెను.

పురుషుడు—మందస్వరముతో, నేనెవరినో చెప్పుకొనుము.

మధు—గద్గదస్వరముతో, నాకు దెలియదు.

పురు—నన్ను మఱచిపోతివా?

మ—ఔను, నన్ను వీడుఁడు.

పురు—మధుమతీ! కోపగించకుము. నన్నానవాలు పట్టెదవో లేవో యని నీకనులు మూసితిని అని తనచేతులను వెనుకకు దీసికొనియెను.———మధుమతి కను లెత్తిచూచెను. మందహాసముతో గామపాలు డామెపార్శ్వమున

నిలిచియుండెను. మధుమతికి భయక్రోధము లొక్కమారు జనించెను. వడకెడు మేనుతో నెఱ్ఱబడినకనులతో గుర్చునుండి తటాలున లేచి క్రిందికిబోవుచుండెను. కామపాలు డడ్డముగ వచ్చి నిలిచెను.

మధు—ఏమిది? ఇంతదురంతమా! ఆడువాండ్రిలో గూడ పౌరుషముకలదు. సత్వరమే యిటనుండి తొలగిపొండు.

కామ—కనులు మూసితెఱచినయా నీకింతకోపము. ఒక్కసంవత్సరకాలమునకే నన్నుమరచిపోతివా?

మధు—ఔను నాకన్నులింకను మూతలువడియే యున్నవి. నాకీజగమంతయు నంధకారముగకనుపట్టుచున్నది. మీరిట నిలువంజనదు. తక్షణమే యిటనుండి గదలిపో వలయును.

కామ—నాక్షేమమును నీకుం దెలుపవచ్చితిని. నేనిటనుండ మనల నాక్షేపించువా రెవరు, ఇంకెంతకాల మీ భయము.

మధు—క్షేమకథనమున కిది మార్గముగాదు. మీ రిటనుండుటకు నేనే యాక్షేపించుచున్నాను. భగవంతుడాక్షేపించుచున్నాడు! జగమాక్షేపించగలదు. ఇట్టి యవినీతులుండునంతవరకును భయమే.

కామ—నీతో మాటలాడుట కెప్పుడును సమయము చిక్కకుండుటచే మనసుపట్టలే కీసాహస మొనరించితిని. పాణి

గ్రహణమగుటకు కాక్షేపించిన పడసగ్గదే, పేృమచ్ఛైదములవి నీతికరములుకావు.

మధు—ఇప్పుడెందుకీ వాదప్రతివాదములు. తత్క్షణమే పోయెదరా లేదా?

కామ—నాచపలత్వమును మన్నింపుము. నీయాజ్ఞను చెల్లించెదను. కోపముడిగి శాంతముగనుంటివేని సంతోషముగ బోయెదను. అవరమిమ్ము.

మధు—మీరిటనుండిపోయిన శాంతించెదను.

కామ—ఇదిగో పోవుచున్నాను కాని, మధుమతీ నాపైదయ—

మధు—ఏమిది? ఇటనుండిపోన

కామ—ఇదిగో పోవుచున్నాను—వట్టిబేలవు. అరిగదిని దాటి కామపాలుడు లోనికేగెను.

———

—ఇరువదినాలుగవప్రకరణము.—



మధుమతి యెంతభయపడుచుండెనో యంతయు జరుగుచుండెను. కామపాలుడు బరిదెగి మహాసాహసమునకుం దిగినాడు. ఇంట నడ్డుపెట్టువారు లేకుండుటచే నాతని గుండు దుడుకు మఱింత హెచ్చుచుండెను. మధుమతికి విషమపరిస్థితి

యేర్పడినది. ఆమెబ్రతుకు భయోత్పాతమగు యోజనలతో గొట్టుకొనుపోవుచుండెను. ఆమె తనమనంబున నిట్లు తలంప నారంభించెను. హాదైవమా! నేనేమిచేయుదును. గతియెయ్యది ఇంట రాహుర్య ప్రవేశించెను. ఆక్రూరగ్రహము నొప్పించుకొనుటెట్లు. ఎంతసాహసమెంతసాహసము. మాధవ పత్నితో దాగుడుమూత లాడుటకు సిద్ధపడినాడు. నాకనులుమూసి సరసములాడుటకు మొదలిడినాడు. అవిసరసములా! కావు కావు, ప్రలాపములు. నేనెవరితో జెప్పుకొందును. చెప్పుకొందునుపో, యాదరించువా రెవరు. నాతండ్రి యింటలేడయ్యె. ఛీ! లజ్జాకరమగు నీవిషయమును నాతనితో మాత్రమేమని చెప్పుదును. తల్లితో జెప్పుకొందునన్న నాతనియందు నాజననికి మిక్కిలి ప్రేమ. ఆమె తనయాస్తితోగూడ నన్నాతనికి ధారవోయ సంకల్పించుకొని యున్నది. అత్తతో జెప్పుకొందమన్న హాస్యముక్రిందపోవుటయేకాక, తన కెగసక్కములుకూడ జేయును. ఏమైనగానిమ్మని తెగించిచెప్పుదునుపో, కిట్టకంట్లంటివని దెప్పుదురు. నాకిక తాతయొక్కడే దిక్కుగం గనపడుచున్నాడు. ఆతడింకను రాలేదు. నామనస్సు దహించుకొనిపోవుచున్నది. పిచ్చియెత్తుచున్నది. ఇదియు సరియగు నూహకాదు. తాతతో జెప్పితినా యాతడు తక్షణమే యందరితోడను తగవులాడివచ్చును. దానకలహము మఱింతహెచ్చును. దీనిమూలమున తాతకుం జిక్కులు తటస్థించును.

ముందుచూచిన నూయియు వెనకజూచిన గోయియుఁ గనఁ బడుచుండెను. నాకాలోచన చెప్పువారెవరని కన్నుల నీరు నింపుచుండెను. కూర్చుండుటకును నిలుచుండుటకునుఁ గూడ శక్తి చాలకుండెను. తుదకామె తలుపులన్నియు బిగించియుంచ ముమీఁద బరుండిపోవుచుండెను. తెరవుదొరకక సందిగ్ధ సాగరమునబడి కొట్టుకొనుచుండెను. ఈబడలికచే గనులు మూసి యట్లేవిస్మరించెను. ఇంతలోవిశ్వాసరాయఁడు భోజ నమునుజేసి మధుమతి గదివద్దకు వచ్చి తలుపులుమూయబడి యుంటచే చేతికఱ్ఱతో తలుపులను ముందునకు నెట్టెను. తలు పులు తెరువంబడియెను. విశ్వాసరాయుడామెబరుండుటగాంచి లేపుటకిష్టములేక, గోడకు జేఱబడికూర్చుండెను. మధుమతి తలుపులన్నియు వేసితిననుకొనెను గాని తాతవచ్చినమార్గము నకుమాత్రము గొళ్ళెము వేయుట మరచెను. ఆకారణముచే తాతలోనికివచ్చుటకు వీలుగలిగినది. ఇట్లుండ రుక్మిణీ శ్యామ లలు మధుమతి భోజనమునకువచ్చునని కొంతవఱకు జూచిరి కాని యెంతకును రాకుండుటచే బిలుచుకొనివత్తమని మధు మతిగదిలోనికి వచ్చిరి. మధుమతి నిద్రపోవుచుండెను. ఈది నంబున మధుమతి భుజించకయే నిదురించుచున్న దేమని తలంపనారంభించిరి. ఇంతలో మధుమతి యేమియో మాట లాడనారంభించెను. రుక్మిణీశ్యామలలకు నవ్వువచ్చెను. మధు మతి నిదురపోలేదని వారు తలంచిరి. అప్పుడు రుక్మిణి, మధు

మతీ యని పిలిచెను. మధుమతి మారువలుకలేదు. ఆమె కనులు మూతపడియే యుండెను. రుక్మిణీశ్యామలలు విస్మితురాండ్రై మధుమతి నీక్షించుచుండిరి. మరల మధుమతి మాటలాడుట కారంభించెను. వానిని వినుటయందామెకు శ్రద్ధ హెచ్చెను. వినుడు వినుడు—ఏమనుచున్నది?

నన్నంటకుము నాకనులమూయ నీకధికారమెక్కడిది. పరదారనంటెదవా? పొమ్ము. పొమ్ము. అయ్యో? కామపాలుడు=కామపాలు_మాధవా? పట్టుకొనుము. పట్టుకొనుము. అనిమంచమునుండి యదాటున లేచెను. ఆమెకు మెలుకువ వచ్చెను. మేనుగడగడవడంకనారంభించెను. మేనినిండ చెమ్మటలు పట్టెను. భయపడజొచ్చెను. రుక్మిణి తెల్లవోయెను. శ్యామలముఖము వాడిపోయెను. వీరలనుగాంచి మధుమతి లజ్జించెను. కలగని పలువరించినదని తుదకు దెలిసికొనిరి. ఆస్వప్నవాక్యములు రుక్మిణీశ్యామలలకు సహ్యములుగా నుండలేదు. ఇదంతయును జూచుచునేయున్న విశ్వాసరాయుడిట్లనియెను.

విశ్వా...బిడ్డయేదియో చెడుకల గనియున్నది. ఆశ్చర్యముతో నట్లుచూచెదరేల? పలుకరించి భోజనమునకు దీసికొనిపొండు.

శ్యామ—మధుమతీ ! నీవు కలగంటివా?

మధు—కలగాదు—నిజముగనే జరిగినది.

శ్యామ—ఇప్పుడు నీవు పలుకరించితివిగా వా?

మధు—నాకాసంగతి తెలియదు.

శ్యామ—మరి నీకు దెలిసిన దేమిటి?

మధు—నాకనులుమూసి నన్ను కామపా—

శ్యామ—నిన్ను కామపాలు డేమిచేసినాడు.

మధు—చేయరానిపనియే చేసినాడు.

శ్యామ—మధుమతీ! యింకను నీకు నిద్రమత్తు పదల లేదా!

మధు—నేను నిద్రపోవుటలేదు— మెలుకువగనే యున్నాను.

శ్యామ—నీవెవరిని పొమ్మనుచున్నావు.

మధు—ఎవరిని పొమ్మనవలెనో వారినే.

రుక్మి—బిడ్డ కలగని భయపడియున్నది. ఎందులకా ప్రశ్నలు దానితో.

శ్యామ—కలయేమియో కనుగొనవలెనని—మధుమతీ నీవు కలగనినట్లు తెలియునా?

మధు—ఇది కలయేమో నాకు దెలియదు. నిజముగ జఱిగినదికూడ కలయెట్లగును?

శ్యామ—నీవు మాధవుని బిలచితివా?

మధు—పిలిచితినేమో?

శ్యామ—ఆతనినేనా పట్టుకొనుచుంటివి?

మధుమతిముఖము వెలవెలబోయెను. తలవంచుకొనియెను. మారువలుకలేదు.

శ్యామ—(మఱల) ఆతని నేనా పట్టుకొనుచుంటివి.

మధు—(నిట్టూర్పువిడిచి) ఔను.

శ్యామ—నేను పరదారనని పలికితివిగావా ?

మధు—ఔను.

శ్యామ—ఎవరితో నట్లంటివి ?

మధు—నన్నెవరు పట్టుకొనబోయిరో వారితో

శ్యామ—నిన్నెవరు పట్టుకొనబోయిరి.

మధు—నాకు తెలియదు.

శ్యామ—కామపాలుడా?

మధు—ఔను.

శ్యామ—నీవు కామపాలునకు పరదారవా ?

మధు—మాటాడలేదు. తలవంచుకొనియెను.

శ్యామ—(మరల) నీవు కామపాలునకు పరదారవా?

మధు—నన్ను మాటలాడించకుము. ఒకమారు చెప్పితిని. మఱలనదియే ప్రశ్నయా?

రుక్మి—అదేమి వదినా? బిడ్డకలగని భయపడియుండగా నీవట్టిప్రశ్న యేల వేసెదవు ?

శ్యా—కడుపులోనున్న యూహాయే! కలలోబలికెదరు. కడుపులోలేనిది, కలలోమాత్రమెట్లు బలుకగలుగును.

విశ్వా—(కోపముతో) ఇక విూపిచ్చిపిచ్చియూహలు గట్టిపెట్టుడు. చాలరాత్రియైనది. భోజనములుచేయకుండ నెంతకాలమిట్లు వినోదించెదరు? అమ్మా! రుక్మిణీ!! చెడుకలచే బిడ్డ యలసియున్నది.

అంత రుక్మిణీశ్యామలలు మధుమతిని (బిలుచుకొని పోయిరి. శ్యామలకేమియును సంతోషముగ లేదు. మనసు చాల చిన్నవోయియుండెను. కామపాలునియందు, మధుమతి కిష్టములేనట్లు తోచినది. మధుమతిమనస్సు, మాధవుని యందు లగ్నమైయున్నట్లు, గ్రహించెను. ఇదియంతయుఁ గలకుసంబంధించినవిషయమగుటచే మనస్సును కొంచెము శాంతింపఁజేసెను. మధుమతికేమియును భోజనము హితవుగ నుండలేదు. కలతనొందినదగుటచే, మధుమతికి హితవులేక పోవుట సహజమేకాని, యీదినఁబున శ్యామలభోజనము కూడ నష్టేయుండెను. రుక్మిణి, మధుమతి భోజనమునందయి ష్టముగ నుండుటఁజూచి యిట్లనియె.

రుక్మి—అమ్మా! ఏమది! భోజనమట్లుచేయుచున్నావు.

మధు—అదేమోకాని, భోజనము హితవగుటలేదు.

రుక్మి—నీవు పాడుకలగంటివి. దానినిమఱచిపొమ్ము.

మధు—నేనెట్లు మఱచిపోదును. ఇంకనునాకు భయముకలుగుచునేయున్నది.

రుక్మి—వీపుమీఁదఁజేయివైచి, నిమురుచు, నీవు వట్టి

పిఱికిదానవు. కలలోఁ గూడ యింతభయము. అత్తయో, నేనో, నీకడఁ బరుండెదము. పాలుపోసికొని కొంచెమన్నమును తినుము—అని వెండిగిన్నెలో పాలుపోసి మధుమతిముందటఁ బెట్టెను. మధుమతి తిరస్కరించలేకపోయెను. ఆపాల నెట్లో త్రాగెను.

శ్యామ—నేను మధుమతివద్దఁ బఱుండెదను. మధుమతి యేమియో ధైర్యవంతురాలనుకొంటిని కాని, నట్టిపిఱికిది.

మధు—పిఱికిదానవనినంతమాత్రమున నేనుదాసీనను గాను. ఎవరిమీఁదికివచ్చినగాని, వారికి తెలియదు. నాకుతటస్థించినస్థితియట్టిది. అది యెవరికి భయమును పుట్టింపకుండును, నావద్ద నెవరును పండుకోవద్దు. నాకు భయములేదు. నేనే పరుండెదను.

శ్యామ—[మందహాసముతో] నీపిఱికితనము బయట పడినది. దాచజూచిన నదిదాగదు. నిజముగ నీవు పిఱికి దానవే.

మధు—[నవ్వుచు] ఔను. నేను పిఱికిదాననే. నావద్ద బరుండిన నాపిరికితనము నీకంటుకొనగలదు. నీవు వేరుగబరుండి ధైర్యమవలంబింపుము. త్రాససహాయముగనుండిన నాకేమియును భయములేదు.

తుదకు నాముగ్గురివదనములును హాస్యసంభాషణలచే వికసించెను. ఈసందర్భమున శ్యామలహృదయము మారి

పోయినది. తన యనుమానము నవకలెను. కల, కల, యని యూ మెకు దోచెను. ఇంతలో విశ్వాసరాయుడు, వీరలేమిచేయు చున్నారో చూతమని, లోనికి వచ్చెను. తల్లితో జెప్పి మధు మతి, తాతతో గూడ తనగదికిం బోయెను. రుక్మిణీశ్యామలలు తమతమ శయ్యలకుం బోయి పరుండిరి.

—•—

## —• ఇరువదియైదవ ప్రకరణము •—

ఆశ్వయుజశుద్ధ పాడ్యమి మొదలుకొని దశమివరకును గల యీపదిదినంబులలోను, యేకశిలానగరమునందు, రాత్రులు దీపములు పెట్టినది మొదలు, తెల్లవారువరకును, నేయింటం జూచినను, నే దేవళంబు గాంచినను, యేమఠంబు దిలకించినను, యేవీధుల నవలోకించినను, యేసంమనీక్షించినను, మృదంగ ధ్వనులతోడను, తాళపుచప్పుడులతోడను, గాత్రపు పాటల తోడను, హరికథా కథనంబులతోడను, పురాణకాలక్షేప ములతోడను, నయనోత్సవంబును, గర్వోత్సవంబునుగూడ గావించుచుండును. ఈనగరమంతయును బచ్చనితోరణంబుల తోడను, అంలకారభూయిష్టములగు బందిరులతోడను, యెంత యో యందమై యొప్పారుచుండును. నేడు విజయదశమి. నేటి రోజున, శ్రీ ప్రతాపదేవచక్రవర్తి శమీపూజగావించుట వాడుక. ఈయుత్సవ మాపుర బాహ్యోద్యానముననున్న

శమీవృక్షముకడ మహావిభవంబుతో జరుగుచుండును. ఓరు
గల్లునందు మిక్కిలి ప్రసిద్ధినహించిన శ్రీ కేశవస్వామివారు,
ఆలయంబుననుండి వెడలుచు, పురవీధులందిరిగి, సాయంసమయ
మున కా శమీవృక్షంబుకడకు వేంచేయుచుందురు. సేనాను
లెల్లరును శుభ్రవస్త్రాలంకార భూషితులై, సాయుధపాణులై
ప్రతాపరుద్రదేవచక్రవర్తితోఁగూడ వచ్చుట యాచారమై
యుండెను. అల్లదే చూడుడు! భద్రగజంబుపై ముక్తామణివి
రాజమానంబగు, యంబారీ మధ్యభాగంబున మందహాసచం
ద్రికలోష్ఠపుటమధ్యమునుండి తొంగిచూచుచుండ, చల్లని
కేగంటిచూపులచే, జనులనానందపఱచుచు, శిరంబున నవ
రత్నకిరీటము మెఱయ, దేవేంద్రునింబలె, శ్రీ ప్రతాపరుద్ర
దేవచక్రవర్తి యుపవిష్టుండై వచ్చుచున్నాడు. ఉన్నతాశ్వం
బుల నధిరోహించి వీరపురుషులు చక్రవర్తి యగ్రభాగంబున
వచ్చుచుండిరి. ఒకప్రక్క నుచితయానంబులపై శ్రీనాథ
ప్రభృతులగు విద్వన్మహాజనులును, వేఱొకప్రక్క గురువు
లగు లింగధారులును, యలంకరించియుండిరి. ఇట్టి మహావిభ
వంబుతో ప్రతాపరుద్రసార్వభౌముడు పురబాహ్యోద్యాన
మునందలి శమీవృక్షముకడ కరుదెంచి, భద్రగజంబునుండి
మెల్లగదిగి, యట నుచితాసనంబుపై నుపవిష్టుండయ్యె.
ఎల్లరును తమకర్హంబులగు స్థానంబులగూర్చుని యుండిరి.
అంత గేశవస్వామిని స్వర్ణసింహాసనమున నుపవేష్టుంజేసిరి.

పూజావిధానమున కనుజ్ఞయీయబడినది.

అనంతరమున సాయంతన భానునిశారుణకిరణములు స్వర్ణసింహాసనముపైనను, స్వామిపైనను వ్యాపించి సూర్యభగవానుడు భక్త్యనురాగములతో గేశవస్వామి కర్ఘ్యపాద్యంబులిడుచుండినట్లు చూపట్టెను. మరియు, గాలభగవానుడు, తనపాలనమునఁ బ్రజానురాగమును బడసితినను సంతోషముతో, రాగమూర్తిఁడై స్వామిభక్తినిఁజూప యరుణకిరణములనెడి పద్మరాగంబులఁ గప్పు మర్పించుచున్నట్లు పొడకట్టెను. వైష్ణవస్వాములు స్వామికర్పించుచుండిన, వివిధవర్ణములుగల పువ్వులన్నియును, నాయరుణకాంతిలో లీనమై పద్మరాగ మాణిక్యములనలె బ్రకాశించెను. ఇట్లుండ బ్రహ్మానంద శివయోగి విభూతి రుద్రాక్షమాలికాధారుఁడై, మెడనుండి పాదమువరకును వ్రేలాడు నిలువటంగిని దొడగి దండహస్తుఁడై బాలశంకరునివలె యమ్మహాస్థానమున కరుదెంచెను. ఆతని గాంచి చక్రవర్తి తటాలునలేచెను. చక్రవర్తితో సభికులెల్లరునులేచిరి. బ్రహ్మానందుడు దండము ముందునిడుకొని చక్రవర్తిపార్శ్వంబున గూర్చుండెను. చక్రవర్తియు యోగి దండమునకు నమస్కరించి తన యాసనంబున గూర్చుండెను. మిగిలినసభికులును దండమునకునమస్కరించి తమ తావుల గూర్చుండిరి. వారవనితా చిత్రనటనంబులు జెలంగుచుండెను. మృదంగధ్వనులు సెలంగుచుండ, తంబురనాదము వెలయు

గుండ, భక్తులు హరికీర్తనంబుల గావించుచుండిరి. సభయంతయు కలకలలాడుచుండెను. పూజావిధానము నెఱవేరినపిదప నర్చకులు స్వామికర్పించిన పుష్పమాలలను పళ్ళెరంబున నుంచుకొని యాశీర్వదించుచు చక్రవర్తికంఠమున నొకమాలవైచి, వేఱొకటి యాతనిహస్తంబుల నిడిరి. సార్వభౌముడామాలికను బ్రహ్మానందుని కంఠమునవైచెను. క్రమంబుగ నాపుష్పమాలికలన్నియు విశ్వబ్రాహ్మణజనులకును, మతాచార్యులకును నీయబడెను. ఇది వైష్ణవోత్సవంబగుటచే నారాధ్యులకేమియు నుత్సాహముగ లేదు. కాని చక్రవర్తినిబట్టి వారీయుత్సవంబునకు రావలసివచ్చెను— ఇట్లుండ, చక్రవర్తి తనయుత్తమాంగమును పైకెత్తి దేనినో గుర్తించుచుండెను. సభికులెల్లరును నావంకకే తమమస్తకంబులద్రిప్పిరి. శ్రద్ధతో దిలకించితిమేని మనకావైపునుండియొక టకటకధ్వని శ్రుతి గోచరంబగును. చూడుడు. ఒకవాజివేగము వారి వచ్చుచున్నది. వాజిపై నొకపురుషుడుగూడ గోచరించుచున్నాడు. అతడు క్రమంబుగ సభను సమీపించెను. వాని దుస్తులన్నియు యుద్ధమునకుబోయినవాని దుస్తులవలెనుండెను గుఱ్ఱమాగెను. దానినుండాపురుషుడు తటాలున నేలకుఱికెను. అంతనాతడుచక్రవర్తికి నమస్కరించి మోకరిలనిలిచెను. ఎదుటబ్రహ్మానందునిగాంచి యాతనిదండమునకు నమస్కరించెను. చక్రవర్తి నాతడుపవిష్టుండైయుండ యిట్లనియె.

ప్రతా—శ్రీధరా! దేవగిరి విశేషములేమి?

శ్రీధ—సార్వభౌమా! ఏమనివిన్నవింతును. మిక్కిలి దుఃఖదాయకము.

ప్రతా—(ఆంత్రముతో) దేవగిరి మహామ్మదీయుల వశమయ్యెనా?

శ్రీధ—లేదు. సంధిపొసగినది.

ప్రతా—రామచంద్రదేవుఁడు సంధికొడంబడియెనా?

శ్రీధ—అదిమిక్కిలిలజ్జాకరము, పరాభవము.

ప్రతా—సంధియొడంబడికయేమి?

శ్రీధ—ఆరువందలమణుగుల ముత్యములు, నాలుగు వందలు పట్టుపీతాంబరములును, వేయి వెండినాణెములును, రెండు రత్నాభరణంబులును, యిచ్చుటయెగాక, ప్రతివత్సరమునుకొంతకప్పమును గూడ కట్టుటకొప్పుకొనియెనట. ఇంతియేగాకకొంతదేశమునుగూడ నొసగెనట.

ప్రతా—మీరు మహామ్మదీయుల నెదుర్కొనలేదా?

శ్రీధ—లేదు. మేమింకను దేవగిరిని సమీపించకుండగనేసంధిపొసగెను.

బ్రహ్మ—రామచంద్రదేవుడట్లు సంధిగావించుకొనుటకు కారణమేమిచెప్పును.

శ్రీధ—దుర్గములో నాహారపదార్థములు లేకపోవుటచే భయపడి సంధిగావించుకొనినట్లు చెప్పెదరు.

బ్రహ్మ—తురుష్కులు జనుల కేమియును హానిగలుగఁ జేయలేదుగదా?

శ్రీధ—(వివర్ణవదనముతో) ఏమని చెప్పుదును. నగర మంతయు భస్మీభూతమయ్యెనట. పట్టణమంతయును కొల్లగొట్టి రట. నగరవాసులుకొందరు నాకెదురైరి. వారుతమకష్టము లనుఁ జెప్పుకొనునపుడు నాహృదయము కఱఁగి నీరైపోయినది. ఆయవమాన, మాదుఃఖ, మాయవినీతికృత్యముల బ్బా? చెప్ప నెవరితరము.

శివయోగి కనులనుండి బాష్పములు రాల్చెను. ఇక సంసారులహృదయంబు లెట్లుండునో వేరుగ చెప్పనేల! ప్రతా పరుద్రునిముఖ మెఱ్ఱబడియెను. ఆతడిట్లనియె.

ప్రతా—క్రూరమృగంబులకును, దురకలకును భేద మేమియునులేదు. ఎట్టి యవినీతికృత్యములనైన నొనరింతురు. దయ, వారల కేకోణంబుననుండదని తలంచెదను. ఇట్టి మ్రుక్కడుల హతమార్చకున్న, సాధువులగు హిందువులు హింసల పాలగుదురు.

బ్రహ్మ—రాజా! మాతలంపుగూడ నట్టిదియే! వారు మహాక్రూరులు. ఇదివరకెన్నియోపర్యాయము లీవిషయము నుగూర్చి చెప్పియుంటిని. ఎప్పుడైన వారదాటున మీఁదఁబడి యెదరు. నీవజాగ్రతగనుంటివి. సరిహద్దుదుర్గముల బాగుచే యింపుమని యెన్నియోమారులు చెప్పితిని. నీవుపేక్షవహించి

తివి. నా నెమ్మదికి భంగము కలుగ జేసి, యీశ్వరుడు నన్ను నీ రక్షణమునకై బంపియున్నాడు. ఈశ్వర ప్రేరితుండనై నేను నీకు హితేచ్ఛువగయున్నాను. దేశరక్షణంబు నీవు శ్రద్ధ వహింపవేని యీశ్వరుని యాగ్రహంబునకుఁ బాత్రుఁడవగుదువు. రాజా! యిటు చూడుము. నీపురోభాగంబున వీరవరులెందరో కూర్చునియున్నారు. వీరు మహావీరులు, అయినను వీర లహృదయంబులంతః కలహంబుతో గూడుకొని యున్నయవి. ఈశ్వరోపదేశంబున వానిని మే మెరింగితిమి. ఈ కమ్మవీరులకును, పద్మనాయక వీరులకును, యిట్టి భేదభావంబు లుండదగదు. ఇది దేశమునకును వారలకును గూడ హానికరంబు. దానిని వీరిప్పుడు విడువవలెను.

యోగి వాక్యంబులు విని లజ్జించి పద్మనాయకులు గంభీరస్వరముతో మాకట్టి భేదభావము లేదు. ఒకవేళ యున్నను నేటితో దానిని విడుచుచున్నాము. పిమ్మట కమ్మనాయకులును గూడ నదేవిధముగ నుద్ఘోషించిరి. యోగివాక్యముల కెల్లరు నచ్చెరువందిరి. అతడు త్రైలింగ రాజ్యమును రక్షింపనవతరించిన యీశ్వరుడని తలంచిరి. చక్రవర్తి తనయుపరాథమునకుఁ దలవ్రాల్చెను. తుదకాతడిట్లులనియె.

ప్రతా—దేవా! మాధవుడుమా చెంతనున్నపుడిట్టి హితవాక్యములు విననచ్చెడివి. ఆతఁడెటకో పోయెను. ఏరైననాతని వెదకుగొనివ గొప్పబహుమతినోసంగెదను.

బ్రహ్మ—రాజా ! మాధవుడెవడు ?

పరితా—నాడొక వృద్ధుడుమిమ్ములబ్రష్టులజేసి యుండలేదా ? ఆతడేమాధవుడు.

బ్రహ్మ—ఓహో ! ఆతడేనా ! ఆడనినిజస్థితిని నాకు మీరువినియుంటిరి.

పరితా—ఔను. విరక్తుడై యొందెందో తిరుగుచుండెనని తెలిసితిరి. ఆతడెక్కడున్నదియును దెలిసినశావించి మాతని పడవాకనిలో సంగెదను.

బ్రహ్మ—అది యిప్పుడుపొసగనిపని. ఆతడెచ్చటనో రహస్యముగ బ్రహ్మధ్యానతత్పరుండయి యున్నట్లుతోచుచున్నయది. ఇంతలోనాయున్నతపదవినుండి మరలనీపదవి నాశించుననితోచదు. ఆతనిశిష్యున్నిసిద్దించిన తనంతట తానే బయలుపడును.

ఈవాక్యములువిన శ్రీధరునిహృదయము మరింతయూవేదనలకు పాలయ్యెను. మతాచార్యులకు గుండెలలో జాయిపడినట్లులయ్యెను. బ్రహ్మానందుని వాక్యములకెల్లరును మహాదాశ్చర్యముకలిగెను. ఆతనిమహిమలకెల్లరును శిరంబుల వంచిరి. అంతటచాల రాత్రియగుటచేచక్రవర్తి యోగికడ శలవుదీసికొని భద్రగజంబు నెక్కెను. బ్రహ్మానందుండుతన యాశ్రమంబునకుబోయెను. పిదప కేశవస్వామి రథముపై యధిరోహించి ముందు వెంచేయుచుండ నాదేవునివెనుక పరితాపరుదుండును, యాతనివెనుక వీరపురుషులును, పార్శ్వంబుల గురువిద్మన్మహాజను

లును, వెడలి కేశవస్వామిని నాలయమున బ్రవేశపెట్టి తమ తమ నివాసంబులకుజనిరి. శ్రీధరుండింటికివచ్చెను. ఆతని గాంచి మధుమతియెదురుగావచ్చెను. శ్రీధరుడు తన ముద్దు బిడ్డముఖముపై చెదరియున్న ముంగురులను సవరించి శిరంబును దువ్వి మధుమతినిగదిలోనికిబోయి, పడుకకుర్చీవయిని పరుండి మధుమతితో యుద్ధవార్తలజెప్పుచుండెను. మధుమతి యొక విసరుకఱ్ఱను చేబూని తండ్రికి విసరుచుండెను. ఇంతలో కోకిల శ్రీధరునిగాంచి గంతులువేయుచు, బాబుగారువచ్చినారని యఱచుచులోనికేగెను. రుక్మిణీశ్యామలలు సంతోషముతో వడివడి శ్రీధరుని చెంతకువచ్చి నిలిచిరి. అన్యోన్యకుశలప్రశ్న లతో గొంతకాలముగడచెను. ఇంతలో గామపాలుడరుదెంచి మామను గుశలప్రశ్న జేసెను. మధుమతి కొంచెము మాటలకు దొలంగెను. శ్రీధరుడింకను యలసటగనేయుండెను. ఆతడింక ను వ్యజనవాత సేవగోరుచుండెను. ప్రక్కకుదిరిగి చూచెను. మధుమతిలేదు. రుక్మిణి, ఈసంగతిగనిపెట్టి, అమ్మా! మధు మతీ! అయ్యగారు చాలయలసటగనున్నారు. ఇటురమ్మా? పెఱవారలెవరును లేరు. ప్రక్కనుగూర్చుండి కొంచముమువిసరుము లేకున్న నావిసరుకఱ్ఱ నాచేతికిమ్మా?

మధు—అయ్యగారికి నేనేవిసరెదను. అని తనతండ్రి రెండవప్రక్కనునిలిచి విసరుటకారంభించెను. శ్రీధరునకు రెం డవప్రక్కను కామపాలుడు కూర్చునియుంటచే కామపాలు

నకుగూడ నావ్యాజనవాక్పోతములుసోకి యాతనికపారసుఖమును గలుగజేసెను. వదనమండలము వికసించెను. ఆతఁడు కాలికిగడలు తనకురులను సవరించుకొనునెపంబున, తనముఖమును కొంచెముపైకెత్తి మధుమతి, ముఖేందునిరీక్షించుచు, మందహాసముతో మరల తల వాల్చుచుండెను. మధుమతి, సంప్రీతి సంతోషముకొఱకేమేమియో కబురులుచెప్పుచుండెను. కామపాలుఁడు తనవిలాసమునుగాంచియే మధుమతి సంతసించుచుండెనని మురియుచుండెను. ఇంతలో కోకిలవచ్చి వడ్డనసిద్ధమైనదని వచ్చిచెప్పెను. శ్రీధరుఁడు భోజనమునకులేచెను. కామపాలునకటనుండి లేవనిష్టములేదు. కాని మామ చూచుటచే తానును లేవవలసివచ్చెను. ఆతఁడుమామతో లోనికిబోవుచు నామె నొకమారుచూడవలయునని తనచేరుమాలును నేల విడిచి దానిని దీయునెపంబున వెనుదిరిగి మధుమతినిగాంచి మందహాసముజేసెను. వానిచేష్టనుజూడ నామెకు నవ్వువచ్చెను

---

## — ఇరువదియారవ ప్రకరణము —

దురాశాపిశాచమెవని నావేశించునో వాఁడెంతెంత ఘోరకార్యములైనను జేయుచుండును. దానిబలమును గనుగొనుటకెవ్వనికిని శక్యముకాదు. దానిరూపమతిభయంకరము. దానికృత్యము లతిదారుణంబులు. దానికి క్రౌర్యమాత్రమే మిత్రము. దానినది సర్వదా కనిపెట్టుకొని యుండును. దా

నెవండారాధించునో వానియెడనది మిక్కిలి ప్రసన్నురా లగును. దానికిని దయాదాక్షిణ్యములు శూన్యములు. ప్రేమ దానిదరికి రావెరచుచుండును. ఆలుమగలకును, అన్నదమ్ము లకును, తలిదండ్రులకు నపత్యమునకును గూడ భేదభావమును బుట్టించును. దానిప్రభావ మప్రతిహతమైనది. ఆలిని మగ డును, మగనినాలియును, తండ్రినికొడుకును, కొడుకుతండ్రిని, అన్నను తమ్ముడును, తమ్ముడన్నయును జంపుచుందురు. ప్రాణ ములనుదీయుటలో దానికణుమాత్రమును భీతిలేదు. కలకల లాడుచు, నవ్వుచు నానందముగనుండు ప్రాణియొనది నిమిష ములో నల్లనై రక్తహీనమై చేష్టదక్కియుండునటుల నొనరిం చును. దానికి నాస్తికము శరణ్యంబు. స్వస్వరూపజ్ఞానము శూన్యము. పాతకు లీపిశాచమును దరికిజేరనీయకుందురు గాక!—— ఇప్పుడిది ఉత్తరహిందూస్థానములో ఢిల్లీనగరంబున దిరుగుచున్నయది. దానికి స్వాతిశయము మెండుగ గలదు. స్వాగతమొసంగిననాని యది యావేశింపదు. అది యిప్పుడెవరి నోగాని గుర్తించుచుండెను. దానికెవండో స్వాగతమొసంగు చున్నాడు. అతడల్లాయుద్దీన్. ఆమెసంతోషముతో నాతని నావేశించెను. భళిరా! ఏమి దానిప్రభావము! అల్లాయుద్దీను నకు డెబ్బదేండ్లవయస్సుగల పెదతండ్రి కలడు. ఆతనిపేరు జలాలుద్దీన్. ఆతనినిజంపి ఢిల్లీసింహాసనమెక్కవలయునని, అల్లా యుద్దీనునకు పేరాసజనించెను. జలాలుద్దీన్ వృద్ధుడు. యుద్ధము

నంపుభిగాలేదు. ఈతనినిజంపుటలో నల్లాయుద్దీనెక్కుడు కష్ట మేమియును బడలేదు. తనయాంతరంగికభటులచే నాతనిజంపించెను. అంతనల్లాయుద్దీన్ ఢిల్లీసింహాసనముపైకి చెంగుమని యొకగంతువైచి య దధివసించెను. చక్రవర్తియయ్యెను. ఆతడింతటితో దృప్తినందియుండలేదు. తనపెత్తండ్రికొడుకులను బరిమార్ప సంకల్పించినాడు. వారలుబ్రతికియుండిన తన చక్రవర్తిపదవికి హానికలుగజేతురను విచారమాతని నావరించెను. అప్పుడు జలాలుద్దీన్ కొడుకులు ముల్తానులోనుండిరి. వారలజంపుటకిదేతరుణమని తలంచెను. అదాటునముల్తానునకు సైన్యములనంపి వారలజంపించెను. ఈబలిదానముచే నాతని యాశాపిశాచము తృప్తినందలేదు ఆకాలమున మంగోలియాజాతివారు సింధుదేశంబును బాలించుచుండిరి. సైన్యములనంపి వారల నాదేశంబునుండి బాఱదోలెను. క్రమక్రమంబుగ నాతనికి రాజ్యతృష్ణహెచ్చెను. దురాశ ఆతనినిఢిల్లీసింహాసనమున గంతులువేయించుచుండెను. ఆతడు చిందులు తొక్కుచు, నుత్తమాంగంబును పైకెత్తి నలుదిక్కులను బాఱజూచెను. ఘూర్జరదేశమాతని కంటబడియెను. ఆదృష్టిపాతముచే ఘూర్జరము గడగడవడంకనారంభించెను. లాభమేమున్నది? అధికసైన్యములనంపి ఘూర్జరమును కైవశమొనరించుకొనియెను. ఇచట మల్లిక్ కాఫురను యోధుడు, బానిసగబట్టుకొని ఢిల్లీకి గొంపోబడియెను. ఇతడు క్రమంబుగ తన

సామర్థ్యమున నల్లాయుద్దీన్ సైన్యంబున కధ్యక్షుడై పేరునడ సెను. ఇట్లుండ మఱల మంగోలియాజాతివారు ఢిల్లీనిముట్ట డించెను. ఘోరయుద్ధమునరించి వారలబాఱదోలెను. ఈ జయముతో నాతండు మైమఱచినాడు. ఆశాపిశాచము నవ్వుచు నొక్కటికటు ప్రవఱచెను ఆతడదరిపడిలేచి యాదేవతనారా ధించినఆమె ప్రసన్నురాలయ్యెను. ఆహా! ఆతడప్పుడు భారతభూభాగంబునంనంతటను, ఏకసామ్రాజ్యమును, ఏకమత మును నెలకొలుపవలెనని తలంచెను. ఇది మిక్కిలి క్రూరమైన తలంపు. భయానకము. శాంతములై దాక్షిణ్యముల కు నెలవులై, సత్యధర్మంబుల కునికిపట్టులైయొప్పు హిందూ సామ్రాజ్యముల కీతలంపు చాలయపాయకరమైనది. దేశశాం తికి మిక్కిలిభంగకరము. అల్లాయుద్దీన్ మిక్కిలియాలోచనా పరుడు. భరతఖండంబునందంతటను మహమ్మదీయమతము స్థాపించుటకష్టమని తలంచెను. హిందూదేశమున మతముల తోఁ బ్రసక్తిగలుగ జేసికొనిన, చక్రవర్తుల కపాయకరమని తెలిసికొని యాతలంపువదలుకొనియెను. అప్పుడాతఁడు దక్షిణ హిందూస్థానమునంతను జయింపవలెనని సంకల్పించెను. ఇదివ రకే దేవగిరిజయింపబడియున్నది. ఇప్పుడింక త్రిలింగదేశముపయి నీతనికన్నుపడినది. నేర్పరులయిన చారులనిదివరకే కొందఱను బంపియున్నాఁడు. ఈమధ్యను బ్రహ్మనందునిచే వారలు పట్టు వడుట నచ్చటిసంగతులేమియును తెలియరాలేదు. మఱల

గొండఱగూఢచారులనుబంపి యోరుగల్లు రహస్యంబులను దెలియసంకల్పించుకొనియెను. ఆతనినావేశించిన దురాశా పిశాచము కేవలరాజ్యతృష్ణతోనే తృప్తినందనీయక, మానినీ మానంబులగూడ నపహరింపఁ బ్రోత్సాహపఱచెను. ఆతనికి స్త్రీవాంఛజనించెను. ఈకూరభుజంగునిదృష్టి రాజపుత్ర సింహమును, చిత్తోడుదుర్గమున కధిపతియు,భీమసింహునిసహ ధర్మచారిణియగుపద్మినిపై బడియెను. ఆసాధ్వినాతఁడు హరింప దలచెను. హర, హర. హా!ఎంతపాపుతలంపు. ఆమెసౌందర్య మును ఈకుత్సితుఁడువిని యాసాధ్వినాసించెను. పద్మిని త్రైలోక్యసుందరి. ఈకఱకతుఱక నీమెగ్గాంచి యుద్రే కము నాపుకొనలేక గొప్పసైన్యమును వెంటదీసికొనిచిత్తోడు దుర్గముపై దండెత్తిబోయెను. ఇటుపైని కథాభాగము మన కథకు సంబంధించినదికాదుకావున నంతటితో నీభాగమును బాఠకులకు వదలుచున్నాను.



## —ఇరువదియేడవప్రకరణము.—

పద్మినినిహరింప, చిత్తోడుదుర్గముపై దండెత్తిబోయిన అల్లాయుద్దీన్ చిత్తోడుదుర్గమును ముట్టడించి కొన్నిదినములు గడచినవెనుక, రసపుత్రులచే పరాభవింపబడి, మరల ఢిల్లీచేరు కొనియెను. ఇటఢిల్లీలో రాత్రులుదీపములుపెట్టనదిమొదలర్ధ

రాత్రివరకును, పకీరులుదిఱుగుచు దిరిపె మెత్తుకొనుచుందురు. కొందరు, అల్లాయుద్దీన్ అల్లాయొక్క యపరావతారమను స్తుతిగీతములను బాడుచు ద్రవ్యమార్జించుచుండిరి. కొందరు నిజమైన భక్తిగీతములనే బాడుచు నెట్లో పొట్టపోషించుకొనుచుండిరి. నాలుగుగడియలరాత్రియైనది. ఒకపకీరు రాజవీధిలో దీపపుస్తంభముకడనిలిచి భగవత్కీర్తనలను గానమొనరించుచుండెను. శ్రావ్యమగు నింతటిమధురగాన మెప్పుడును ఢిల్లీపౌరులు విని యుండలేదు. చల్లని రాత్రిసమయమున యమృతసోనల వెదజల్లు నాగానము నలుదిక్కులఁ బ్రసరించి, చుట్టుప్రక్కల ప్రయాణముజేయు వందలకొలదిజనుల నాకర్షించెను. వందలకొలది జనులుచుట్టునుమూగిరి. అతడు మైమఱచి బాడుచుండెను. ఇంత జనముచుట్టును మూగినను నొకశబ్దమైనను లేదు. చూడవచ్చిన జనమాతని పాదములకడ డబ్బులవర్షమునుగురుపించుచుండిరి. ఒకగడియలో నొకడబ్బులరాసి యేర్పడినది. ఇదియాతఁడెరుంగడు. తన్మయుడై బాడుచునే యుండెను. అతని గానచాతుర్యమేగాక రూపమాధుర్యము గూడ జనుల వశీకృతులఁజేయుచుండెను. దబ్బపండువంటి పచ్చనిశరీరచ్ఛాయ, నూనూగుమీసమును, నల్లనిచిన్నిగడ్డమునగలయాతనిసుందరరూపమిరువదేండ్లకు మించనివయస్సును ధ్రువపరచుచుండెను. ఎందరోఫకీరు లాతనిచుట్టును మూగిరి. జాముదాత్రియైనది. గానమువర్ధిలుచునేయుండెను. ఇట్లుండ

నింతలోనొక యాత్రికుడు గుఱ్ఱమును వడివడిగాఱు వెత్తించుచు వచ్చిగానము చెవిసోక తటాలునగుఱ్ఱమునాపి దృఢకాయుండగు నొకపురుషుడాగుఱ్ఱమునుండి గుభాలున నేలకుఱికెను. గుఱ్ఱపుడెక్కల టకటకారావమునకు జనులు వెనుదిరిగిచూచిరి. గానమాగెను. గుఱ్ఱమునుండిదిగినపురుషుడు గుంపులో జొఱబడి ఫకీరును సమీపించెను. గానమాగుటచే జనులుగృహాభిముఖులై పోయిరి. కొంతవడి కాఫకీరుచుట్టుపక్కలనిలిచియున్న ఫకీరులబిలిచి ప్రోగుపడిన యాద్రవ్యమంతయును వారలకు దోసిళ్ళతో బంచియిచ్చెను. ఫకీరులువంగివంగి సలాములుచేసి తమదారింబోయిరి. తుదకానొక్కపురుషుడును, ఫకీరునుమిగిలిరి. ప్రోగుపడిన ద్రవ్యమంతయును, ఫకీరులకు దానమిచ్చుటయు, జగన్మోహనకరమైన యాగానమాధుర్యమును, దర్శనీయమగు నాలేజవ్వనంపు మధురరూపమును గాంచి కొత్తపురుషుడు ఫకీరునందేదయోయొక గొప్పమహిమయున్నట్లుతలంచి, ఫకీరునకు సలాములొనరించి, వినయముతో నిట్లనియె. స్వామీ! అల్లామీయందు మూర్తిభవించినట్లు కనబడుచున్నయది. నిండుయౌవనసములో దేశారాధనకొఱకింతటిత్యాగ మొనరించుట శ్లాఘనీయము. భారతదేశమునందతటను మహమ్మదీయ రాజ్యమును స్థాపించగలిగినప్పుడే ఫకీరులకు సంపూర్ణరక్షణ కలుగును. ఆపనికిపుడు చక్రవర్తిపూనుకొనినాడు. నాదొకప్రశ్న యున్నది. అనుజ్ఞ

యయ్యెనేని విన్నవించుకొందును. అతనిమాటలకు ఫకీరుచిరు నవ్వునవ్వి, భాయీ! నీప్రశ్న నాకర్థమైనది. చక్రవర్తిపూను కొనినపనికి నీవుదోడుపడుచుండుటచే అల్లాదయకుఁ బాత్రుడ వగుచున్నావు. నీవుకోటలోనికి బోవుచున్నానని తెలిసికొంటిని. నీకొఱకచట మల్లిక్ ఖాఫుర్ వేచియున్నాడు. భాయీ! నీవోరు గల్లుపయ్యాణవిషయమునుగూర్చి కాదా? ప్రశ్నించుచుంటివి?

పురు—ఆశ్చర్యముతో, ఔను స్వామి.

ఫకీరు—నీయుద్దేశ్యమును విస్పష్టముగా చెప్పుటకిదే సమయము. ఈశుభముహూర్తమున నీకోరికలీడేరగలవు. ఈ శాంతసమయమున అల్లాచల్లనిదృష్టులను ప్రసరించుచున్నాను

పురు—నాయదృష్టము బాగుండబట్టియే, తలవని తలపుగా మీదర్శనములభించినది. నా పేరు ముస్తఫాలీ. నేను చక్రవర్తికాంతరంగిక కార్యదర్శిని.

ఫకీ—ఔను. నిన్ను నేను తెలిసికొంటిని. నీవుమిక్కిలి పౌరుషవంతుడవు. అల్లాయుద్దీనుతోఁగూడ దేవగిరికిబోయి జయమునుగాంచివచ్చితివి. అల్లాయుద్దీనునీకు జాగీరిచ్చినాడు. నీచేతిలోకొంత యశ్వసైన్యముకూడ నున్నది. దక్షిణహిందూ స్థానమునగూడ జాగీరుదారుడవు కానున్నావు.

ముస్త—ఫకీరుజీ! సలామ్. మీరుజెప్పినదంతయు యథార్థము. నామనసులోనున్న భావిసంపత్తును నీవుసూచించితిరి. నిజముగ మీరు అల్లాయొక్క దూతయనుటకు సందేహములేదు

నేనీరాత్రి చారుడనుగా యోరుగల్లు పోవుచున్నాను. ఓరుగల్లురహస్యములన్నియు గనుగొని తిరిగివచ్చి త్రోవలో మల్లిక్ ఖాఫురుని కలుసుకొని యాతనితోగూడ నోరుగల్లు ముట్టడింప నిశ్చయించితిని. స్వామీ ! ఈప్రయాణములో జయముకలుగున ట్లాశీర్వదింపుడు.

ఫకీ—ఓయీ! ముస్తఫా ! నిన్ను, అల్లాయే ఆశీర్వదించియున్నాడు. నీకు జయమునిశ్చయము. కాని, నినొ్నకటి ప్రశ్నించు చుంటిని. సర్దార్ జఫరాలీఖానుడును, అబ్దుల్ ఖరీముడుగూడ నచటనున్నారుగదా? నీవేలయిపుడు ముందుగా పోవు చుంటివి?

ము|స్త—ఫకీరుజీ! వారచటనన్న మాటనిజమే. కారణ మేమియో తెలియదుగాని యచ్చటిసమాచారము లేమియును తెలియవచ్చుటలేదు. వారేదియో చిక్కులలోదగులొ్కని యుందురు. అందుకుగాను ముందు చక్రవర్తి నన్నచటికి పంపు చున్నాడు.

ఫకీ—భాయీ ! ముస్తఫా ! నీవు వెళ్లుచున్నావుకాని హిందువులసహాయములేనిదే యోరుగల్లురహస్యములను నీవు దెలిసికొనలేవు.

ముస్త—మీరు శెలవిచ్చినదినిజము. దేవగిరికాపరస్థులగు భీమణజయదేవులను మారువేషములతో నాతోగూడ తీసికొనిపోవుచున్నాను. వారలదిమొదట యోరుగల్లే!

ఫకీ— చహా బాష్, నీకు మంచిసహాయమే దొరికినది. వారలవలన గుట్టంతయు నీకుఁ దెలియగలదు.

అని యొకగానమును పాడినాడు ఫకీరు. ఆగానములో ముస్తఫా, లీనమైపోయినాడు. గానమాగినది. ముస్తఫా చేతులుజోడించి, స్వామీ! నీకంఠమున నమృతవీచికలున్నవి. నీగానామృతమును గోరినవారలకు, రాచకార్యములును, సాంసారికవిషయములునుగూడ జ్ఞప్తికిరావు. నీవు దేవాంశ సంభూతుడవు. స్వామీ! నాదొకమనవి. మన్నింపవలయును. మీరొకపర్యాయము నాతోగూడ కోటకురావలయును. చక్రవర్తిగౌరవమునకు, మీరు పాత్రులుకావలసియున్నది. అన, ఫకీరునవ్వుచు, భాయీ! మమ్మల్లామన్నించిన చాలును. వేరే, చక్రవర్తిశ్రమయిచ్చుటెందులకు? ఇపుడు నేను కోటకువచ్చుట పొసగదు. అన ముస్తఫా నవ్వుచు, మీయుద్దేశ్యమెట్లో యట్లనేకానిండు. కాని మీరునాతోవచ్చి కోట గుమ్మముకడ విశ్రమింపప్రార్థన. అన ఫకీరు తలయూచి ముస్తఫాతోగూడ కోటగుమ్మముకడకుజని, అటనొకచెట్టు క్రింద గూర్చుండెను. ముస్తఫా కోటలోనికేగెను. ఇప్పటికి రెండుయామములరాత్రియైనది. అయిననింకను కోటలోరహస్యాలోచనలు జరుగుచునేయుండెను. నలుగురు మహమ్మదీయులొక వసారాలోగూర్చుండి గుసగుసలాడుచుండిరి. వారిలోనొకడుముస్తాఫా. రెండవవాడు మల్లిక్ కాఫుర్. మిగిలిన

మును మహమ్మదీయవేషములతోనున్న భీషణ, జయ దేవులు. ఇంతలోనాయర్ధరాత్రమున నాగాఢాంధకారమును ఛేదించుకొని కోటగుమ్మములనుదాటి యొకమధురగాన మమృతబిందువులను వెదజల్లుచు వీరల చెవులజొచ్చెను. మంతనములాగిపోయెను. తలయెత్తి చెవులరిక్కపొడుచుకొని విననారంభించిరి. మోడులకిగురింపఁజేయు నాగానము— నల్లజాతినిగఱగించు నాగానము—'మానవహృదయములవివశము లనఁగా జేసెనన నొకలెక్కయా? కొంతవడికి మల్లిక్ కాఫుర్ ముస్తఫాలీ ఆగానమెవరిదనెను. దానికి ముస్తఫాలీ, మల్లిక్ కాఫుర్ ఆతడొక ఫకీరు. త్రికాలవేది. దేవాంశసంభూతుడు. మనుష్యునిజూచినతోడనే యాతని భూతభవిష్యద్వర్తమాన ముల బూసగుచ్చినట్లు చెప్పివేయును. నావిషయములో నున్న దున్నట్లు చెప్పినాడు. మీరాతని దర్శనముచేయుట మంచిది. అన మల్లిక్ కాఫురు వల్లెయన చాలరాత్రియగుటచే నందఱునులేచిరి. కొన్నినిమిషములకు కోటగుమ్మముదాటి ఫకీరునుసమీపించిరి. కోటతలుపులు బంధింపబడియెను. ఫకీరు పాడుచునేయుండెను. గోపాలకృష్ణుడావులమందలలో పూర్వము పాడియుండెనేమోగాని, యింతటిమధురగానమును వీరలు వినియుండలేదు. కొంతవడికి గానమాగెను. మల్లిక్ కాఫురు మొళినినంచి ఫకీరునకుఁ సలాముచేసెను. ఫకీరుమల్లికాఫురు దగ్గఱకు వచ్చి చేతితోవీపుమీదతట్టి ఖాయీ! మల్లిఖాఫురు!

నీవుముసల్మానుసామ్రాజ్యమునకు పేరు తేనై యున్నావు. దక్షిణహిందూస్థానమునీకై వశముకాకున్నది. నీకు నేటినుండి శుభదినము ప్రారంభమైనవి. ముస్తఫాలీ మహాయోధుడు. అల్లాయందుభక్తికలదు. మీరిద్దరునుకలిసి కృష్ణార్జునులవతారణమునగీర్తినిగణింతురు. మీవంటిమతాభిమానులుండినగాని మాబోటిఫకీరులకు స్థానమెక్కడనుండును.— మల్లిక్ కాఫూరు! ఇటుచూడుము. నీయదృష్టమునకు మార్గదర్శకులుగా యీజైనులిద్దఱును సమయమునకు నీకుదొరికిరి. ఓరుగల్లు యొక్క గుట్టంతయును వీరలవలన నీవు తెలిసికొందువు. వీరు ప్రతాపరుద్రునిచే నవమానింపఁబడిరి. దీనితో వీరిపగదీరుట యేగాక నీవలనగొప్పజాగీరుదారులు కాగలరు.

మల్లి — ఫకీరుజీ! చూచినదేతడవుగ యీవద్భుతాంతమును వినిపించితిరి. నిజముగ మీరు దేవాంశసంభూతులని నమ్ముతిని. ఈదండయాత్రిలో మీరు మమ్ము సర్వదా కాపాడుచుండవలెను.

ఫకీ — అల్లాయే నిన్నుగాపాడుచున్నాడు. అయిన నావలన నీకుగావలసి సహాయమెద్ది?

మల్లి — నేనొక ప్రచండసైన్యమును గూర్చుకొని మా సమురోజులలోబయలుదేఱనై యున్నాను. ముస్తఫాలీక్రొత్తవాడు. భీషణజయదేవులంతటి ధైర్యవంతులు కారు. కావున తాముదయయుంచివీరలతోఓరుగల్లునకుబోయి కాపాడుచుండవలెను.

ఫకీ—భాయీ? ఫకీరునకు నా కెందులకీ గొడవయంతా

మల్లి—తామట్లు నుడువజనదు. మహాప్రభుదీయసామ్రాజ్యము విస్తరించినప్పుడే ఫకీరులకు రక్షణము గలుగును. మసీదులలో నల్లాకు ప్రార్థన లెక్కుడుగా జరుగును.

ఫకీ—ఫకీరులయందు నీకుగల భక్తికి సంతోసించితిని. అటులనే పోయెదను. కాని నీవిప్పుడెంత సైన్యముతో బోనైయున్నావు. నీసైన్యమెదూరిపమైనది.

మల్లి—లక్షసైన్యముతో. అంతయునశ్వసైన్యమే. వెనుకనుండి ంకనుకొంతపదాతిసైన్యము వచ్చునట్లు ఏర్పాటు చేసితిని.

ఫకీ—భలీ! నీమెలుకువకు సంతసించితిని. వీరలతో బోవుటయే తప్పనిసరియగుచో నాకొకగుఱ్ఱమునిప్పించుము.

మల్లి—మీకు గావలసినవన్నియును ముస్తఫాలీయిచ్చుచుండును. ఈసామ్రాజ్యమే మీయదిగా తలంపుడు.

ఫ—భాయీ! నా కెందులకీసామ్రాజ్యము. పొట్టకు బట్టెడోగిరమున్న నల్లా సేవజేసికొనుచుందును. ఎందుకీప్రసంగమిప్పుడు. చూడుము భాయీ? మీరుముఫ్ఫురును బొంగలీవేషములను వేయవలెను. లేకున్న నొరులకండ్లలో నిశ్చయముగ దిరుగుటకష్టము.

ముస్త—ఔను. మీయూహమంచిది. ఈవేషమును ధరించిన నిక యనుమానమునకు దావుండదు.

మల్లి — ఫకీరుజీ! ప్రయాణమునకు మీ రేముహూర్తమును బెట్టుదురు.

ఫకీ—ఇప్పటికిమూడుయామములరాత్రికావచ్చినది. నాల్గవయామమున ప్రయాణమునకు బాగుగనున్నది కావున సర్వమును సిద్ధముచేయుడు.

ముస్త—సర్వము సంసిద్ధముగ నేయున్నది. మీ మువేషములనుమార్చుటొక్కటియేపని. ఒకగడియలోనాపనిపూర్తిజేసెదము. ఫకీరుజీ! మీరునాతోగూడమాయింటికివచ్చెదరా

ఫకీ—నేను పట్టణమునకావలనున్న తటాకముకడనుండెదను. మీరటకురండు.

అనిపలికి ఫకీరటనుండిపోయెను. మల్లిక్ కాఫురు తన బసకుపోయెను. ముస్తఫాయును, భీమవిజయదేవులును, ముస్తఫాబసకువెళ్లి వేషములనుమార్చుకొని గుఱ్ఱములనెక్కిరి. వేఱొకగుఱ్ఱమును ఫకీరుకొఱకు సిద్ధముచేసిరి. అందఱునుకలిసి పట్టణమువెలుపలనున్న తటాకముకడకరిగిరి. అటఫకీరుస్నానముజేసినమాజుచేసికొనుచుండెను. నమాజుముగిసినవెనుక ఫకీరు కూడ గుఱ్ఱము నెక్కెను. అప్పుడందరును గుఱ్ఱములకు సంజ్ఞజేసిరి. గుఱ్ఱములుపఱుగువారెను.

—

## —. ఇరువదియెనిమిదవ ప్రకరణము .—



ఇట శ్రీధరునియింట మధుమతి మంచముపై బరుండియుండెను. కొంతవడికి నామె లేచి కనులువిచ్చి చూచి యాత్రముతో మాధవాయని బిలచెను. మాధవుడు మాటలాడక పోవుటచే మధుమతిమనస్సు చిన్నవోయెను. దుఃఖము హెచ్చెను కనుగవ బాష్పబిందువులచే నార్ద్రమైయుండెను. చీఱచెఱగుచే కనులనుపూసికొని వాపోవదొడగెను. మాధవుఁడు మాటలాడలేదు. మధుమతి లేచికూర్చుని హృదయేశ్వరాయని బిలిచెను. మాధవుఁడు మాటలాడలేదు మధుమతి మరలమాధవాయని బిలచెను. దానికినిగూడ సమాధానములేదు. మధుమతికినవ్వువచ్చెను. ఒక చిన్న మందహాసమొనరించి, మాధవుని ముంగురులను తనచేదమ్మిచే దిద్దదొడంగెను. అతనిముంగురులు చెదఱియుండలేదు. అవి దిద్దబడియేయుండెను. మాధవుఁడు చేతనప్రతిమవలె గనుపట్టుచుండెను.— నిజముగ నాతఁడు చేతనుఁడైన మాధవుఁడు కాఁడు. అది మాధవుని చిత్రపటము. మోహమా మాధవరూపపటంబుతో మాటలాడబోయిన సమాధానమెట్లువచ్చును. ఆమె దృష్టియంతయు మాధవునిపై నేయుండుటచే నదాటున నామాధవచిత్రపటమును గాంచి నిజముగ మాధవుఁడనియే తలంచి మాధవాయని బిలువనారంభించెను.

ఈమాధవచిత్రపట మిదివఱకు శ్రీధరునిగదిలోనున్న యది. దానిని తనగదిలోనికి తీసికొనిరమ్మని కోకిలతో జెప్పెను. ఆసమయముననే భాస్కరనాయనంగారువచ్చుటచే కోకిల, ఆ! అట్లనే! యనిపలికి వారియుపచారమునకు బోయెను. కొంతవడికి మధుమతి మాధవచింతనామృత మత్తమధుపమానసయై, మైమఱచి మంచముపై బరుండెను. ఇంతలోకోకిల యాపనినిచక్కజేసుకొని శ్రీధరుని గదినుండి మాధవపటంబును దెచ్చి మధుమతిపరుండియుండుటగాంచి యాపటమును మంచముపైనుంచి తనపనిమీద బోయెను. అంతకొంతవడికి మధుమతిమేల్కని యాపటంబునుగాంచి మాధవుడను భ్రాంతితో చిత్రపటముతోనట్లు మాటలాడ దొడంగెను.

ఈచేష్టనంతనుజూచుచునాగదిలోనొకమూలగూర్చుండియున్న విశ్వాసరాయుడు, అమ్మా! మధుమతీ! చూడంజూడ నీకుఁబిచ్చియెత్తుచున్నది. అనియెను.—(మధుమతి తుల్లిపడి తాతనుజూచి తొట్రుపాటుతో)

మధు—తాతా! ఈపటమిక్కడ కెవ్వరుదెచ్చిరి? ఇదెంతమనోహరముగానున్నదో చూడుము. దీని నాగోడకు దగిలించెదవా?

విశ్వా—తాతకానస్గలుచేర్పుచున్నావు. కోకిలచే నీపటమునిక్కడకు దెప్పించుకొని నాపటమిటకెవ్వరు తెచ్చిరని యడిగినంతమాత్రమున నీకాపటముతో జోక్యములేదను

కొందుననుకొంటివా యేమి? నీవుకోకిలతో పటమును తెమ్మని చెప్పుటయు, భాస్కరనాయనంగారువచ్చుటచే లోనికిబోయి మఱలకొంతవడికి నాపటమును కోకిలయిక్కడకు తెచ్చుటయు నీవునిద్రపోవుచుండుటచే నాపటమును మంచముమీఁదనుంచి పోవుటయు నేనుచూచుచునేయున్నాను. అపటమెదురుగనున్న నీకుఁబిచ్చియెత్తును. ఆపటమిటు తెమ్ము. మఱలనీతండ్రిగదిలో తగిలించివచ్చెదను.

అని పలికి మెల్లఁగ లేచి యామెచేతనున్న పటమును పుచ్చుకొనపోవుచుండెను. మధుమతిదీనస్వరముతో, తాతా! నామాధవుని రూపపటమైన నిచ్చటనుంచవా? యనికనులనీరునించెను. ఆబిడ్డవాక్యమునకాతని హృదయము నీరయ్యెను. ఆతని కడుగుముందునకు బడుటలేదు. రెండశ్రుబిందువులను నేలవిడిచి యాపటమునచ్చటనే గోడకుతగిలించెను.

మధు — తాతా! మాధవునినిజరూపమునుజూచుభాగ్యమునాకికగలుగదా? నేటికి రెండువత్సరములుగడచినను నాతనిజాడగానరాలేదు. మాయమ్మ నావివాహమునకై చాల త్వరపడుచున్నది. ఈరోజుననే భాస్కరనాయనమామగూడ వచ్చినారు. నేడో రేపో, అయ్యగారి నెట్లో సమ్మతింపఁజేసి వివాహమునిశ్చయపరతురు. నేనేమిచేయుదు. దిక్కెయ్యది? బ్రహ్మదేవరనాకిట్టి యిక్కట్లుపెట్టెను? కట్టా? యేమిజరుగనైయున్నదో గద?

విశ్వా—బిడ్డా ! యేలవగచెదవు. మాధవునిజాడ తెలియకుండుటచే మిక్కిలివిచారించుచున్నాను. ఇంతకును విధి విధానమిట్లుండ మనమేమిచేయగలము. నిన్నుగూడి సుఖించు భాగ్యము మాధవునకులేదు. ఏమిచేయుదు. నీవవివాహితవు గానుండిన, తండ్రికిసలపంపవలె. అగోచరంబగు ఫలమునకై యెంతకాలమని నిరీక్షించుట. పితృసంతోషమునకయి దృశ్య ఫలంబులోనుత్తమంబగునొకఫలంబునగ్రహించుట ధర్మము నుకొనియెద. ఇంతకును నీవవివేకినిగావుగదా !

మధు—ఛీ! అన్యఫలము నపేక్షించుటయా! అదిపోన గదు. అయిన నాయుత్తమఫలమేదియో నిరూపింపుము.

విశ్వా—బాగుగా నాలోచించుకొనుము. గోచరఫలంబులలో కామపాల్

మధు—అయ్యో తాతా ! ఆమాటనుచ్చరింపకుము. అదియెన్నటికిని పొసగనేరదు.

విశ్వా—నీనటుల తిరస్కరించి యుండఅకును విరోధివగుటయేకాని నీవందుజయమందనేరవు. నీకునమ్మతిలేకపోయినను, నీవాతనిభార్యవగుట తప్పనిపరిస్థితియేర్పడినది. నీతల్లి నిన్నాతనికిందప్ప నితరులకీయనీయదు. ఇట్టిస్థితిలోనీవు తృప్తి చెందుటయే శ్రేయంబగు లేకున్న విపత్తులుప్పతిల్లును.

మధు—తాతా ! నాయొడలు కంపమొందుచున్నయది. నాహృదయముదహించుకొనిపోవుచున్నది. నేనుకామ

పాలునకు భార్యనగుటెప్పుడా! మాధవుఁడు జీవించియుండె మధుమతిమనమన్న్యలపై వ్రాలదు. ఛీ ? మాధవపత్నికిమా రుమనువుగల్లునరా ! అయ్యో ! నాకుస్మృతి తప్పుచున్నది. నేను నిదురబోయెదను, తాతా ! నిప్పులోనికిబోయి భుజించి వేగమురమ్ము.—అని మధుమతి శయ్యపయి మేను వ్రాల్చి కనులుమూసెను.

విషాదముతో విశ్వాసరాయుఁడు లోనికేగెను. ఆమె ముఖమును కపోలపాలియు, సాంద్రస్వేదాంబు కణములచే నొప్పారుచుండెను. గవాక్షములన్నియుమూయబడియుండెను. దక్షిణపువసారాలోనికి బోవుద్వారముమాత్ర మొకతెక్క తెరువబడియుండెను. అనిలుఁడచలుఁడైయుండెను, ఇట్టిస్థితిలో నొకవింతయగు చిత్రదృశ్యము జూడనయ్యెను. ఆమెముంగు రులుచలించుచుండెను. పయ్యెదచెఱగు కొంచెమిటునటును గదలుచుండెను. స్వేదకణంబులు క్రమంబుగ హరించుచుండెను. హస్తాబ్జంబులు గాఢాలింగన మొనరించుకొని యామెహృదయమున విశ్రాంతినందుచుండెను. ఆమె గాఢ ముగనిద్రబోవుచుండెను—అటుచూడుడు! ఒక సుందరపురు షుడా లతాంగిమంచముకడనిలువంబడి యోష్ఠపుటంబునుండి మందహాసముగంతులిడుచుండ నొకవ్యజనమునుచేబూని యా మెవదనముద మందమందముగవీచుచు, నానందించుచుండెను ఆమెవదన సౌందర్యశ్రీ యాతనిదిక్కువలయ బులచే నర్పిం పఁబడుచుండె. అతఁడామెయందముతో దనయందమునుపోల్చి

చూచుకొనుచుండెను. ఆతడట్లువిసరుచుండ సావ్యజనాగ్రి
మామెహస్తమునకు దగిలి యామెనిద్రా సుఖమునకుభంగము
గలుగజేసెను. అంతమధుమతి శయ్యనుండులికిపడిలేచి బెదరిన
చూపులతో నెదుట కామపాలునిగాంచెచు, కామపాలుడిం
కను విసరుచునేయుండెను. మధుమతియొకనిట్టూర్పువిడచి ప
య్యెదసవరించుకొనియెను—ఆతనిసంతోషమేమని చెప్పుదును
వందులకోగాని యాతని మనస్సు పొంగిపోవుచుండెను. మం
దహాసమంకురించినది—ఆపరిభవమునకామెవదనమారక్తము
య్యెను. కనులెఱ్ఱనయ్యెను. దంష్ట్రపడపటకొరుకుచునిట్టులనియె
మధు—నాకు విసరవలదు. నామేనుదహించుకొనిపో
వుచున్నది. ఆవ్యజనవాతము వేడిగాడ్పుల మించియున్నది.
ఆమందహాసమాతపమును ధిక్కరించుచున్నది. విాకునమ
స్కారము. వేగమావలకు దొలగిపొండు.నాప్రార్థనయాజ్ఞగా
మారకుండ నా—విా—మర్యాదలను గాపాడుకు.
కామ—మధుమతీ ! ఏమిది? నీవుచాలవింతగా మా
టలాడుచున్నావు. కలగంటివా యేమి!లేక నిద్రాభంగము
గావించితినని కిన్కబూనితివా?
మధు—ఔను. నాబ్రతుకే నాకు చాలవింతగానున్న
ది. బ్రతుకే కల్లయైనప్పుడు కలలకేమిలోటు. నిద్రాభంగమై
ననేగాక ! మర్యాదభంగములేకుండ తొలంగుటమంచిది.
కామ—నీవుచాల చీకాకుగానున్నావు. నీకీయవస్థ

యోంగలిగెనో తెలియదు. హృదయేశ్వరీ? నే నెవడనో యెరుగుదువా ?

మధు—ఇటువంటి వినీతిచేష్టలు మాఁవతులకు చికాకు గాకుండ నెట్లుండును. మిమ్ముల నెరుంగకుండ నుండుటెట్లు? దూరముగానుండి మాటలాడుము.

కాను—నీ బేలతనము జూడ నాకు నవ్వు వచ్చుచున్నయది. నీవింత భయస్వభావముగల దానవని నేనెఱుంగను. కామపాలుడు మర్యాదలేని వాడని తలంచుచున్నావు. కామపాలుడట్టివాఁడు కాఁడు. విధ్యుక్తముగ బెండ్లియాడియే నిన్ను గలియును.

మధుమతి మారువలుకలేదు. కామపాలునితో నింతవరకు జర్పించుట నామెకిష్టములేదు. కామపాలుఁడు మధుమతికి తనపై ప్రేమగలదని దలంచుకొనుచుండెను. ఆతడిట్లు భ్రాంతిపడుట యెప్పటికైన ముప్పుదెచ్చునని యామెతలంచెను. ఆతనియందు దనకుఁ బ్రేమలేదని విస్పష్టముగా దెలుపుటయే మంచిదని తలంచెను. ఇట్లుచేసిన నాతఁడు తనపై నాసవదలి తన్ను వేధించుట మానునని యామెతలంపు. ఇదేవిషయమును గూర్చి యామె యోచించుచుండెను.

కామ—మధుమతీ! ఏమది? నీవెద్దియో యోచించుచున్నట్లున్నావు?

మధు—ఔను.

కామ—ఆ యాలోచన నన్నుఁగూర్చియైనదే యైన నేను కృతార్థుఁడను. కామపాలుఁడు ధర్మబాహ్యుఁడని నీవుతలంచుచుండనోపు. ఆయూహను నీవు విడువుము. వివాహము తగినంత శీఘ్రకాలములోనే జఱుగునట్లు ప్రయత్నించుచున్నాను. రేపటిదినముననే ముహూర్త నిశ్చయము చేయబడును.

మధు—అదిపొసగదు. అట్టియాశను బెట్టుకొనకుఁడు.

కామ—నీవింకను భయమునువీడుటలేదు. వివాహమున కాటంకము గల్పింపనెవరి తరము. ప్రాణేశ్వరి!

మధు—[కోపముతో] నన్నట్టిసంబోధన పదముచే బిలువ వలదు.

కామ—మరియేమని పిలువమనియెదవు?

మధు—నాకును నొకపేరు గలదు.

కామ—వివాహసమయమునఁ గదా? యొండొరుల పేరులు చెప్పింతురు? నాఁటిదినంబున నీముద్దుపేరుచే నిన్నుబిలువవలెనని యిప్పుడా పేరున బిలువక దాచుకొంటిని. నీవునాప్రాణంబుల కధీశ్వరివగుటచే ప్రాణేశ్వరి యని బిలిచితిని, ఇందు తప్పేమున్నది?

మధు—అన్యవస్తువును తనవస్తువుగా భావించుటకంటె తప్పేమున్నది?

కామ—అది అన్యవస్తువేయైన నీవనినట్లు తప్పేయ

గును. దానిని కామపాలుడు స్మరింపడు.

మధు—ఇట్లయిన నాడు నాకనులేల మూసితిరి.

కామ—నాప్రియవస్తువును, నేనంటిన దప్పేమి?

మధు—నేను మీప్రియవస్తువు నెట్లగుదును?

కామ—భర్తకు భార్యకన్న ప్రియమైనవస్తు వెద్ది?

మధు—అన్యపత్నిని భార్యయని పిలువవచ్చునా?

కామ—నీవన్యపత్నివా?

మధు—ఔను?

కామ—నీపతి పేరెయ్యది.

మధు—ఆతని పేరుతో బనియేమి? నేనిదివఱకే నాజీవితమునంతను నొకనికి ధారపోసి యుంటిని. నామనం బాతనియందు లగ్నమయ్యెను. ఆతడే నాకుపతి.

కామపాలుని మనస్సులో గందరగోళ మొదయించెను. ఆతడీసంగతి తెలుసుకొనలేదు. దానిని దెలియకుండ గప్పిపుచ్చి, యిట్లనియె.

కామ—నన్ను మోసము జేయజూచుచున్నావు. కామపాలుడు మోసముపోవువాడుకాడు. నేనుగూడ నొకయువతికి నాజీవితమునంతను ధారవోసితిని. ఆమెనుతప్ప నేనితరులను వివాహమాడను. నాపత్ని పేరు నేను నుడువుటకేమియును సందియములేదు. ఆమె పేరు— మధుమతి.

మధుమతి ముఖమెఱ్ఱవడియెను. చూపులో శాంతభావమేమియునులేదు. అధరము కఱచుచుండెను. ఆమెయుత్కంఠముతో నిట్లనియె.—నేనిదే నొక్కి చెప్పుచున్నాను. నాపైమీరాన......అని అలుకుచుండగనే రుక్మిణీశ్యామల లటప్రత్యక్షమైరి. వారలంగాంచి మధుమతి తలవంచెను. కామపాలుని ముఖము వెలవెలబోయెను. ఆతఁడు నెమ్మదిగ జాఱిదిగువకుబోయెను.



## ఇరువదితొమ్మిదవ ప్రకరణము.



శ్యామ—ఏమది కోడలా? మాకామపాలునిపై నలిగితివాయేమి? కోపమునసట్లుంటివేమి?

మధు—[మాఱుపలుకలేదు] తలవంచుకొనియే యుండెను.

రుక్మి—అమ్మా! అట్లువిచారించుచుంటివేమి? కారణమేమియో తెలుపుము.

మధు—దుఃఖమును నాపుకొనలేక తల్లినిగౌగలించుకొని గోలున నేడ్చెను.

రుక్మి—(మధుమతి శిరంబు నిమురుచు) అమ్మా? సంగతేదియో చెప్పుము.

మధు—(రుక్మిణిని గదుచుకొని) అమ్మా? ఈయింట నివసించుట బహుకష్టముగా నున్నది. విశాలాంబయును గలిసి నన్నపవిత్రనుగా జేయజూచుచున్నారు.

రుక్మి—ఏమిటా దుష్కృత్యముతల్లీ! దాపరికముంచక జెప్పుము!

శ్యా—కామపాలు హాస్యము లాడినారాయేమి?

మధు—నన్నాతఁడు సమయము చేజిక్కినప్పుడెల్ల నిర్బంధమొనరించుచున్నాఁడు. నాబ్రతుకు చాలదుర్ఘటముగా నున్నది.

శ్యామ—ఆతడేమనియెను.

మధు—అనరానిదే యనియెను.

శ్యామ—అదేదియో చెప్పకూడదా?

మధు—చెప్పనొప్పను.

శ్యామ—అట్లయిన జెప్పుము.

మధు—చెప్పినప్రయోజన మేమియునులేదు.

శ్యామ—అదేదియో చెప్పినగదా ప్రయోజనమున్నదనియు లేనిదియు తెలియుట.

మధు—ప్రయోజనముండదని నాకు తెలియును.

శ్యామ—ఏమే! ఈవిచిత్రము. నీవు ప్రయోజనములేదన్న మాత్రమున మాకెట్లు విశ్వాసమగు. నీయుద్దేశ్యము నీ మనస్సులోనే బెట్టుకొని పైకేమో బలికిన మాకెట్లు తెలియును?

రుక్మి—వదినా? ఎందుకీ సెడవాదము. అమ్మా? ఏమిజరిగినదో చెప్పుము. నేను విచారించెదను.

మధు—నేనొంటరిగనుండ నాతఁడు నాగదిలోనికివచ్చి నాతో మాటలాడుటయు, నన్ను ని............

రుక్మి—కామపాలుడా?

మధు—అవును.

శ్యామ—ఏమి, యిచ్చకములే? వచ్చినని న్నేమైనం గొట్టెనా? ఏమియో, హాస్యములాడియుండనోపు. ఇంతమాత్రమునకేనా, యీకోపము.

రుక్మి—వదినా? నీవూరకొనుము. వివాహము కానిబిడ్డతో నాతఁడట్లు రహస్యముగ మాటలాడుటయు క్రమముకాదు. ఎవరైన వినిన నపకీర్తి కాదా?

శ్యామ—వదినా! మేనత్తకూతురగుటచే చనువునవచ్చి యేమియో హాస్యములాడినాడు. హాస్యములాడకయే మధుమతి కామపాలునితో గాపురము సేయునా? యేమి?

మధు—నోటికివచ్చినట్లెల్ల మాటలాడిన నేను చెప్పలేను. నాతో నొంటరిగ భాషించుట కాతనికధికారము లేదు.

శ్యామ—కోడలా? కోపపడకుము. కామపాలునిమం గళించెననులే? వివాహమగుమఱకును, హాస్యములాడవద్దని జెప్పెను.

దుర్గ—వదినా? నీకుకోపమువచ్చిన చెప్పలేనుగాని, బిడ్డయొంటరిగనుండ నాతోఁను బిడ్డతోమాటలాడుట తగదు. మీయన్నవిన్న యంగీకరించను జీవాత్మ గలుగును. నీవుమంగ లించినచో, లేకున్న నేనేమంగళించెదను.

శ్యామ—వదినా! పిచ్చిదానవు. నాకుకోపమెందుకు. హాస్యముగ కట్టుంటినిగాని మంగళించకుందునా? కాని, వదినా ఇట్టినిర్బంధముతో వీండ్రనెంతకాల ముంచెదవు. మీయన్న వచ్చియేయున్నారుగదా? నేటి రాత్రి యేదియో నిశ్చయము చేయుము. మాఘమాసము దాటిన మంచిముహూర్తములు దొరకుట కష్టము.

వదినా? యేమిచేయమనియెదవు. మీయన్న దేవగిరికి బోవలసివచ్చుటచే వీలుచిక్కినది కాదు. నేటిరోజున సావకాశముజూచి మాటలాడవలెనని యున్నది. నేను లోనికిబోయెదను. నీవిటనుండెదవా?

శ్యామ—మధుమతి యుండమన్న నుండెదను.

మధు—నానిర్బంధము నీకువలదు.

శ్యామ—ఇందునిర్బంధ మేమున్నది? నేనుండుట నీకిష్టమైన నుండెద.

మధు—నిన్నెప్పుడును సందియములు పీడించుచునే యుండును. వానిని దీర్ప నెవరి తరము?

శ్యామ—వదినా? నీవు వెళ్ళుము. నేనుకొంతదడవిటగూర్చుండి వచ్చెద. రుక్మిణినిలోని కేగెను.

మధు—అత్తా! ఆకుర్చీపై గూర్చుండుము.

శ్యామ—(కుర్చీపై కూర్చుని] చిరునగవుతో మధుమతీ? నీవనినట్లు నాకన్నియును సందియములే? కాని యిప్పుడు నేను మర్మములేక మాటలాడుచున్నాను. నిన్ను నాకడుపులో బెట్టుకొని యాదరించ వలెనని గంపెడాశతో నున్నాను. నీవిద్యాబుద్ధులువిని యానందించని నిమిషములేదు.

మధు—మారువలుకలేదు. గోడకు దగిలించియున్న మాధవచిత్రపటమును జూచుచుండెను.

శ్యామ—ఏమిటట్లు చూచుచున్నావు?

మధు—ఏమియును లేదత్తా? చిత్రపటమును జూచుచున్నాను.

శ్యామలకు మనస్సులో నసూయప్రవేశించినది. మాధవునినుండి మధుమతి మనస్సును మఱలింపవలెనని యోచించుచుండెను. ఆతనియందు విరక్తిని బుట్టింపవలెనని యాలోచించుచుండెను. తుదకిట్లుపలికెను.

శ్యామ—మాకామపాలుని చిత్రపటమును నీవుజూ

జూడకపోవుటచే నీపటమును నీవంతగా జూచుచున్నావు. అది యింటివద్ద మఱచిపోయినచ్చితిని.

మధు—సౌందర్యశ్రీనటుంచుము పేరిమము-సౌహార్ద్రము, రూపమునందెట్లు ప్రస్ఫుటమగుచున్నవో చూడుము.

శ్యామ—నాబిడ్డను నేనుపొగడుకొనుట కాదుగాని కామపాలునియందు దీనినిమించిన సౌందర్య శ్రీ ప్రస్ఫుటమగుటలేదా?

మధు—జిహ్వకొక రుచి. కంటికొక యందము. మనస్సునకొక యభీష్టము. దీనికిసామ్యము వేఱొకటినాక గుపడుటలేదు.

శ్యామ—నీవెప్పుడును నదియేచూచు చుండుటచే సత్యముగలంచుట స్వభావము. కామపాలుని పటము నెదుటబెట్టికొని చూచితివేని నీనిశ్చయము నిమిషములో మాఱగలదు.

మధు—నీవు చెప్పిన దానిలో కొంతయదార్థముండవచ్చును గాని—

శ్యామ—ఒకదానితో నొకదానికి సామ్యగుణములున్నను మైశ్వర్యములో మహత్తరభేద ముండును. చూడుము? పాపము మాధవుఁడు చూచుచుండగనే నామరూపములులేకుండ బోయెను. విశాలాక్షి యెంతచింతించుచుండెనోగదా?

మధుమతి తలవాల్చెను. హేమంతము లతాపత్రములనుండి హిమకణంబులు రాలుచందంబున నాలతాంగిహృ

దయము దుఃఖమనెడి యావిరిచే గప్పబడి నేత్రములనుండి యశ్రువులు రాలజొచ్చెను.

శ్యామల వానింగాంచెను. మధుమతి మాధవునకై యింకను యాశించుచున్నదని తలంచెను. ఏదోయొక విధము న నచిరకాలముననే వివాహము జేసినగాని మధుమతి మన స్సు మారదని నిశ్చయించెను. నేటిరోజున శ్రీధరునికడ మ ధుమతి తనకోడలనిపించుకొన వలెనని సంకల్పించెను. అంత మధుమతి కనులను తుడుచుకొని మందస్వరముననిట్లనియె.

మధు—అత్తా! నీవట్లనుట న్యాయమా? మాధవుడు నానురూపములు లేకుండ బోయెనా? దానిని నీవెట్లు నిర్ధారణ జేయగలవు?

శ్యామ—ఇది నేనన్న మాటకాదు. నలుగురనుకొను చున్నదే నేనంటిని. ఎందులకిట్లు విచారించెదవు. వెఱ్ఱియా! యేమి? మనమేమి చేయగలము. రాజపత్కారములందుటకా తడు నోచుకొనలేదు. గతించినదానికి విచారించిన నేమిఫల ము. మాకు దుఃఖములేదను కొంటివా యేమి? చేయునగలిన దానికి జింతించిన నేమిఫలము?

కాలిన పుండుమీద కారముజల్లినట్లు శోకతప్తచుగు మధుమతి మనస్సునకీమాటలు చుఱ్ఱుమనిపించెను. ఇంతలో కోకిలవచ్చి భోజనముకు బిలిచెను. శ్యామల మధుమతి చేయి బట్టుకొని లోనికి దీసికొనిపోయెను.

శ్రీధరుడును భాస్కరుఁడును వసారాలో కుర్చీలపైని బరుండి యుండిరి. ఇంతలో మధుమతి భోజనము జేసి తండ్రి చెంతకఁకు దెంచి విసరుకఱ్ఱ చేఁబట్టుకొని విసరుచుండెను.

శ్రీధ—అమ్మా! భోజనమైనదా!

మధు—అయినది బాబా?

శ్రీధ—నీముఖము వాడియున్న దేమి తల్లీ ? అనారోగ్యముగ నుంటివా?

మధు—లేదు బాబా? ఆరోగ్యముగనే యుంటిని.

శ్రీధ—మామ వినును. వీణవాయించెదవా?

మధుమతికి వీణవాయించ నలెనని యుత్సాహములేదు. కాని తండ్రి కుత్సాహభంభము సేయ నామెకిష్టములేదు. ఆమె విసఱుకఱ్ఱ నటనుంచి వీణను దెచ్చి శ్రుతులను సవరించుచుండెను. అవి యెంతకును స్థాయిలో బడుటలేదు. లోనవిసు వుజనించెను. అట్లులనే పాడుటకారంభించెను. శ్రుతికలియక పాటరక్తికట్టుటలేదు. ఇంతలో రుక్మిణీ శ్యామలలు పైడిపళ్ళెరములో తాంబూలపుపట్టీకల నుంచుకొని యాపళ్లెరమును జేతఁబట్టుకుని వసారాలోనికి వచ్చిరి. మధుమతి శ్రుతులను సవరించుట కారంభించెను. ఆమె లక్ష్యమందులేదు. ఏమియో యోచించుచు, శ్రుతిని త్రిప్ప నారంభించెను. పుట్టుమనియొక వీణాతంతువు తెగినది. మధుమతి తెల్లవోయెను. శ్యామల నవ్వెను. మధుమతికి కోపమువచ్చెను. మఱల నాతంతువును

సవరించుట కా మెశ్రీధ్రతీసికొనలేదు. అల్లే వీరి నెత్తిలోనను
చివచ్చి వినరుకట్టు నందుకొని తండ్రిచెంత కూర్చుని విసరు
చుండెను. రుక్మిణి అన్న నంక జూచెను. భాస్కరుడు నవ్వు
చు శ్రీధరునితో నిట్లనియె.

భాస్క—నేనిచ్చటికివచ్చిన దెందులకో తెలియునా?

శ్రీధ—మీచెల్లెలను జూచుటకు కాదా?

భాస్క—అదియునొక కారణమే?

శ్రీధ—ఇంకేమయిన కారణముండెనా?

భాస్క—ఉండబట్టియే వచ్చితిని.

శ్రీధ—అదియేదియో శలవిందు?

భాస్క—నేనుమీతో వియ్యమందవలెనని వచ్చితిని.

శ్రీధ—సంతోషమే కాని, ఇప్పు డావిషయమును
గూర్చి మీతో నిర్ధారణ జేసి చెప్పజాలను.

రుక్మి—నిర్ధారణ జేయుట కేమున్నది? బిడ్డకు వివాహ
ము జేయ కింత కాల మిట్లుంచెదరు?

శ్రీధ—ఏమి చేయుదును. నేనును ద్వరపడుచునే యు
న్నాను. ఇంతకును కాలమనుకూలించ వలెనుగదా?

రుక్మి—మాయన్న కేవియో పనులున్నవని చెప్పు
చున్నారు. మాటయిచ్చిన నింటికేగి పనులు చూచుకొని
రెదరు.

శ్రీధ—నేనొక సంబంధమును స్థిరపఱచుకొనియు

న్నాను. దాని కనేకవిఘ్నములు తటస్థించుచున్నవి. కొంత కాల మింకను నిరీక్షించినగాని యేమియును జెప్పజాలను.

రుక్మి—(కంటదడిబెట్టుచు,) కామపాలున కీయరా? మధుమతి పుట్టినదిమొదలు లన్నతో వియ్యమందవలెనని ఘనాశతో నుంటిని. వేరుసంబంధమును జూచుట న్యాయమా?

శ్రీధ—నీవు మాటమాటకు గంటనీరు బెట్టుదువు. నేను కామపాలున కీయనని చెప్పితినా? నీవిట్లు తొందఱపడిన కార్యమెట్లగును. ఇదివఱలో మధుమతి నొకనికీయనిశ్చయించితిని. ఆయూహ కిప్పు డంతరాయములు కలుగుచున్నవి. అయిన గొంతకాలము నిరీక్షించినగాని, నేనేదియును జెప్పజాలను.

రుక్మి—ఇక నిరీక్షించుచు నూరుకొనుట బాగుగా నుండదు. ఇప్పటికే యందరిలోను దలవంపులు వచ్చుచుండెను. ఇంతదనుక వివాహము చేయకుండుట వికాకుమాత్రము తలవంపుకాదా?

శ్రీధరుని హృదయము వ్యాకులమై యుండెను. యేమి చెప్పుటకునుగూడ తోచుటలేదు. రెండుసంవత్సరములైనను మాధవుని జాడగానరాలేదు. ఈడువచ్చిన పిల్లకు వివాహము చేయకుండుట తప్పిదమే యగును. మాధవుని తరువాత కామపాలుని సంబంధమే కొంచెము బాగుగా నున్నది. ఇదితిరస్కరించిన వేఱొక సంబంధము దొఱకుట కష్టము. ఈ యూహ

లన్నియునునాతని హృదయమును పెనువేసికొని బాధించుచుం డెను. కొంతకాలమాగుగనున్న రుక్మిణీరోదనము జేయుచు న్నయది. పాపమాతని కేమిచేయుటకును తోచుటలేదు. తు దకు కామపాలుఁడే యాతనికి దక్కుగాదోచెను. అంతనాత డిట్లనియె.

శ్రీధ—ఇంతకును బిడ్డయభిమత మేమియో తెలిసి కొంటివా?

శ్యా—వధూవరుల యన్యోన్యానురాగము శంకింపనవ సరములేదు. వాండ్రు త్వరపడుచునే యున్నారు.

మధుమతిముఖ మ్మూబడియెను. ఆమెవ్యాజనంబునట నుంచి చటాలున తన గదిలోనికి బోయెను.

రుక్మి—బిడ్డ యంగీకరించుటకేమి? అంగీకరించియే యున్నది. మనమేర్పఱచినది బిడ్డవలదననా?

శ్రీధ—నేసందుల కంగీకరించను. బిడ్డనడిగి తెలిసికొన వలెను. బిడ్డకంగీకారమైనచో నాకును సమ్మతమే.

రుక్మి—అట్లయిన బిడ్డను బిలిచియడుగకూడదా?

శ్రీధ—మధుమతి లోనికేగినది ?

రుక్మి—అమ్మా! మధుమతీ! యనిబిలిచెను.

మధుమతి మారుపలుకలేదు. శ్యామలవాక్యముల కా మెహృదయము దహించుకొని పోవుచుండెను. మంచముమీ దపరుండి కనులకు గుడ్డనడ్డముగ బెట్టుకొని వాపోవుచుండెను. రుక్మిణీ పిలుపామెకు వినబడకపోలేదు, ఆమెకు రా మనస్సా

ప్పుట లేదు.

శ్రీధ—అమ్మా? మధుమతీ? యనిబిలిచెను.

మధుమతి కనులను దుడుచుకొని మంచమునుండిలేచి, వచ్చి తండ్రివెనుక నిలువంబడియెను.

శ్రీధ—అమ్మా! మధుమతీ? నిన్ను కామపాలునకిచ్చుటకు మీయమ్మ తలంచుకొని యున్నది. మాటయిచ్చుటకు ముందు నీయభిప్రాయమును దెలిసికొనుట మంచిదని నిన్నుఁ బిలిచితిని.

మధుమతి గుండెలు కొట్టుకొన నారంభించెను. ఆమె కేమిచెప్పుటకు బాలుపోవుటలేదు. తలవంచుకొని మారు పలుకకూరుకొనియెను.

రుక్మి—అయ్యాగారు కడిగిన దానికేదియో బదులు చెప్పుము?

మధు—(మందస్వరముతో) బాబా! నన్ను మాధవునకీయరా?

శ్యామల ముఖకమలము వాడెను. రుక్మిణి తలవాల్చెను. భాస్కరుఁడు స్తబ్ధుడయ్యెను. శ్రీధరుడు కనులనీరునించెను. మధుమతి కనులనుండి యశ్రువులు శ్రీధరునియంసదేశంబున బొటబొటరాలుచుండెను. కొంతవడికి శ్రీధరుడుకనులదుడుచుకొని యిట్లనియె.

శ్రీధ—తల్లీ! మాధవునకై విశ్వప్రయత్నము జేసితిని.

ఆతని జాడ గానరాలేదు. నేనేమిచేయుదు.

మధు—బాబా! నేను దురదృష్టవంతురాలను. మీకు జింతలగలుగ జేయుటకై బుట్టితిని. మాధవుడు జీవించి యుండెనని బ్రిహ్మానందులు తాతతో జెప్పిరి.

రుక్మి—(విచారముతో) అమ్మా! నేను నీసౌఖ్యము ను గోరుదాననుకానా? అన్నియు నాలోచించుకొనియే కామపాలునికి స్థిరపఱచితిని.

మధు—అమ్మా! నన్ను క్షమింపుము. నీయభీష్టము ను నేరవేర్పనిబిడ్డ యుపరాధమును మన్నింపుము. నామనసు లోనున్న యూహాను స్పష్టముగా జెప్పుచున్నాను. మాధవుడు నామనంబును హరించెను. మాధవునుండి నామనంబుమఱలదు. కామపాలునకు పత్నినెన్నటికిని కాజాలను. మాధవుడులేనిచో నేను పరివ్రాజికనై మీసేవజేసికొని తరించెదను.

శ్రీధరుడు విచారమున మునింగియుండెను. ఆతనికేమియును దోచుటలేదు. అంతనాతడు తనకుర్చీనుండిలేచి పడక గదిలోనికి బోయెను. మధుమతి తనగదిలోనికిబోయి, తలుపులు వేసికొని మంచముపై బొర్లాడుచు, నావేదనకు లోనయ్యెను. శ్యామలకు పట్టరాని కోపమువచ్చెను. రుక్మిణికనుల నీరు నింపుచు వాపోవుచుండెను. భాస్కరుడు కుర్చీమీదబరుండియు శ్లేనిదురించెను.

## ముప్పదియవ ప్రకరణము.

నాడు ఢిల్లీనుండి బయలుదేరిన ముస్తఫాలీయు, ఫకీరు ప్రభృతులును, పదిహేనురోజులగుసరికి కోరుగల్లునకు నాలుగు క్రోశముల మేరలోనున్న నొక సత్రమునకు జేరుకొనిరి. రెండురోజులు మార్గాయాసమునుదీఱ విశ్రమించినవెనుక సాయంసమయమున నానలుగురు నుబాటసారులు నొకచోట గూడి, యిట్లుమాటలాడుకొనిరి.

ముస్త—ఫకీరుజీ? నుఃమిటకఱుదెంచి రెండురోజులు గడచినవి. ఇక, కాలయాపనచేయుట మంచిదికాదు. మన కింతవఱకును, జఫరాలీఖాను సంగతి తెలియలేదు. ముందుమనము చేయదగిన కార్యక్రమమెట్టిదియో నిర్ణయింపుడు.

ఫకీ—భాయీ? భీషణజయదేవుల కోరుగల్లు కొట్టినపిండి. ఈరాత్రివారలను నాతోబంపుడు. కొంతసమాచారమును దెలిసికొని తెల్లవారుజామున నూరువెలుపల నుద్యానవనముకడ మీకొఱకు వేచియుందుము.

ముస్త—మంచిది. మీరుపెందలకడనే భోజనములను జేసి బయలుదేరుడు. పిమ్మటనేనువచ్చి మీకొఱకువేచియుందును.

జయ—అయ్యా? సాహేబుగారూ? నాపజ్ఞను నేను చెప్పుకొనకూడదు కాని మీవెనుక దగినసిబ్బందియున్నచో

రెండురోజులుగడువిచ్చిన ప్రతాపరుద్రుని మీస్వాధీనము జేయగలను.

ఫకీ—మీకింతటిసామర్థ్యమున్నదని నమ్మినాముమీకు జాగీలులొసంగుటకు చక్రవర్తి బాసచేసియున్నాడు. ప్రతాప రుద్రుని మీరుస్వాధీనపఱచినచో నాంధ్రసామ్రాజ్యమంతె యును చక్రవర్తికి మీరలిచ్చినట్లే యగును. మీరుభోజన ములనుజేసి వేగరండు.

అనభీషణజయదేవులు త్వరితగతిని భుజించివచ్చిరి. అ ప్పటికి జాముచాత్రియైనది. భీషణజయదేవులును, ఫకీరును గుఱ్ఱములనెక్కి నెమ్మదిగా నదిపించుచు ప్రతాపరుద్రుని పు, రబాహ్యోద్యానమునకు జేరుకొనిరి. అట గుఱ్ఱముల జెట్ల కుగట్టిపెట్టి చీకటిగానుండుటచే గొంతతడవచట గూర్చుండిన పిదప ఫకీరిట్లనియె.

ఫకీ—భాయీ? జయదేవ? భాయీ? భీషణ? మీకు బట్టణములోనికి బోవుమార్గములన్నియు దెలియునా?

జయ—తెలియును?

ఫకీ—ఈస్థలమంతయు మీకుఁబరిచయమేకదా?

జయ—ఆ? పరిచయమే?

ఫకీ—ఈసమీపమున నెక్కడనోగాని, మనుజులయ లుకుడి వినబడుచున్నది. పోయికనుగొని వచ్చెదరా?

భీమ—గాఢాంధకారము దట్టముగ గ్రమ్మియున్నది. చెట్లు, పొదలు, తోటలు విస్తారముగ నుండుటచే మిక్కిలి భయజనకమై యున్నయది. నేనెఱిగియున్నంతవఱకు, ఇట మనుజులు నివసించుటకు తావులేదు.

ఫకీ—ఈయంధకారముననే నీవింతగా భయపడినప్రతాపరుద్రునెట్లు పట్టియగలవు? జాగీరులు సునాయాసముగా వచ్చుననుకొందువా?

జయ—ఫకీరుజీ? ఇటయలుకుడితో మనకు సంబంధమేమున్నది? పట్టణములోనికి బోవుదమురండు.

ఫకీ—ప్రతాపరుద్రుని పరిపాలన సామాన్యమైనదనుకుంటివా? విచ్చుకత్తుల జేబూని రక్షకభటులెప్పుడును గూఢముగ దిరుగుచుందురు. వారు మనలగనిపెట్టిరేని రక్తధారలతో మనయుత్తమాంగములు భూమికి బలికావలసినదే; ఆయలుకుడి వారిదేయని నాకనుమానముగానున్నది.

భీమ—(గడగడవడంకుచు) ఫకీరుజీ? రక్షింపుము—రక్షింపుము. పిల్లలుగలవాడను. మాటలాడక చప్పుడుచేయక యేచెట్టుచాటుననో తలదాచుకొందము.

ఫకీ—ఇట్టిపిఱికివాడవు నీవలన చక్రవర్తికగు సాయమేమి? ఓరీ? యభాగ్యుడా? నీకు, తుఱకలచేతులలో చావు తప్పదు.

భీమునకు చైతన్యములేదు. గడగడవణకుచుండెను. కొంతవడికి ధైర్యముతెచ్చుకొని ఫకీరుకాళ్లు గట్టిగపట్టుకొనియెను. ఫకీరు, కాళ్ళనుగట్టిగ విదళించి భీముని నావలకువిసరివేసి, భయములేకుండ మీరిటనుండుడు. అదేదియో నేను పోయి కనుగొని వచ్చెదనని పలికి వడివడి యాయంధకారములో బడిపోయెను:—జయదేవుఁడు తనలో ఈఫకీరు సాధారణుఁడుకాడు. ఇదేదియో కొంపగ నుగుటకే వచ్చినది. అనితలంచి భీముని లేవదీసి, దగ్గఱగా గూర్చుండబెట్టుకొనియెను—

దీపపు గురుతున ఫకీరు తిన్నగా బ్రహ్మానందుని యాశ్రమములోనికి బోయెను. ఒకవేదికపై బ్రహ్మానందుఁడు బకుండి యుండెను. ఫకీరు నెమ్మదిగ దగ్గఱకు బోయినిలచి, స్వామీ! యనిపిలిచెను. బ్రహ్మానందుఁడు కనులువిచ్చిచూచి, ఎవడవురా! నీవు—అనియెను.

ఫకీ—స్వామీ! నేను ఫకీరును. భిక్షకై వచ్చితిని.

బ్రహ్మ—(లేచికూర్చుని) ఫకీరునకేమి; ఈసన్యాసి భిక్షముపెట్టుటేమి? అయిన నీకుగావలసిన దేదియోయడుగుము?

ఫకీ—స్వామీ! నాకు మృష్టాన్నముక్కఱలేదు. పానీయమక్కఱలేదు. ఆంధ్రసామ్రాజ్యమునకుఁ బిచ్చముఁబెట్ట యాచించవచ్చితిని!

బ్రహ్మ—(లేచినిలువంబడి) ఏమంటివి? ఆంధ్రసామ్రాజ్యమునకు బిచ్చము పెట్టుమనియా? ఇప్పుడేమి యుపద్రవమువచ్చినది. నీవేషము చాలవింతగానున్నది. నీచర్యయద్భుతముగానున్నది. నీవెవండవో నిజము జెప్పుము.

ఫకీ—స్వామీ? నన్ను శంకింపకుఁడు?

బ్రహ్మ—(వాని నిసఖశిఖపర్యంతమును పాఱజూచి) నేను నిన్ను శంకించుట లేదు. నమ్మితిని. యదార్థమును జెప్పుము.

ఫకీ—స్వామీ? నేను జైనుఁడను. నాపేరు అరుణప్రభుఁడు.

బ్రహ్మ—నీవు దేవగిరికిబోయి యుంటివిగాదా?

అరుణ—ఔను.

బ్రహ్మ—నీవిప్పు డచ్చటనుండియేనా? వచ్చితివి?

అరు—లేదు? ఢిల్లీనుండి.

బ్రహ్మ—సమాచారమేమియో చెప్పుము.

అరు—స్వామీ? భీషణ జయదేవులు ఢిల్లీకిబోయి, అల్లాయుద్దీనునితో నోరుగల్లుసామ్రాజ్యమునుగబళింప కుతంత్రముల సలిపిరి. వారివెనువెంటనే నేనునుగూడ ఢిల్లీకిబోయి, ఈఫకీరువేషముతో రాజోద్యోగుల నాకర్షించి గుట్టంతయును దెలిసికొంటిని. అల్లాయుద్దీన్ ప్రచండమగు విశ్వాసైన్యము

ను సిద్ధము జేసి మల్లిక్ కాఫురును, ఓరుగల్లుసామ్రాజ్యమును గబళింపఁబంపుచున్నాఁడు. ఈపాటికి సైన్యము కదలివచ్చుచునే యుండును. ఇంచుమించుగ సైన్యమంతయును నశ్వసైన్యమేయగుటచే వారు త్వరితగతినే రాగలుగుదురు. ఇప్పుడు ముందుగా ముస్తఫాలీయను, మహమ్మదీయ యోధుఁడోరుగల్లుయొక్క రహస్యాన్వేషణమునకై నాతోఁగూడవచ్చి యున్నాడు. తెల్లవాఱుజామున నాతని సీయూరుకైటకు రానియమించితిని. ఆతఁడు వచ్చును. ఆతనికిమార్గదర్శకులుగా భీషణజయదేవులుకూడ వచ్చిరి. ఇప్పుడు వారుబాహ్యోద్యానముకడనున్నారు. ఇప్పుడు వారిద్దఱను పట్టి బంధింపవలయును పిదప నాముస్తఫాలీని బట్టి బంధింపవలయును. అనంతరమా మల్లికాఫురు నెదుర్కొనవలయును. స్వామీ ? జన్మదేశమునకు రానున్న నీమహోపద్రవమును నివారించుట మీవలన తప్పమరి, యితరులవలన కాదు. స్వదేశము పరమ్లేచ్ఛాధీనము కాకుండ నెట్లుకాపాడెదవో నీదేభారము. ఈయరుణపతిభుని జీవరక్తము దేశమాతరక్షణకై విసివోగపఱచి నన్నుకృతార్థుని జేయుము. ఓరుగల్లు సామ్రాజ్యము బ్రహ్మనందునిహస్తములయందున్నదని నేనెఱుగుదును. ప్రతాపరుద్రుఁడు మీయానదాటఁడు. మీవ్రభావమును విసియే మీదర్శనమునకు వచ్చితిని.

బ్రహ్మానందుఁడు, అరుణప్రభుని గాఢాలింగనమొనరించుకొని గుబ్బిదియొత్తెను. మేను నిమిరి శిరంబుమూర్కొనియెను. సంతోషమును బట్టజాలక, యాతఁడిట్లనియె.

బ్రహ్మ—అరుణప్రభా? నీజీవితము చాలధన్యమైనది కుక్షింభరులకు లింగధారుల పోద్బలమున చక్రవర్తిచే నీవు దేశాంతరగతుఁడవయ్యును, పరిగణించక దేశమాతయెడ నీ విధ్యుక్తధర్మమును జూపితివి? జైనమతమునకు జీవమనందగు దయాగుణమును పోషించితివి. మాతృదేశ సంరక్షణకై నీవు జూపిన త్యాగము వర్ణనీయము. అరుణప్రభా! నీవు సత్వరమే పోయి భీషణజయ దేవులనిటకు దోడితెమ్ము.

అన నరుణప్రభుఁడు భీషణజయదేవులకడకు జనిజయ దేవా! ఇటనొక సన్యాసి యాశ్రమము గలదు. ముస్తఫాలీ వచ్చుదనుక నేఁటిరాత్రి యాయాశ్రమమున విశ్రమింతము. కళ్ళెముల జేతబట్టుకొని నావెనువెంటనే రండన మారుమాటాడక వారట్లు చేసిరి. ఆశ్రమమును జేరినపిదప గుఱ్ఱముల నొక తావున గట్టిపెట్టి బ్రహ్మానందుని సన్నిధికేగిరి. బ్రహ్మానందుఁడు భీషణ జయదేవులగాంచి, మీరెవరనియడిగెను.

జయ—స్వామీ? మేముబొందిలివారము.

బ్రహ్మ—ఇటకేమిపనిమీద వచ్చినారు!

జయ—వర్తకము జేసికొనుటకై.

బ్రహ్మ—మీ పేరులేమి?

జయ—నా పేరు రామసింగు, అతని పేరు లక్ష్మణసింగు.

బ్రహ్మ—మంచి పేరులే పెట్టుకొనిరి. ఆమూడవవా డెవడు?

జయ—ఫకీరుజీ?

అరు—ఓరీ! ద్రోహీ! జయదేవ ఛండాలుడా? నన్నింకను ఫకీరనే పిలుచుచున్నావా? నీపాలిటి కాలయముడను. అరుణప్రభుడ.

భీషణజయ దేవులకు, నవనాడులును క్రుంగిపోయినవి. లోన ప్రాణములు పైకుబికెను. మృత్యుదేవత యెదుటనృత్యము చేయుచున్నట్లు దోచెను. గడగడవణకిపోవుచుండిరి. ఇంతలో నరుణప్రభుడు తనకృత్రిమపు గడ్డమును గడిగితీసివేసి ఫకీరుకవచమును పటాలున డెంచి పాఱవేసి, ఇట్లనియె.

అరు—నేనెవండనో ఇకనైన తెలిసికొంటిరా? నాకను గప్పి మ్లేచ్ఛాధమునితో గలిసి మాతృద్రోహ మొనరింపసమకట్టితిరా? మీనిప్పచ్చిపాడ మేనాడు బెట్టితిరోకాని కలకలలాడు దేవగిరిస్మశానవాటికయైనది. అంతటితో దనివిదీరక జన్మభూమియగు నోరుగల్లు సామ్రాజ్య వినాశనమునకై మాతృమర్మాపహరణమునకై మారువేషములతో వచ్చితిరి? ఇట్టికలుషితమగు మీజీవితమిక నొక నిమిషమైన నుండకూడదు.

అని యుద్రేకముతో మొలనుండి చక్కని కత్తినిదీసి పైకెత్తెను. భీషణజయదేవులు కెవ్వున కేకవేసి నేలగూలిరి. బ్రహ్మానందుడు గుభాలునలేచి యరుణప్రభుని చేయిపట్టుకొని, అగుమాగుమరుణప్రభా? ఈపితకిపందల జంపినబ్రహ్మయోజమేమి నెను. అరుణప్రభుడు కత్తినొఱలో నిముడ్చి, స్వామీ ఈపాతకుల బంధించు టుచితము. అన బ్రహ్మానందుడు వలదు వలదు. అంతటియగత్యమేమియును లేదు. వీరలకు బశ్చాత్తాపమున హృదయపరివర్తన మొనరింపవలయును. వీరు తమకు గలిగిన పరిభవమునకు బాపచింతల గొడంబడిరి. వీరలనాశ్రమమునం డడుగీవల బెట్టకుండ శాసించెదను. వీరలవలన సాధింపదగిన కార్యములు కొన్ని కలవు. ఇంతలో భీషణజయదేవులకు దెలివి వచ్చిలేచి రక్షింపుడని యోగికాళ్ళపై బడిరి. యోగియభయమిచ్చి, మీారలాశ్రమమును దాటిపోకూడదని శాసించెను. భీషణ జయదేవులు శిరంబులవంచి చిత్తమనిరి. ఇంతలో దెల్లవారుజాము కావచ్చుటచే బ్రహ్మానందుడును యరుణప్రభుడును ముస్తఫాలీకై బాహ్యోద్యానము కడ కేగిరి. అప్పు డరుణప్రభుడిట్లనియె.

అరు—స్వామీా? ముస్తఫాలీ మహావీరుడు. బలవంతుడు. ఆతనియొద్ద గుప్తముగ నాయుధములున్నవి. యోధులనెవర్నైనన రప్పించ గలరు. ఉపాయమెద్దిస్వామీా?

బ్రహ్మ—వక్కానవన్వి? ధర్మసంరక్షణ దీక్షాచణుండ

గు భగవంతుడుండ మనకన్యసహాయమేల యరుణప్రభా?

అన వింతలో గుఱ్ఱపుడెక్కల ధ్వనివినఁబడియెను.

అరు—స్వామీ? గుఱ్ఱముపై నొకఁడు వచ్చుచున్న ట్లున్నది. జాగరూకతతో నుండవలెను.

బ్రహ్మ—నీవు నావెనుకనుండి మెలుకువతో గనిపెట్టిచూచుచుందుము. కథయంతయును నేనునడిపెదను.

రెండునిమిషములలో గుఱ్ఱమును, గుఱ్ఱముపై ముస్తఫాలీఖానును నట బ్రత్యక్షమయ్యెను. వీరలజూచి ముస్తఫాలీ గుఱ్ఱమును నెమ్మదిగ నడిపించుచుండెను. బ్రహ్మనందుఁడు చేయిపైకెత్తి యాగుమో, సర్దార్ ముస్తఫాలీఖాన్ అనియెను. ముస్తఫాలీ, ఎవడురా? వీడు! వీనికినాపేరెట్లు తెలిసినదని సంశయించుచు, మీరెవరుస్వామీ? యనియెను. దానికి బ్రహ్మనందుఁడు ఖానుజీ! నేనుమీవాడనే, ఫకీరును, భీషణజయ దేవులు పని తొందరచే పట్టణములో నున్నారు. మీకు గొన్ని సంగతులను దెలిపి, మిమ్మటకు దోడుకొని రమ్మని యాజ్ఞాపించినారు. అన ముస్తఫాలీ దిగ్గున గుఱ్ఱమునుండి నేల కురికెను. బ్రహ్మనందుఁడు దగ్గఱగా వెళ్ళి చేయిబట్టియూచుచు, భాయీ? మీసంరక్షణమునకై ఫకీరు మమ్ములనుబంపి నాఁడు. మీరుగొప్పసాహసోపిక మిత్రులని జయదేవుఁడు చెప్పినాఁడు. ఏమిశెలవనెను. అన ముస్తఫాలీ? నవ్వుచు, మీకిచ్చెడి బహుమానము ముందున్నయది. అంతదనుక మీరునిరీ

క్షించియుంచుట కష్టము. అని జేబులో వేయిపెట్టి గుప్పెడు మొహరీలను దీసి యోగి కీయబోయెను. యోగి నివారించి ఖానుజీ! మేమిప్పుడు దానిని దాచుకొనలేము. మీయొద్దనే యుంచుడు. అన ఖాన్ అటులనే కానిండని మఱల జేబులో వేసికొనియెను. పిమ్మట ఖాన్ మనమిప్పుడు ఫకీరువద్దకుబోవు దమా? యన బ్రహ్మానందుఁడు నవ్వుచు, భాయీ! పోవుట కుముందు, మీకోరుగల్లుయొక్క రహస్యమును దెలియజేయ వలసియున్నది. అన ఖాన్ ఏమిటారహస్యమనియెను. బ్రహ్మా నందుఁడు మరేమియునులేదు. రహస్యమంతయును నాచేతిలో నేయున్నది. అని పిడికిలిని బట్టి గుండెమీదనొక పోటుపొడి చెను. నసాలమంటినది. ఆపోటునకు వెనుకకు బడవలసినదే కాని గుఱ్ఱమడ్డుతగులుటచే నాగి, ఆ రే మోసకాడా? లుచ్ఛా ఎంత మోస మెంత మోసమని యొక్కయుఱకనువచ్చి బ్రహ్మా నందుని బొడిచెను. బ్రహ్మానందుఁడు కాపులోనుండుటచే పో టుతప్పించుకొని మఱల బొడిచెను. ఆపోటుయొక్క వేగము నకు వెనుకకూఁగెను. మఱల గుఱ్ఱముడ్డినది. ఖాను రెండుఱక లలో ముందునకు వచ్చి కాలెత్తి బ్రహ్మానందుని పొత్తికడు పుపై తన్నెను. స్వామికాఁలు రెండుచేతులతోను బట్టుకొని కొంచెము పైకెత్తెను. ఖాన్ నేలకొరగుచు రెండవకాలితో యోగిగుండెలపై దన్నెను. ఖానిటును, బ్రహ్మానందుడటును వెల్లకిలబడిరి. ఇంతలోఖాన్ సర్దుకొనిలేచి చరుగ్గిన మొలనుండి

కృపాణము నూడబెఱికెను. యోగికూడ లేచెను. ఆతఁడును తననిలువుటంగీలోనున్న కృపాణమును దీసెను. రివ్వుపడి యిదంతము జూచుచున్న యరుణప్రభుఁడు గుభాలునవచ్చి ముస్తఫాలీఖడ్గహస్తముపై ముష్టితో బలముగ నొక్కపోటుబొడిచెను. ఖడ్గమూడి తూలియావల బడినది. కత్తికోసముపోయినయోగివచ్చి పొడిచివేయునను భయముచే ముస్తఫాలీ యరుణప్రభుని నొకగ్రుద్దుగుద్ది చట్టున గుర్రముపైకి దూకి కళ్ళెమందుకొని ఛలో, ఛలో యనియెను. గుర్రమొక్క సకిలింపుసకిలించి ముందున కుఱక ముంగాళ్ళు పైకెత్తెను. వదలిన బాణంబుపగిది బ్రహ్మనందుఁడు రివ్వునవచ్చి ఖానుగుఱ్ఱముపైకి దూకెను. గుర్రము ముందునకు రెండుఱక లురికెను. బ్రహ్మనందుఁడు గుర్రముపై ముస్తఫాలీవెనుక గూర్చుని కళ్లెమును బిగబట్టిలాగి గుర్రమును గదలకుండజేసెను. గుర్రమాగినదే తడవుగ యోగి కుడిచేతిని సవరించుకొని ముస్తఫాలీనెత్తిమీఁద నొక గ్రుద్దుగ్రుద్దెను. ఖానుకు నెత్తిదిమ్మెక్కిపోయినది. చేతిలోని కళ్ళెపుపట్టు వదలిపోయినది, ఇదేసమయమని బ్రహ్మనందుఁడు ఖానుని గుఱ్ఱమునుండి క్రిందికి గెంటెను. నరకబడినచెట్టు నేలగూలినట్లులు ఖానుదుబ్బుననేల బడెను. అరుణప్రభుఁడు చట్టునవచ్చి ఖానునిబట్టినొక్కెను. యోగి గుర్రమునుండి దూకి యరుణప్రభునకు దోడై ఖానునిగాలు నేతులు బంధించి వేసెను. ఖానునకు స్పృహతాలేదు.

స్వామియు, నరుణప్రభుడును ఖానుని మోసికొనిపోయియా శ్రమములో నంతర్గృహమునుంచి గదికి తాళము వేసిరి. అరుణప్రభుడుపోయి ఖాన్ గుర్రమును ఆశ్రమమునకు గొనివచ్చి కట్టివేసెను. పిమ్మట యోగియు నరుణప్రభుడును కలిసి నదికి స్నానమునకై పోయిరి.

---

## ముప్పది యొకటవ ప్రకరణము.

బ్రహ్మానందుడును, అరుణప్రభుడును నదిలో స్నానమొనరించి, జాముపొద్దెక్కునప్పటికి కాశ్రమమును జేరుకొనిరి. ముస్తఫాకీ బ్రహ్మానందులకు గలిగిన ద్వంద్వయుద్ధములో బ్రహ్మానందుడు చూపిన కదనకౌశల్యమున కరుణప్రభుడు, చకితుడయ్యెను. సన్యాసికింతటి బలపరాక్రమ కౌశల్యములవ డుటవింతగా దోచినది. ఇతడు సాధారణ సన్యాసిగాడనియు, నిజముగ నీతడీశ్వరుని యపరావతారమనియు నమ్మెను. మహాదోర్బలులగు భీషణ జయ దేవులను స్వేచ్ఛగావదలినాడు. ఈతనిచర్య లీశ్వరలీలలవలె నున్నయవి. భగవత్కటాక్షము వలన నిపుడు నాకు మంచియాశ్రమము లభించినది. దేశమాతసేవ జేసికొనుటకు నాకు మంచి యదను దొరికినది. అని మనంబున దలపోయుచు యరుణప్రభుడు బ్రహ్మానందుని గదు

భక్తితో సేవించుచుండెను. సాయంసమయమైనది. ప్రతాప రుద్రుఁడుద్యానవనమునకు విహారార్థ మరుదెంచెను. ఆసమ యమున కరుణాప్రభునితో బ్రహ్మానందుఁడుప్రతాపరుద్రునిసన్ని థికేగెను. స్వామి యాగంతుకాగమనమున కంకరును విస్మితు లైరి. బ్రహ్మానందుని వదనము దీనమై పరిమ్లానమైయుండెను. ఏదియో యుపద్రవము వాటిల్లినదని యందరునుతలంపనారం భించిరి. బ్రహ్మానందు డిట్లనియె.— సార్వభౌమా! ఆంధ్రసా మ్రాజ్యలక్ష్మి భవద్భుజ పీఠమున సురక్షితమై యున్నయది. సకలకళాలంకృతమై నీసామ్రాజ్యము నిరుద్యోగమనునదిలేక సంపదాయుతమై వెలయుచున్నది. లక్ష్మీసరస్వతుల కాటపట్టై పండితప్రకాండుల కుకినిపట్టై వెలయుచున్నది. సహస్రా క్షుండవై వేయిగన్నులతో సామ్రాజ్యమును రక్షించుచు న్నావు. అయినను దేశభ్రష్టులగు జైనుల ప్రోద్బలమున, నీ రహస్యములన్నియును ఢిల్లీకిబ్రవహించు చున్నవి. అనిభీషణ జయదేవులయొక్కయు ముస్తఫాలీయొక్కయు, అరుణప్రభు నియొక్కయు జరిగిన చరిత్రమునంతయును వ్రాసగ్రుచ్చినట్లే కరువుబెట్టెను. ప్రతాపరుద్రుఁడు నిశ్చేష్టితుఁడై నిరుత్తరు డయ్యెను. గురువులగు సారాధ్యులముఖములు మాడిపోయి నవి. గన్నయమంత్రి ప్రభృతులకు పట్టరానికోప ముదయిం చినది. అంతకొంతవడికి బ్రతాపరుద్రుఁడిట్లనియె.

ప్రతా—స్వామీ! మీప్రభావమువలన, ననేకోపద్రవములనుండి మత్సామ్రాజ్యము రక్షింపబడినది. ముస్తఫాలీఖానుని బట్టుటలో దాముచూపిన శౌర్యసాహసములకు నేను గర్వపడుచున్నాను. సామ్రాజ్యరక్షణ దీక్షాబద్ధకంకణుడై న, మాధవుని హితోపదేశములోని విషయమంతయు నేడనుభవమునకు వచ్చుచున్నది. అయినదేదియో యైనది. కానిండు. ప్రతాపరుద్రుని ప్రతాపాగ్ని ప్రజ్వలిల్లు సమయమే తెంచినది. సామంతులెల్లరును వాయువువలె నాకు దోడ్పడి సామ్రాజ్యమును రక్షింపవలసియున్నది. ఓగన్నయమంత్రి ప్రవరా! తక్షణమే సామంతులకెల్లఱకును, వారివారి సేనలతో సిద్ధముగనుండి మదాజ్ఞకై వేచియుండుడని తాఖీదులను, బంపవలయును. స్వామీ? బ్రహ్మనందా? ముస్తఫాలీఖానుని, భీమణజయదేవులను, బందిగములలో నుంప భటులను బంపెడను. ఏమియాజ్ఞయనెను.

. బ్రహ్మ—రాజా? భీమణజయదేవులను క్షమించివిడిచితిని. వారివలన గొంతకార్యము సాధింపవలసియున్నది. మీయాజ్ఞాప్రకారము ముస్తఫాలీని, బంధింపుడు.

అవ వల్లైయని ప్రతాపరుద్రుడు కోటకుబోయెను. గన్నయమంత్రి కార్యకరణమునకై నిష్క్రమించెను. తదితరు

లెల్లరును నెవరియిండ్లకు వారుబోయిరి. స్వామియు కరుణాప్రభుడును యాశ్రమమున కరుదెంచిరి. అర్ధరాత్రమైనది. అందరును గాఢముగ నిద్రించుచుండిరి. బ్రహ్మనందుడు వేదికపైని గూర్చునియుండెను. ఆతడొక్కడు మాత్రమే మేలుకొనియుండెను. అతడిట్లు తలంపనారంభించెను.

ఈసకలచరాచర సృష్టికంతయును, ప్రధానభూతముగా వ్యక్తిపదార్థము. పురుషచిహ్నముగలదని కొందరును, స్త్రీచిహ్నము గలదని కొందరును జెప్పెదరు. ఈసంశయము చాలకాలమునుండియు నన్ను బాధించుచున్నది. కాని నేటితో నాకాసందేహము తీరినది. నేనిదివరకును పురుషవ్యక్తినిగూర్చియే ధ్యానించుచుంటిని. అయినను నాకెల్లెడ స్త్రీచిహ్నముగల వ్యక్తియే గోచరించుచున్నది. నేనొకవ్యక్తినిగూర్చి ధ్యానమొనరించుచుండ, వేఱొకవ్యక్తి నాయెడ బ్రసన్నమై సాక్షాత్కరించి యానందమొనరించుచున్నయది. ఈకారణములబట్టి యామూలపదార్థము స్త్రీచిహ్నముగలదియేగాని, పురుషచిహ్నముగలదికాదు. ఆనిరుపమాన నిష్కలంక తేజోరూపము, ఆసుందరవదనసౌందర్యశ్రీ, ఆశాంతమందహాసచంద్రికా వికాసము, ఆవిశాలదీర్ఘనయన లావణ్యము, ఆమేనిసౌరు, ఆనైగనగ్యము—ఏమది—దానింజూడ నాతేజోమయాకారంబులో నైక్యమొందవలెనని కోరికపుట్టుచున్నది. నేను ధ్యానమునుమాని ప్రకృతి చిత్రములను జూచుచున్నను నా వ్యక్తితప్ప మరేమియును గోచరించుటలేదు. జాగ్రదవస్థయం

డుఁగూడ నావ్యక్తియే గోచరించుచున్నది. నాయందు దానికిగల ప్రేమయేనని చెప్పెదను. నేనెటుకుఁబోయిన నదియుఁగూడ నచటికే వచ్చుచున్నది. సంతతధ్యానంబుచే నాబోలు నది నామనోబ్జపీఠంబున లక్ష్మివలె గదలకకూర్చున్నయది. ఎటుజూచిన నాదివ్యరూపంబే గోచరించుచున్నయది. నాకార్యములకు మార్గదర్శినియై ముందును వెనుకను గూడ నదియేకనంబడుచున్నది. ఈరూపములన్నియు నొక్కవిధముగనే యున్నవి. ఈనిశీథమున నంధకారములోగూడ నది పండువెన్నెలవలె గానంబడుచున్నది. ఏమది? అది నన్ను స్పృశించబోవుచున్నది. నాతో మాటలాడజూచుచున్నయది. దోసిలొగ్గి మ్రొక్కుచున్నయది. నన్నుగాఢాలింగనమొనరించుకొనవలెనని గూడ జూచుచున్నయది. నిషేధించితిని. అయ్యో? కనులనుండి సంతతధారగా నీరుగార్చెను. ఆమెయవస్థఁజూడ యెవరికి జాలిపుట్టకుండును. ఆమెభగవతికాదు. మూలప్రకృతియునుగాదు. భగవతియేయైనచో నాకేలమ్రొక్కును? నన్నేల యంటబోవును. అదేమియోగాని ఆమెపై నాకు ప్రేమహెచ్చెను.

బ్రహ్మానందుని కనులుమూతలుపడి యుండెను. అది నిద్రయో ధ్యానమో తెలియదు. ఆతఁడు కదలుటలేదు. ఇట్లుండ నొకవ్యక్తివచ్చి స్వామీ! యని బిలిచెను. బ్రహ్మానందుఁ డులికిపడి కనులువిచ్చి చూచెను. ఎవరునులేరు. ఆశ్చ

ర్యముతో ఏమిది? నేను నిద్రపోవుచుంటినా? నిద్రపోవుటచే దే? ఇది స్వప్నమా? జాగ్రదవస్థలో స్వప్నమెట్లు? ఆలోచనయో - స్వప్నమో?— మెలుకువయో? తెలియరాని మైకమొకటి నన్నావహించినది. ఎంతటివిచిత్రము?— నన్ను బిలిచి నదెవరు?

స్వామీ? నేను యోగానందుడను. నేనే మిమ్ము బిలిచితిని. జలమును గోరుచున్నాను. అలసటగా నున్నది.

బ్రహ్మ—యోగానందా? నీవేనా పిలిచితివి? ఎప్పుడు వచ్చితివి?

యో—స్వామీ? ఇప్పుడేవచ్చితిని. త్వరపడుము. లెండు, లెండు.

బ్రహ్మ—వేదికనుండి దిగివచ్చి ఏమది? సంగతియేమి? త్వరగ జెప్పుము.

యో—దేవా! మహామ్మదీయ సేనాసముద్రము పొంగిపొరలి వచ్చుచున్నది.

బ్రహ్మ—ఏమీ? మహమ్మదీయ సైన్యమా?

యో—ఔను?

బ్రహ్మ—ఢిల్లీనుండియా?

యో—ఔను?

బ్రహ్మ—ఎవరది? అల్లాయుద్దీనా?

యో—మల్లిక్ కాఫుర్ – అల్లాయుద్దీనుని సేనాని.

బ్రహ్మ— సైన్యము ఢిల్లీనుండి గదలెనా?

మో— అయ్యో! స్వామీ! మీరింకను పెడదారి బోనేయున్నారు. అప్పుడే దేవగిరిని దాటి యించుమించుగ నోరుగల్లు సరిహద్దులలోనికి వచ్చినది.

బ్రహ్మ— దేవగిరిని దాటెనా? రామచంద్రదేవుడు దారివదలెనా?

మో — దారివదలుటయేకాదు. సహాయముగూడ జేసి యున్నాడు.

బ్రహ్మ— ఔరా! ఎంతపనిజరిగినది. నేననుకొనినట్లే యైనది. నేడే గన్నయ్యామంత్రి సామంతులకు దాఖీదులు పంపినాడు. వారు సైన్యముల సిద్ధము జేసికొని వచ్చుటకు గొన్ని రోజులు పట్టును. ఒకటిరెండురోజులలో మల్లిక్ కాఫుర్ గోదావరికావలయొడ్డునకు జేరును. ఏమిసేయవలయునో తెలియుటలేదు.

మో— దేవా! ఇది యోచనకు సమయముకాదు. ఎట్లైన నీ మహాయుపద్రవమునుండి త్రైలింగరాజ్యమును రక్షింపవలెను.

బ్రహ్మ—అరుణప్రభా! యనిబిలిచెను.

అరుణప్రభుడు వేఱొక వేదికపై బరుండియుండెను స్వామి పిలుపున కాతడు దులికిపడిలేచి, యేమిస్వామీ! ఇదే వచ్చుచున్నానని పలికిస్వామికడ ప్రత్యక్షమయ్యెను.

బ్రహ్మ—మల్లిక్ కాఫుర్ దేవగిరిని దాటి యోరుగల్లు సరిహద్దులలోనికి వచ్చినాఁడు.

అరు—ఈసమాచారమెట్లు తెలిసినది?

బ్రహ్మ—ఇప్పుడే యోగానందుఁడు వచ్చినాఁడు.

అరు—దేవా? దేవగిరికి సంభవించిన యుపద్రవమింకను నాగుండెలలో మెరుగుచునే యున్నది. మరల నింతలోనే యిది సంభవించినది. మల్లిక్ కాఫుర్ నమ్మకమైనవాఁడు కాఁడు. మాసము రోజులు గడచిన వెనుక బయలుదేరుదునని చెప్పి, మా వెనువెంటనే బయలుదేరినాఁడు.

బ్రహ్మ—సరియే కానిమ్ము. అరుణాద్రిభా? నేటినుండి నీకు సన్యాసదీక్ష నొసంగితిని. దయానందుఁడను పేరుతో నీవు సన్యాసవేషమున నుండుము. యోగానందా? నీవ్రుమిక్కిలి యలసియున్నావు. నీ విఁట విశ్రమింపుము. దయానందా? నీవితనితోఁ గూడ నాశ్రమమున జాగ్రత్తగ నుండుము.

యో—స్వామీ? మీరిపుడెటకేగెదరు?

బ్రహ్మ—రాజభవనమునకు.

యో—స్వామీ? మీకు మార్గము తెలియదు. మీర లిదివఱకీయుద్యానవనముదప్ప నన్యమెఱుంగరు. నేనుగూడ మీతో వచ్చెదను.

బ్రహ్మ—కుమారా? వలదు, వలదు. మాకు గోచరము కానిదేదియును లేదు. మేము యథేచ్ఛగ బోగలుగుదుము.

భయములేదు. నీవిటనే యుండుము.

అనిపలికి దండమును జేతబట్టుకొని బ్రహ్మానందుఁడా యంధకారములో నాయుద్యానవనమున, నాచెట్లసందునఁబడి నడిచిపోవుచుండెను. మార్గమునకై శ్రమపడుటలేదు. దండముచే నేలను టక్కుటక్కుమని కొట్టుచుండెను. కొంతవడికి నుద్యానవనమును దాటి రాజమార్గమునబడియెను. ఆతని నాటంకరించు వారెవరును లేకపోవుటచే నేకశిలానగరమును నత్యల్పకాలముననే ప్రవేశించెను. నగరసంబంధమైన యుపవీథులను పలుసందులు దాటి మార్గమడుగకయే పోవుచుండెను. జ్ఞానులప్రభావ మప్రతిహతమైనది. వారలజ్ఞానచక్షువున కెక్కడనేమున్నదియు గోచరమగుచుండును. అతఁడచిరకాలముననే రాజవీథిని బ్రవేశించి ముందునకు బోవుచునయు [illegible] తిన్నగా నేగెను. సుందరసౌధమొకటికంటఁబడియెను. బ్రహ్మానందుని గమనమాగెను. ఆతఁడా భవనమును రెప్పవాల్చక తదేకదృష్టితోఁజూచి, కొంతతడవిటునటును [illegible] ముందునకుఁబోయెను. కొంతవడికి సింహద్వారమును జేరుకొనియెను. ఆతనిఁజూచి ద్వారపాలకులు తత్తరపాటుతో జేతులు జోడించుకొని నిలువఁబడిరి. బ్రహ్మానందుఁడు చక్రవర్తికడకు బోవుచున్నాను. అనుటయు ద్వారపాలకులు బ్రహ్మానందుని ప్రభావమును నెరింగినవారే గావున చిత్తమని ద్వారమును దెరువ బ్రహ్మానందుఁడు వేఁగొ

కద్వారముకడ కేగెను. ద్వారరక్షకులు నిద్రాదేవినారాధిం చుచు మైమఱచియుండిరి కొంతతడవిటునటును బచారియొనరిం చి నిద్రబోవుచున్న భటుల వీఁపుపై జేతితో దట్టెను. వారల దరిపడి లేచిరి. బ్రహ్మానందుఁడు బ్రత్యక్షమయ్యెను. ద్వార పాలకులు గడగడ వడఁకుచు, యోగికి నమస్కరించిరి. బ్ర హ్మానందుఁడిట్లనియె మీరిట్లు ప్రమత్తులై యున్న సామ్రాజ్య మునకు జేటుఁబూడదా? జాగ్రత, అనిపలికి, మీరలు తక్షణ మే గోపురశిఖరంబునకుఁ బోయి భేరిని మ్రోగింపుఁడని యా జ్ఞాపించెను. భయముతో వారలిట్లనిరి. స్వామీ: ఇంకను తెల్ల వారలేదు. అప్పుడే మంగళవాద్యముల మ్రోగింపమని యెక రా? చక్రవర్తి మేలుకాంచిన మాశిరంబులెగిరిపోవును.

అన బ్రహ్మానందుఁడు మీకట్టిభయము వలదు. ఇప్పు డు మ్రోగింపుమనవి ప్రాతఃకాల మంగళవాద్యంబులు కావు. యుద్ధభేరిసి మ్రోగింపుఁడు. త్వరపడుఁడు. మేము చక్రవర్తిక డకు బోవుచున్నాము. అనిపలికి యోగిముందునకు బోయెను.

చక్రవర్తి హంసతూలికా తల్పంబున గడలకనిద్రా సుఖమనుభవించుచుండెను. యోగి తద్భవనబహిఃప్రదేశము [illegible]వంబడి, యిటునటు బచారియొనరించుచు, శ్రావ్యము [illegible] బాడనారంభించెను. శ్లో॥ ఉత్తిష్ఠ, జాగ్రత, నిబోధత, సార్వభౌమ, నశూర్యమనే, కిమరివారిధి [illegible]మం— అతఁడీ పద్యమునే పలుమారులు పఠించెను. [illegible]పరిభద్మ యొక్క కిటికీతలుఁపులను గుభాలున [illegible]పురుషు డాత్రముతో వీధినిదొంగిచూచుచుండెను. [illegible] యోగి,పై పద్యమునే పఠించుచు బచాళి సేయుచుండ[illegible] తఁడాతని

కంటబడెను. పద్యార్థము నాతఁడు బాగుగా గ్రహించెను. కాని యీ మనుష్యునానవాలుపట్టుట చాలకష్టముగ నుండెను. కిటికీతలుపులను దెరచి చూచుచున్న యాతఁడు చక్రవర్తి. యోగి వదనమును పైకెత్తి ప్రతాపరుద్రునుపలక్షించుచు, మఱలనాపద్యమునే యుత్కంఠముతో జదివెను.

ఇంతలో రణభేరీ ఢం-ఢంమని దిశలుబ్రద్దలుజేయుచు మ్రోగనారంభించెను. సైనికులెల్లరును నిద్రనుండదాటునలేచిరి. ఆభేరీనినాద మొక్క సైనికులకేగాక నగరవాసులకెల్లరకును భీతినిగలుగజేసెను. నగరంబున నాబాలవృద్ధులును మేలుకాంచిరి. ప్రతివాని హృదయము తటతట కొట్టుకొన చుండెను. శ్రీధరుఁ డులికిపడిలేచెను. ఆయుద్ధభేరీనినాద మాతనికిభీతిని బుట్టించెను. చటాలున మేడదిగి యుశ్వశాలకుబోయి గుర్రమునెక్కి కోటకుఁ బరువెత్తెను. ప్రతాపరుద్రుఁ డాశ్చర్యచకితమానసుడై అరే! ఏమిది? నాయాజ్ఞ లేనిదే యుద్ధభేరీమ్రోగుటకు కారణమేమి? ఇప్పుడీపద్యమును జదివినవారెవరు? ఇదియోగీంద్రుని కంఠమును బోలియున్నది. తప్పకనీతఁడాశకేడైయుండనోపు. ఈభేరి వారి[illegible]జ్ఞనే మ్రోగింపబడియుండును. లేకున్న నింతసాహసమును [illegible] వారలెవరు? ఏదియో యుపద్రవము సంభవించినది. అని[illegible] పోయి[illegible]చిత్తుడై వడివడి మేడదిగి యీవలకు వచ్చెను. అట బ్ర[illegible]నందుఁడు బ్రత్యక్షమయ్యెను. సార్వభౌముఁ డాతనిగాంచి, [illegible]? ఏమిది? మీరింతరాత్రి రాకతంబేమి?

ఆపద్యార్థము నాకు మిక్కిలి భీతిని బుట్టించుచున్నది. ఆ భేరీనినాదం బేమి? అని యామాత్యుని నడిగెను.

బ్రహ్మ—రాజా! త్వరపడుము. ఢిల్లీనుండి శత్రుసైన్యవాహినిపొంగిపొరలి వచ్చుచున్నది. వారిపాటికి మనసరిహద్దులలోనికివచ్చియుందురు. గోదావరిని దాటివారల సేవలకు తావిచ్చిన మిక్కిలిహానికలుగును.

ప్రతా—స్వామీ! మోసపోతిని. గన్నయామాత్యుని యాహ్వానము లేకను సామంతులకు జేరియుండవు. నిన్నటిసమాచారమునుబట్టి పదిహేను రోజులైన గడువుండునను కొంటిని. సరిహద్దు—

బ్రహ్మ—ఇప్పుడాలోచనకు కాలములేదు. ఇచటనున్నసైన్యాధిపతులనెల్లరావించి శీఘ్రముగ శత్రుసైన్యముల నెదుర్కొనుటకు తగుప్రయత్నములను జేయవలెను.

ఇంతలో రెండశ్వము లటుప్రత్యక్షములయ్యెను. వానినుండి గన్నయామాత్యుఁడును శ్రీధరుఁడును చెంగున నేలకురికిరి. వారలగాంచి చక్రవర్తి అమాత్యవర్యా! శ్రీధరా? ఢిల్లీనుండి మహమ్మదీయ సైన్యములు సరిహద్దులలోనికి జేరుకొన్నయవి. త్వరపడుడు. సైన్యములనెల్ల సిద్ధముచేయుఁడు. సేనాధిపతులనెల్ల మాకడకంపుడు, పొండు. శీఘ్రముగ వెడలి పొండు.

వారుమాఱుపలుకలేదు. రిచ్చవడి కొంతతడవట్లే నిలిచి, యశ్వముల నధిరోహించి యటనుండి గదలిపోయిరి. తూర్పునదెల్లవారుచుండెను. సేనాధిపతులెల్లరును కోటమహాలులో సమావేశమైరి. యోగియు బ్రతాపరుద్రుడును మహాలునకు బోయిరి. సేనాపతులెల్ల చక్రవర్తికిని స్వామికిని నమస్కరించిరి. శివయోగియు [illegible] చక్రవర్తి వారివందనములను గైకొనియెను. రహస్యసమాలోచన జరిగినది. శత్రుసైన్యముల గోదావరినిదాటి, అడుగునిల బెట్టకుండ నెదుర్కొనుటకునిశ్చయించిరి. సేనానాయకులు ముదలకైకొని సేనాగారంబులకు బోయిరి. మ[illegible]యుద్ధప్రయత్నముల దగుల్కొనిరి. ఇంతలో బ్రతాపరుద్రుని సోదరుండగు, నన్నమదేవుండరుదెంచెను. ఆతనితో గలిసి శివయోగియు బ్రతాపరుద్రుడును లోనికేగిరి.

---

## ముప్పదిరెండవ ప్రకరణము.

---

మల్లిక్ కాఫురాంధ్రదేశమున బ్రవేశించెను. ఆతఁడడుగుబెట్టినచోటెల్లను భస్మీభూతమగుచుండెను. దేవాలయంబులు నేలమట్టము జేయుచుండెను. ఆంధ్రులప్రాణంబులం

బిడికిటంబట్టుకొని భీతిల్లుచుండిరి. కలిగినకొలది గంజియో, య
న్నమునో తిని, సుఖంబుగ నాలుబిడ్డలతో నేయిక్కట్టుల నె
రుంగక కాపురముసేయు నాంధ్రులకెట్టి యిక్కట్లువాటిల్లె
ను! పల్లెలను బట్టణంబులనుగాక కొల్లకొట్టుచు దానితోదృ
ప్తినందక భూమ్యాకాశంబులకొక్కటే మంటగ వానిని దగు
లబెట్టుచుండెను. అమ్మహాగ్ని జ్వాలాశిఖము బారినుండితప్పిం
చుకొనలేక కొందరాయగ్నికి నాహుతియగుచుండిరి. కొందర
రణ్యములకు బారిపోవుచుండిరి. కొందరుమారుమూలలనిలిచి
ప్రాణంబుల గాపాడుకొనుచుండిరి. కొందరు తమమానవతులను
మ్లేచ్ఛులపాలుజేసి రోదనముజేయుచుండిరి. కొందరు
ప్రాణంబులకై మానంబులగోలుపోవుచుండిరి. కొందరుమా
నంబులకై ప్రాణంబుల గోలుపోవుచుండిరి. బిడ్డలేడ్చుచుండిరి
తల్లులాక్రోశించుచుండిరి. తండ్రులు తల్లడిల్లుచుండిరి. ఆ యా
క్రందనంబులా గద్గదిక భీతస్వరంబులా, పెడబొబ్బలా, దీనా
లాపములా దుఃఖమా, పరీభావమా, దీనవచనంబులా, య
శ్రుధారలా, వేడినిట్టూర్పులబ్బా! యెవరుచూడగలరు? చూ
చిననెవరిగుండియలు పగులకుండును? ఆహా? ఏమా? ఆమ్లేచ్ఛు
లదుర్ణయము? దొరికినదెల్లను దోచుకొనుచుండిరి. చూచి
నదెల్లను జూఱకొనుచుండిరి. కనపడినదెల్లను కాల్చుచుండి
రి. ఎంత ఘోరమెంత ఘోరము. ఆలుబిడ్డలతో నన్నదమ్ముల
తో నాంధ్రులెందరో ప్రాణరక్షణకై పారుచుండిరి. ఇట్లు
ప్రత్యక్షరాక్షసునివలె మహాఘోరకృత్యంబుల నొనరించుచు

సాధుజనుల నిరపరాధులను చిక్కిలినంతఁ బాధపెట్టుచు మల్లిక్ కా ఫుర్ గోదావరి వరకును వచ్చెను.

ఇటు ప్రతాపరుద్రుఁడు శివయోగితో నాలోచించి లక్ష సైన్యమును నాయత్తపరచి యాసైన్యమున కంతకును, తనసోదరుండగు నన్నమదేవుని సర్వాధ్యక్షునిగ నొనరించి యాతనికి సహాయముగ నశ్వసైన్యాధిపతియగు, మారయసాహిణి ని గజసాహిణిని మైచయనాయనింగారినిన్ని శ్రీధరనాయనంగారినిన్ని బంపెను. అన్నమదేవుఁ డీ వీరసేనానులతోఁ గూడుకొని, సైన్యంబుల నతిచతురముగ నడిపింపుచు, మల్లిక్ కా ఫుర్ గోదావరిని జేరకమున్నే గోదావరీ నదివరకును బోయి, రేవులనన్నిటిని గాచుకొని యుండెను. ప్రతిరేవునందును నీటిమీఁద దేలియాడు వంతెనలను నిర్మించెను. అవసరమగునపుడు వంతెనల నుపయోగించి రేవుల దాటుటకును, అవసరములేనప్పుడు వంతెనలను దీసివేయుటకును, వీలగునట్టులు వంతెనలమర్పఁబడియెను.

ఇట ప్రతాపరుద్రుఁడు తానుగూడ యుద్ధరంగమున కేగుటకై భద్రగజము నలంకరించి సిద్ధముగనుంచుడని సేవకులకు నియమించెను. దీనిం దెలిసికొని బ్రహ్మనందుడిట్లనియె.

బ్రహ్మ—రాజా? వీరాగ్రగణ్యులగు నన్నమదేవప్రభృతులు యుద్ధరంగమున కేగిరి. గన్నయమంత్రి సామంతుల సైన్యసమేతులనుగా రావింపబ్రయత్నమున నున్నాడు. ఇట

కోటలో దక్షుండగు యోధుడెవ్వండును లేడు. తద్రక్షణమునకై నీవు కోటయందుండవలయును. నీకుంగాక నన్యులకవి సాధ్యముకాదు.

ప్రతా—దేవా? స్వసామ్రాజ్యసంరక్షణమునకై మహాయోధు లెందరో యుద్ధరంగమున నురికి వీరవిహారము నొనరించుచుండ, చక్రవర్తినై యుండియు, ఖడ్గమును నొఱలో నిముడ్చుకొని యీవీరకాయమును గోటలో దాచుకొనుట లజ్జాకరముకాదా? ఈసామ్రాజ్యమున కంతకును ప్రధాన బాధ్యుండను నేను. కార్యభారమంతయును సేవకుల కప్పగించి, తటస్థముగ నుండ రాజలక్షణమే? శ్రీరామచంద్రుడేమి? యుధిష్ఠిరుడేమి, దుర్యోధనుడేమి, వారుస్వయముగ యుద్ధరంగమున్నిలచిగదా సామ్రాజ్యమునకు సేవజేయగలిగిరి. నేనును వారిదారినే త్రొక్కి నాక్షాత్రధర్మమును గాపాడుకొనదలంచుకొంటిని.

బ్రహ్మ—రాజా! నీవుపలికినదంతయును యదార్థము కాని సామ్రాజ్యమున కంతకును కోట యాయువుపట్టువంటిది. దానికి దగిన రక్షకుడు లేకయున్న నెంతబలగమున్నను చేటురాకమానదు. నీప్రతినిధులొకటియు, నీవొకటియుగాదు. నీప్రతాపమే నీప్రతినిధులయందు మూర్తీభవించి కదనమును నడిపించును. అట్టిచో యుద్ధరంగమున నీవున్నను, లేకున్నను, నీవున్నయట్లే యగును గాని వేరుకాదు. కావున నీవుకోటలోనుండి కోటను రక్షించుచు, యుద్ధమునకు గా

వలసిన పరికరముల నన్నిటిని సేకరించుచుండుము.

ప్రతా—దేవా? మీయాజ్ఞకు గట్టుపడితిని. తామీ వార్తను దెలుపకున్న నానగరమీపాటికే పరాక్రాంతమై యుండెడిని. మీయుపకృతికి ప్రత్యుపకృతి, యొకయంజలి దప్ప వేరేమియొసంగగలను.

బ్రహ్మ—రాజా! నీవు పిచ్చివాడవు. మాకు ప్రత్యుపకృతితో బనిలేదు. ఈశ్వర ప్రేరణంబున నీకును నీదేశమునకును హితమును గలుగజేయ నిటకరుదెంచితిని. శిష్టరక్షణంబును దుష్టశిక్షణంబును పరమేశ్వరునకు బ్రీతిదాయకములు. నేనును నాతని మార్గముసే యనుసరించు చున్నాను. నీవిట జాగ్రతగనుండుము. నేనుయుద్ధభూమికిబోయి, మ్లేచ్ఛులతోబోరి నీకుజయము జేకూర్పసంకల్పించు కొంటిని. నాకీశ్వరాజ్ఞయైనది. నేనిటనొకనిమిషమైన నిలువను.

ప్రతా—(గడగడవడంకుచు) దేవా! యుద్ధము చాల భయంకరమైనది. మీశరీరము, శిరీషపుష్పకోమలము. మ్లేచ్ఛులతోబోరుట సామాన్యమైన పని కాదు. మీచేతిదండము తప్ప వేరుసాధనమేమియునులేదు. మీరుయుద్ధమునకు బోవలదు. నామనవిమన్నింపవలయును.

బ్రహ్మ—రాజా! నీవుమిక్కిలి భీతిల్లుచున్నావు. సిద్ధసంకల్పుండనగు నాకు భయమునునదెద్ది? నాశరీరము కోమలంబయ్యును దుష్టసంహారసమయమున వజ్రకఠినమై దనరారును ఈశ్వరుని దయయున్నచో నీదండ మేసర్వాయుధంబులుగ వరి

క్షమించుము. నాక్శ్వరాజ్ఞయైనది. నేనాగువాడను కాను. నీవు మాఱువలుకకూడదు. రాజా! అశ్వశాలకు బోవుదమురమ్ము.

అని పలుకు యోగివాక్యములకు చక్రవర్తినిర్విణ్ణుడై యోగివెంట నశ్వశాలకు జనియెను. బ్రహ్మనందు డశ్వశాల యంతటను దిరిగి యొకయున్న తాశ్వముఁను గాంచి రాజా! నా కాయశ్వంబు నిప్పించుము. అన ప్రతాపరుద్రుడు భయము తోనిట్లనియె.

ప్రతా__ దేవా! ఆయశ్వము మాధవునిది.__ (అని యింకను నేదియోయనబోయెను గాని. మాధవపదమాతనికి దుఃఖమును జనింపజేసెను. ధీరస్వాంతుండగుటచే దానిని దెలియనీయక) అదిమిక్కిలి చెడ్డగుఱ్ఱము. అదాతనికేగాని యితరులకు లోబడదు. దానిమేన జేయివైచుట కేరికినిశక్యముకాదు. కావున నీగుఱ్ఱమును ద్యజింపుడు.

బ్రహ్మ__ రాజా! నీకట్టిభయము వలదు. మాహస్త స్పర్శనంబున నెట్టిదుష్టాశ్వమైనను సాధువర్తనయగును. నీవు సందియింపబనిలేదు.

అనిపలికి, దండంబును కటిప్రదేశమున బంధింపజేసి, రుద్రాక్షమాలికలను సవరించుకొని మందహాసమొనరించుచు, నశ్వంబుకడకేగెను. యుద్ధసమయమగుటచే గుఱ్ఱమునకు జీనువేసిసిద్ధముగ నుంచిరి. అంతబ్రహ్మనందుఁడు దయార్ద్రదృష్టితో నాయశ్వంబును దిలకించి, దక్షిణకరంబుచే దాని

పృష్ఠభాగమున తట్టెను. గుర్రము సకిలించుచు, గ్రీవంబునిటు నటును గదపుచు, కళ్ళెమును గొఱుకుచు, నాతనికి స్వాగత మిచ్చుచుండెను. ప్రతాపరుద్రుఁ డాశ్చర్యస్తంభితగాత్రుఁడై చిత్రప్రతిమవలె గదలక నిలిచి యట్లెచూచుచుండెను. అంతశివయోగి, రికాబులో పాదంబునుంచి యాశ్వారుఁడు సిశా ద్రినధిరోహించు చందంబున నాశ్వేతాశ్వంబుపైకి చెంగున దాటెను. అంతనాయశ్వంబు గ్రీవమునుపైకెత్తి ముందునకురక యత్నించుచుండెను. కళ్లెమును బిగియబట్టి గుర్రమును బల వంతముగ నాపుచు, చక్రవర్తితో నిట్లనియె.

బ్రహ్మ—రాజా! ఈశ్వర ప్రేరణంబున యుద్ధమునకు బోవుచున్నాను. నీకుజయంబుచేకూరు. విచారముగక్క యీ శ్వరుని స్మరించుచు సుఖంబుగ నుండుము.

అనిపలుక ప్రతాపరుద్రుఁడు కృతాంజలిపుటుండై యి ట్లనియె.

ప్రతా—స్వామీ! యుద్ధభూమి యెచటనుండెనో మీ కు తెలియదు. తమకు సహాయముగ నెవరినైన బంపెద.

అన శివయోగినవ్వి, రాజా! మాకు గోచరముకాని దే దియునులేదు. ఇతరులసహాయము మాకొంట్లకవసరములేదు. అచిరకాలముననే సేనలగలిసికొందును. అనిపలికి గుర్రమున కుసంజ్ఞచేసెను. అదియును జూచుచుండగనే మహాజవంబున బేరెము వారుచు బహుదూరముదాటి యదృశ్యమయ్యెను. ఈ సంగతి యాశ్రమములోనున్న యరుణపభునకు దెలిసి, స్వ

దేశమునకుపద్రవము సంభవించిన సీసమయములో పౌరుష కారముగలవాడు సుఖముగ గూర్చుండుట తగదని తలంచి, బ్రహ్మనందుని యాజ్ఞ లేకపోయినను జన్మసాఫల్యము నొందించుకొనవలెనను తలంపుతో నాయుధంబులధరించి గుర్రము నెక్కి మహాజవంబున గుర్రమును నడిపించుచు, నచిరకాలముననే బ్రహ్మనందుని గలిసికొని, గుర్రమునుండియే యాతనికి నమస్కరించెను. బ్రహ్మనందు డేమియు ననలేదు. వీర్యవంతమగు యరుణప్రభుని దేశభక్తికి సంతసించి శిరంబు వంచి వందనమును గైకొని జవంబున రా సంజ్ఞ జేసెను. బ్రహ్మనందుని సీయనుగ్రహాదరంబున కరుణప్రభుని సర్వాంగంబులు నుప్పొంగెను. ఆతనికి రెట్టింపుబలము చేకూరినది. ఆతఁడు బ్రహ్మనందుననుగమించెను.

అట, మల్లిక్ కాఫురు ప్రచండభానుని పగిది మరింత తీక్ష్ణప్రతాపుడై ప్రతాపరుద్రుని సైన్యంబుల నెదిరించవలెనని, గోదావరిని సమీపించెను. కాని తుంగతరంగముల నెడు బాహువులచే వదలించుచు నన్యోన్యతరంగ కరసంఘర్షణంబున హుంకారముల సలుపుచు తన్నంటువారలను సంద్రంబునగలుపునేమో యను భీతిని బుట్టించుచు మహాప్రవాహవేగంబనునావేగంబుతో గోదావరినది నడ్డుగనుండుటచే సేనలతో నానదీతీరంబునవిడిచి దానిని దాటియావలకు రావలయునని బహుప్రయత్నములు జేయుచుండెను. గోదావరి కీవలయొడ్డున నాంధ్ర సైన్యంబులు బారులుదీర్చి, యనన్యసామాన్యతో

త్రితేజంబును వహించి సింహంబులవలె గర్జించుచు, శత్రుసైన్యంబుల నొక్కడుగయినను ముందునకుఁ బెట్టనీయక మొక్కవోవని పరాక్రమంబునఁ బోరాడుచుండిరి. వెదురువంతెనలు కర్రవంతెనలు త్రాటివంతెనలు తెప్పలు, దోనెలు గోదావరియందంతటను యమర్చబడియున్నవి. వానిపైయాంధ్రసైన్యంబులు గోదావరిని దాట యత్నించుచుండెను. గోదావరికిమధ్యభాగంబున సర్వసైన్యాధ్యక్షుం డగు నన్నమదేవుఁడునిల్చి శాసించుచుండెను. ఒకకొన మారయసాహిని గుఱ్ఱపుదళమును గోదావరిని దాటించుచుండెను. వేరొకకొన గజసాహిణిమేచననాయినంగారు కాల్బలమును గోదావరిని దాటించుచుండెను. శ్రీధరుఁ డన్నమదేవున కగ్రభాగంబున నిలిచి సైన్యంబుల బుజికొలిపిగోదావరినిదాటించు చుండెను. అప్పు డుభయసైన్యంబులకును బోరుఘోరంబయ్యెను. శతఘ్నినినదనికాయంబులు శాత్రవవీరుల గుండెలవియజేయుచుండెను. వీరులహుంకారంబులును, సదళింపులును, వీరపురుషుల యన్యోన్యనిసిత ఖడ్గసంఘర్షణరవంబులును, గోదావరీ తరంగఘోషములతో నైక్యమొంది భూమ్యాకాశంబులకొక్కటేధ్వనిగానొనరించుచుచుండెను. ఖడ్గములు వీరమస్తకముల పైనృత్యముసలుపుచు తళతళమెఱయుచుండెను. కనులుచూచుచునేయుండెను. ముఖములునవ్వుచునేయుండెను. హుంకారశబ్దములచే వదనములాపూరితములై యుండెను. అహాహా! ఆటుజూడుము, వీరుల యుత్తమాంగంబులు పైకెగయుచునేల

గూలుచున్నయవి. ఉభయసైన్యంబులలో ఏ వీరపురుషులసే కులు తమప్రాణములను రణభూమికర్పించుచుండిరి. ఇటుగో దావరిని దిలకింపుము? ఈ మొహాంతరముననుదాల్చినది. నిర్మలస్నిగ్ధసుందరమూర్తియై దనరారు గోదావరినది, చూచుచుండగనే రక్తాంబరధారిణియై క్రోధరూపంబునుబూని చండికవలె, భయంకరముగ జూపట్టుచున్నయది. ఆనదియంతయును వీరులమస్తకంబులతోడను కళేబరంబులతోడను నిండియుండెను. అవి, యాప్రవాహవేగమునబడి కొట్టుకొనిపోవుచుండెను.

ఇటుజూడుము? పైకెత్తినహస్తంబులు ఖడ్గములతోడనే నేలగూలుచుండెను. కొందరువీరులు నేలగూలియు, హస్తంబులపైకెత్తి ఖడ్గములవిసరుచునే యుండిరి. ఉభయసైన్యంబులునుగూడ గెలుపోటములు లేక సట్టులేపట్టులతో, బోరాడుచుండిరి. ఉభయసైనికులును, ప్రభుభక్తిపరాయణులై ప్రాణంబు లర్పించుచుండిరి. ఆభృత్యులు వీరావేశంబున తమనాయకవర్తికి జయమునుజేకూర్ప తమప్రాణముల బన్నిసముగనొడ్డి శౌర్యమును జూపుచుండిరి. అహాహా! ఏమియాపౌరుషము? ఏమియాక్షాత్రతేజము? హైందవవీరులు శత్రువులుకూడ కొనిమానుషపౌరుషమున విజృంభించిరి.

ఇంతలో బ్రహ్మానంద శివయోగియు, సరుణప్రభుండును, వాయువేగంబున తమగుర్రములను బరువెత్తించుచు వచ్చి ప్రతాపరుద్రుని సైన్యములలో జేరెను. ఇంతలో నయ్యో

నవోత్రిలునుండి సింగమనాయకుడునుగూడ తనసేనతో వచ్చి కలిసికొనియెను. అంతనాబ్రహ్మనందుని దిలకించి యన్నవదేవ ప్రభృతు లాశ్చర్యమానసులై యుద్ధమునుమాని యట్లేనిలిచిచూచుచుండిరి. ఆంధ్రవీరులెల్లరును, తమఖడ్గహస్తంబుల పైకెత్తి యోగింద్రునకు నమస్కరించిరి. బ్రహ్మనందుడు చేయిపైకెత్తి సైన్యముల నాశీర్వదించెను. అరుణప్రభుడు బ్రహ్మనందుని వెనుకనేయుండెను. ముసల్మాను సైనికులుగూడ యుద్ధమునుమాని యీచిత్రమును దిలకించుచుండిరి. ఇటుచూడుడు! బ్రహ్మనందుడు తనకటిప్రదేశమున బంధింపబడియుండిన దండంబును దీసివిసరించెను, దానిబంధములన్నియువీడి యొకనిశితకరవాల మాతని కరంబున మెరయజొచ్చెను. ఆతడుతనఖడ్గహస్తమును పైకెత్తి యోయాంధ్రవీరసింహములారా! వీరులకు యుద్ధముకంటె మోక్షసాధనము వేరొకటి లేదు. దేశరక్షణభారము మీభుజాపీఠమున నిలిచియున్నది- జన్మదేశముయొక్క హక్కును కాపాడుకొను తరుణమాసన్నమైనది. ఆంధ్రమాత వీరమాత యనిపించుకొనునట్లు విజృంభించి మాతృఋణమును దీర్చుకొనుడు. భయపడకుడు_జయమునిశ్చయము. శత్రువుల దరుముడు. పొడువుడు— ఢీకొనుడు— రండు_రండు— గోదావరినిదాటి యావలకు జనుడు. లెండు-లెండు— రండు—రండు_ యనియుద్ఘోషించుచు, రెండు నిమిషములలో చూచుచుండగనే, గోదావరినిదాటి, శత్రుసైన్యములపైబడి వీరులజెండాడుచుండెను. అరుణప్రభు

డాతని వెన్నంటి శత్రుసైన్యమునజొచ్చి వీరవిహారమొనరిం చుచుండెను. యోగివీరవాక్యములకు పొంగి సైన్యంబులన్ని యును, గోదావరినిదాటి, శత్రుసైన్యములపైబడి చీకాకు పఱచుచుండిరి. యోగీంద్రుని వీరవిహారమునఁగాంచి సైనికు లెల్లరును రెట్టించిన పౌరుషముతో శత్రువుల నఱుమాడదొ డంగిరి, ఆంధ్రులపౌరుషమునకు నిలువనేరక శత్రువులమధ్య భాగమువిచ్చిపోయెను. అంత కొంతయవకాశము చిక్కుటచే హిందువులు శత్రువుల దఱిమిరి. యోగికరవాలము తళతళ మెఱయుచు, శాత్రవమస్తకముల పైనృత్యముజేయుచుండె ను. ఆతనిఖడ్గము రక్తప్లుతమై యుండెను. అతని నిలువుటంగీ రక్తముచే నార్ద్రీభూతమై యుండెను. సాక్షాత్ప్రళయకాల రు ద్రునివలె బ్రకాశించుచుండెను. ఆతనికెదురుగ నిలిచి యెవ చుపోరగలరు. ఆతనికంట బడినశత్రువుఁ మస్తకమెగిరినేలబ డుచుండెను. శత్రువులమధ్యభాగమంతయును విచ్చినలుదిక్కు లకు బాఱిపోయెను. ఒకప్రక్క నన్నమదేవుఁడును, వేఱొక ప్రక్క మాచననాయన ప్రభృతులును, ఒకమొన సింగమ నాయనుడును, వేఱొకమొన శ్రీధరుఁడును. మధ్యభాగంబు న బ్రహ్మానందశివయోగియుఁజేకొని శత్రువుల నఱుమనారంభిం చిరి. మధ్యభాగమిట్లు బాఱినతోడనే మిగిలిన మహమ్మదీ యసేనానులుగూడ సుస్థిరచిత్తులై యుద్ధమున, నిలువఁబడి పోరాడనేరక వెన్నిచ్చి వేరెమువారిరి. అంత నాంధ్రులుహా కిని సఱిహద్దులదాటువఱకును దఱుముచునే యుండిరి. మహా

మ్మదీయసైన్య మంతయును విశేషముగ నష్టమయ్యెను. మ లిక్ కాఫురు సంపూర్ణముగ పరాభూతుడై హతశేషులతో ఢిల్లీకి పాఱిపోయెను. అంతబ్రహ్మనందుడు సంతోషముతో వెనుకకు మరలెను. ఆతనితోగూడ సకలసైన్యంబులను వెను కకు మరలించుకొని యన్నమదేవుండును, మాచనసాహిణి యు, మేచననాయకుడును వెనుకకు మరలిరి. శ్రీధరుండు సింగ మనాయనిం గాంచి కలిసికొని యోరుగల్లునకు రావలసినదని ప్రార్థించెను. దానికి సింగమనాయనుం డిట్లనియె. చక్రవర్తి మాధవుని నాకంటబెట్టినప్పుడే నేనోరుగల్లుదొక్కెదను. అ ని శపథమును బలికి తనసేనలతోగూడ నయ్యెనవోలునకేగె ను. సింగమనాయనుడు యోగంధరుని ప్రసిద్ధిని వినుచుండెను. గాని ప్రత్యక్షముగ నిదివఱకును జూచియుండలేదు. నేడాతని శౌర్యమును కన్నులార గాంచి యోగిపాతావీశ్వరుడేయని నమ్మెను. శ్రీధరుడుగూడ వెనుకకు మరలెను. బ్రహ్మనందు ని పౌరుషమునకు శత్రువులుగూడ భళీ! యనకతీరినదికాదు. సైన్యంబుల నెచ్చటజూచినను, బ్రహ్మనందుని పౌరుషప్రశం సయే. అంత సైన్యంబులు గోదావరిని దాటి విజయపతాకము లతో నేకశిలానగరమున బ్రవేశించినవి.



ముప్పది మూడవ ప్రకరణము.

మధుమతి మేడపై దక్షిణపు వసారాలో పడకకుర్చీలో విచారముతో బరుండి యున్నది. ప్రియజనకుడగు శ్రీధరుడు సుహృన్మిత్రీయులతో బోరాడుటకై పోయినాడు. యుద్ధమున జయాపజయంబు లెట్లుండునో యని భీతియుదయించినది. ఏకాంతమున నుండువారలకు అందులో విచారగ్రస్థులగువారలకు ఆలోచనలు పరంపరలుగా వెలువడుచుండును. ఈయవస్థ మధుమతికి దాపరించినది. ఆమె యిట్లు తలంపనారంభించెను. హా? దైవమా? యుద్ధమున జయాపజయంబు లెట్లుండునోగదా? నాప్రియ జనకుండు మరల సుఖంబుగ నా కంటబడునా? దేవగిరి యుద్ధము ముగిసెనుగదా యని సంతసించుచుండ మరల నీదారుణ యుద్ధము దాపరించినది. దేవగిరిలో శేఫరకలు గావించిన దుండగములు గుండెలవియజేయుచున్నాయని, దేశపరిస్థితి, యిట్లుండ నిటనింటిలో నాజనని నావాక్యముల కలుగుటయేగాక, తనమనోరథము వ్యర్థము గావింపబడినదని దుఃఖించుచున్నది. కామపాలు డింకను తనదౌష్ట్యమును మానకుండెను. అతడు కుపితుడై యున్నాడు. నన్నొంటరిగ జూచి భంగపరచవలెనని కాచి యున్నాడు. ఆతని తప్పించుకొనుట బహుకష్టముగానున్నది. దినదిన గండము దెయ్యములపోరు. అనుసామెతలోనికి వచ్చినది నా బ్రతుకు నేనెల్లరియాగ్రహమునకును బాత్రనైతిని. ఎల్లరి విషాదమునకును హేతువైతిని. నేనెనటికో యీకీయవస్థకు బాల్పడితినో

యామాధవుని జాడగానరాదయ్యె. బ్రహ్మానందుని ప్రార్థించి మాధవుని యునికి దెలిసికొని యాతని యజ్ఞాతవాసక్లేశముతో బాపఁగాఁ దగుట కుపాయముఁ దోఁచుటలేదు. యోగీంద్రుఁడు యుద్ధమునకు బోయియుండెను. నాఁడు గుఱ్ఱము నెక్కి యుద్ధమునకు బోవుచుండ నీయనయే బ్రహ్మానందుఁడని తాత చెప్పినప్పుడాతని జూచితినిగాని, చూచుచుండఁగనే గుఱ్ఱముతో యోగియదృశ్యుఁడయ్యెను. యుద్ధమింక నెంతకాలము జరుగునో జయాపజయంబు లెట్లుండునో తెలియదు. అని తలపోసి, ఏమియుందోఁచక, కుర్చీనుండి లేచి యిటునటును బచారి జేయుచుండెను, నిమిష నిమిషమునకుఁ దక్షిణపువసారాలోనుండి వీథిం బరికించుచు బిచ్చియెత్తినదానివలె నుఱ్ఱుగుర్చిపైఁ గూర్చుండెను. ఆమెకు తనజీవితకాలమున సుఖమబ్బు తెఱవు గానుపించుటలేదు.

ఇట్లుండ వంగిన నడుముతో బండి తెల్లబారి ముగ్గుబుట్టవలెనుండిన శిరంబుతోఁ జేతికఱ్ఱతో నేలను గొట్టుచు, శిరఃకంపము జేయుచు విశ్వాసరాయుఁడు వడివడి మధుమతి గదిలోనికివచ్చెను. అంతమధుమతి తాతనుజూచి యిట్లనియె.

మధు—తాతా! నీవు సంతోషముగ నున్నట్లు కనఁబడుచున్నావు. ఏదియో శుభవార్త యుండనోపు.

విశ్వా—ఔను నేనిప్పుడు సంతోషముగనే యుంటిని. తుఱకలను బాఱఁదోలి నీతండ్రి యోగీంద్రునితోఁ గూడ వచ్చుచున్నాఁడు. మనవీథినే వారు సైన్యములతో దుర్గమునకుఁ బోవుదురు. లెమ్ము కిటికీని దెఱచి వీథిని దిలకింతము.

మధుమతి ముఖమించుక వికసించెను. ఆమెమనోగత చింతలు కొంచెము దూరమునకుఁ దొలఁగెను. కొంతవిశ్రాంతి చేకూరినది. అంతనామె చటాలున కుర్చీనుండిలేచి వసారాలోనికేగి గవాక్షమును దెఱచి వీథినిదిలకించు చుండెను. రక్తసిక్తమై శుష్కమైయున్న నిలువుటంగీతోఁ కటిసంబద్ధకరవాలంబుతోఁ శ్వేతాశ్వంబు నధిరోహించి, బ్రహ్మానందుఁడు ముందె వచ్చుచుండెను. అతని దక్షిణపార్శ్వంబున నన్నమదేవ ప్రభృతులును, వామభాగంబున శ్రీధరుండును నశ్వంబులపై నధిరోహించి యోగితో వచ్చుచుండిరి. మధుమతిగవాక్షమునుండి యావీరులను జూచుచుండెను. క్రమంబుగ నామె దృష్టియంతయును యోగిపై లగ్నమయ్యెను. తానితరులకు గనఁబడుచుంటినను దృష్టియామెకులేదు. ఆమెనిశ్చలదృష్టితో యోగిని జూచుచుండెను. అంతయోగి ప్రభృతులు సౌధమును సమీపించిరి. శ్రీధరుఁడు గుర్రముఁనాపెను. యోగినాతని నుపలక్షించెను. అంతశ్రీధరుఁ డిట్లనియె. స్వామీ! ఇదియేనా సౌధము. అని హస్తముతో జూపెను. యోగిగుఱ్ఱమునాపెను. వారితోబాటు తక్కినవారు గుర్రములు నాపిరి. అంతయోగి మస్తకమును పైకెత్తిసౌధమును పలక్షించెను. మధుమతియోగికి నమస్కరించెను. వారిదర్శనంబుచే దనసకలపాపక్షయంబయ్యె ననితలంచుకొనియెను. ఆనమస్కారము తగిననినియోగమునకు వచ్చినది. యోగిదానిం బరిగ్రహించెను. ఆతఁడు తదేకదృష్టితో సౌధమును జూచుచునే యుండెను.

కొంతవడికి యోగి యిట్లనియె. శ్రీధరా! నీసౌధము మిక్కిలి సుందరమైనది. నాకుఁ జాలసంతోషమైనది. మీఁజిలు లోని కెగెదరా?

శ్రీధరుఁడు నేనుమీతో గోటకు వచ్చెదను. చక్రవర్తిని దర్శించి యింటికివచ్చెదను. స్వామీ? నాదొకకోఱిక గలదు. తమపాదధూళిచే నాగృహంబును బావనంబొనరింప వలయును.

యోగి—శ్రీధరా ? నీవిజ్ఞప్తికిదిసమయముకాదు. రండు కోటకు బోవుదమని గుర్రము నదళించెను. ఇట్లుండనింతలో ప్రతాపరుద్రుఁడు, భద్రగజంబునెక్కి యోగీంద్రుని, సేనానులను నెదుర్కొనుటకై బయలువెడలి యెదురుగావచ్చెను. రక్తసిక్తకంచుకంబుతోడను దరహాసంబుతోడను శ్వేతాశ్వముపై దనరారియున్న యోగింగాంచి నమస్కరించి కేలొసంగి భద్రగజంబుపై నెక్కుఁడని కోరెను. యోగిమందహాసమొనరించి రాజా? ఈశ్వరాంశసంభూతుఁడవగు నీకు దక్కనన్యులకందుస్థానములేదు. ఆంధ్రసామ్రాజ్య రక్షణభారమును వహించిన చక్రవర్తికిదప్ప నందితరులకు తావులేదు. మాకోటిసన్యాసులతపోబలంబున నీవీరపురుషుల భుజపరాక్రమబలంబున నేటికినీవు నీసామ్రాజ్యమును రక్షించుకొనగిలిగితివి. నీవృథస్వతముండవు. అనబ్రతాపరుద్రుండిట్లనియె. దేవా? ఇందీప్రతాపుని ప్రతాపమేమియును లేదు. నేను నిమిత్తమాత్రుఁడను. నాయెదుట బ్రకాశించుచున్న నీవీరపురుషులు,

ప్రభుభక్తిపరాయణులై ప్రభుభక్తియే కాదు. సామ్రాజ్య సంరక్షణసాధకులై నిరుపమానమగు తమత్యాగ పరాక్రమ ప్రదర్శనమున సామ్రాజ్యమును రక్షించుకొనిరి. మరియుమీ బోటి తపోధనుల తపశ్శక్తికూడ నిందుకు దోడ్పడినప్పుడు నా బోటి పృధివీశున కేకొరంతయు గలుగనేరదు. అను ప్రతా పుని వాక్యములకు యోధులెల్లరును హర్షించి శిరఃకంపమొ నరించిరి. అంతప్రతాపరుద్రుడు విజయధ్వానములతో ముం దునడువ నందరును గోటలో బ్రవేశించిరి. ఇటు మధుమతి తనదృష్టులు బారినంతమేర వారలజూచుచు లోనికేగెను. అ న్నమదేవ ప్రభృతులు యోగీంద్రుని యుద్ధకౌశలంబును ప రాక్రమంబును, ప్రతాపరుద్రునికడ గీర్తించిరి. ప్రతాపరు ద్రుడు సంతోషస్వాంతుండై యందరను గీర్తించి వారివార కివగు సత్కారంబు లొనరించి, యుద్ధపరిశ్రమంబున నలసి యున్న సేనానుల కెల్లరకును నిజనివాసంబునకు బోవననుజ్ఞని డెను. వారును చక్రవర్తికి నమస్కరించి సెలవులుగైకొనిచనిరి. బ్రహ్మానందుడును తన యాశ్రమంబునకు బోయి కృతస్నా తుండై శుద్ధ కాషాయాంబరముల ధరించి మంటపమునను పవిష్టుడై ధ్యానమొనరించు కొనుచుండెను. అరుణప్రభుడు ను స్నానమొనరించి శుభ్రవస్త్రములను ధరించి యోగిచెంత గూర్చుని యుండెను. ఇంతలో నెచ్చటనుండియో యోగానం దు డరుదెంచెను. మల్లిక్ కాఫురునకు గలిగిన పరాభవమును ప్రతాపరుద్రుని విజయమును బ్రహ్మానందుని పరాక్రమ

కీర్తనంబును విని మహదాశ్చర్య సంభ్రమములతో భీషణాజ
య దేవులు యోగికడ కరుదెంచి నిలిచియుండిరి. యోగీశ్వరుల
దెంచి యంగరక్షపాదప్రక్షాళనంబొనర్చి, భీషణజయదేవులను గూ
ర్చుండ సంజ్ఞచేసెను. అందరును గూర్చుండిన పిదప బ్రహ్మా
నందు డిట్లనియె.

బ్రహ్మా—యోగానందా? మేమువచ్చునప్పటికి నీవా
శ్రమములో లేవు. ఎచ్చటికేగితివి?

యోగా—దేవా? తాము యుద్ధమున కేగి యుండుట
చే నిచ్చటనేమియుం దోచక యందందు దిరుగుచుంటిని.

బ్రహ్మా—వత్సా? నాడు తిరిగి నీతో జెప్పకయే పోవ
లసివచ్చినది. కోపగించితివా యేమి?

యోగా—దేవా? క్షమింపుడు. మీ శిష్యుడింతవరక
ట్టి యకార్యమునకు దిగలేదు. స్వామీ? తాము బాల్యమునుం
డియు తపోనియమంబున జరించుచుంటిరి. సర్వదా యోగా
భ్యాసమునందే యుందురు. గురుములపై స్వారివెడలుటయు,
కత్తిబట్టి మహాకౌశలంబున యుద్ధమొనరించుటయు ననునీవి
రకర్తల నెప్పుడభ్యసించితిరి.

బ్రహ్మా—వత్సా? ఈశ్వరాదేశముచే మాకట్టిశక్తిక
లిగినది. లోకరక్షణార్థమా దేవదేవుడా శక్తిని నాకిచ్చియు
న్నాడు. ఇదంతయు నీశ్వరప్రభావము తప్ప వేరొండుకాదు.

భీష—స్వామీ? మాకు సంపూర్ణమగు పశ్చాత్తాప
ము గలిగినది. దేవగిరిలో మాకుటుంబములు తిండిలేక మల

మల మారుచుండును. కావున దయయుంచి మమ్మాఁబిడ్డల తో గలుపఁగోరుచున్నాము.

బ్రహ్మ—దానికింకను సమయము రాలేదు. కొంత కాలమువరకు మిమ్ముల వదఁ వీలులేదు.

అరు—దేవా! ఈదేశద్రోహులను వదలవలదు. వీరుమరల ఢిల్లీకిబోయి కుట్రల బన్నెదరు మాతృదేశము ను మ్లేచ్ఛాధీన మొనరింప లంచములు మేసియుండిరి. ఆపదు వు ధనమంతయునేగంగలో గలిసినది. ఈద్రోహుల పోషణ చేకయున్న వీరికుటుంబములు బిచ్చమెత్తుకొని పవిత్రవంతము గజీవితమును గడపగలవు. వీరికుతంత్రము లేపారియుండినచో నాంధ్రదేశ మీపాటికెట్టి దుస్థితియందుండును? ఇకముందు దేశద్రోహ మొనరించువారల కాదర్శకముగా వీరలశిక్షించుట దేశక్షేమకరము.

జయ—అరుణప్రభా! మేమిప్పటికే జీవచ్ఛవముల మైయుంటిమి? మమ్మాశాసౌధముల నుయ్యాలలూగించుటయె కాని మహామ్మదీయు లొకదమ్మిడియైనను మాచేతబెట్టలే దు. ఉపరి యింతవరకును మేమార్జించిన ధనమంతయు నీదు ష్కార్యమున కుపయోగపడినది. దేశాంతర వాసశిక్షయు, ప్రభుపరాభవమును, మమ్ము వేధించుటచే దెలిసియో తెలి యకయో, మానవజన్మ సహజమగు క్రోధసాధనమునకై మస్తంత్రముల బన్నిన మాటవాస్తవము. మేమెవరిని నాశ ముంచి యాతంత్రమును నడిపితిమో వారికిని మాకును గాఢ

జగిన పరాభవమైనది. ఈయాఘాతముచే మేముసంపూర్ణ ముగ పశ్చాత్తప్తులమైతిమి. ఇంతకంటె లోకమునకు నిదర్శ నమేమి కావలయు. నరుణప్రభా?

అరు—విద్రోహులు ప్రాణము మీదికి వచ్చినప్పు డెంతటి పశ్చాత్తాపమునైన బ్రదర్శింతురు. మరలబయట బడిరేని యప్పటియాటనే యాడుచుందురు.

భీమ—మావిద్రోహము మమ్మొకుక్రింగదీసినది. మా నుదుట శాశ్వతముగ నీచిహ్నము ముద్రింపబడినది. ఆంధ్ర సామ్రాజ్యమునకు మేము వెలిస్థమైతిమి. ఇకమాదు స్వతంత్రము లీసామ్రాజ్యమున దలయెత్తుకెటులో జెప్పు మరుణప్రభా?—(బ్రహ్మనందు నుద్దేశించి) స్వామీ? మమ్ము ప్రథమమునర క్షించితివి. మాకు హృదయ పరివర్తన మొనరించి సన్మార్గ మునకు దింపితివి. ఇకనుమ్ము భక్షించినను రక్షించినను చింతలేదు.

బ్రహ్మ—భీమణజయదేవులారా? మీపశ్చాత్తాపము ను నేను శంకించుటలేను. మీరు కాలవశమున జన్మస్థానము నుజేరుకొంటిరి. సచ్చింతతో మీహక్కులను మీరనుభవింపు డు. మీకుటుంబముల నిటకు రప్పించెదను. అని అరుణప్రభు నుద్దేశించి అరుణప్రభా? నీవు ప్రాణముల బన్నిదముగ నో ర్షి మహాయుద్ధమున మాతృసేవజేసితివి. నీవంటి సత్పుత్రులిం కను నుండబట్టియె దేశమాత కొకింతయూఱట గలుగుచున్న

ది. నీతో నొక రహస్యమును జెప్పెదను వినుము. ఏమతము పై ప్రభువలిగెనో యామతస్థులే సామ్రాజ్యసంరక్షణమున కుపయోగపడిరను నిదర్శనము నీవలన గలిగినది. కనుక నే భీమణజయదేవుల నిందుమరల నిలిపితిని. దీనితో చక్రవర్తికి మతావేశ మడుగంటగలదు. మీత్యాగమే యిందుకు బ్రధాన హేతువు.

యోగి వాక్యముల కందరును చకితులైరి. అరుణప్రభు డమందానందము నందెను. భీమణజయదేవులు సంతసించిరి. సాయంసమయ మగుటచే నందరును లేచి సంధ్యోపాసనకై నదికిబోయిరి.

## ముప్పదినాల్గవ ప్రకరణము.

యుద్ధము ముగిసినేటికి రెండుమాసములైనది. సింగమనాయనుడు యుద్ధభూమినుండియే యయ్యన మోత్రలునకేగుటచే చక్రవర్తికి కించగలిగినది. అతనిశపథము చక్రవర్తికి మిక్కిలి కోపకారణమైనది. అయినను చక్రవర్తి శాంతించి యుద్ధమున నాతడొనరించిన సేవకుసంతసించి సింగమనాయనుని దోడుకొని రమ్మని శ్రీధరుని బంపెను. శ్రీధరుడయ్యన మోత్రలునకేగెను. ఇట రుక్మిణియు, శ్యామలాదేవియు, సుహ్నత్రైదుకూలములను ధరించి పైడిపళ్ళెరములలో ఫలంబులును బుష్పములను, కస్తూర్యాది సుగంధద్రవ్యములును నుంచుకొ

ని శ్రీకేశవస్వామివారి యాలయంబునకు బోవనుత్సుకతతో నుండిరి. శ్రీధరుఁడు యుద్ధమునుండి సుఖంబుగ నింటికివచ్చిన, కేశవస్వామికి సహస్రార్చన మొనరించి యైదు కుంచముల గోఘృతమును దీపారాధనము జేసెదనని రుక్మిణి మ్రొక్కుకున్నది. నేడేకాదశి యగుటచే నామ్రొక్కును దీర్పుటకై రుక్మిణి హరివాసర మొనరించినది. ఆమెతో బాటు శ్యామల కూడ హరివాసర మొనరించినది. సాయంసమయమైనది. విశ్వాసరాయుడు ఘృతపాత్రమును బట్టించుకొని ముందుగఁ గేశవస్వామి యాలయంబునకు జనియెను. కోకిలలోన వంట చేయుచుండెను. రుక్మిణి కామపాలుని పిలిచినది. ఆతఁడు బలుకలేదు. పిమ్మట శ్యామల పిలిచినది. దానికిని ప్రత్యుత్తరము రాలేదు. ఆతఁడాలయంబునకుబోయి యుండునని తలంచిరి. పిమ్మట రుక్మిణి మధుమతిని బిలిచి, అమ్మా! మేముస్వామి దర్శనము జేసికొని యిప్పుడే వచ్చెదము. లోనకోకిలయున్నది. వీధితలుపు వేసికొని యింటజాగ్రతగ నుండుము. అని పలికి రుక్మిణీ శ్యామలలు సవారీ నెక్కి కేశవాలయంబునకు బోయిరి.

మధుమతికి కేశవస్వామిని దర్శింపవలెనని కోరిక కలదు. కాని తల్లిరమ్మని పిలువక పోవుటచే తానాయూహను జంపుకొని, వీధితలుపులకు లోన గొండెమువేసి గదిలోనికిబోయి కుర్చీపయిని గూర్చుండి యేమియో యోచించుకొనుచుండెను. మాటలాడుటకు తాతకూడ నింటలేకపోవుటచే

నేమియు దోఁచక మాధవచిత్రపటము కంటబడుటచే దానిం దీసి కనులకద్దుకొని ముద్దిడి, కురులను సవరించుచు వక్షంబునఁ జేర్చుకొని మరల కనులనద్దుకొని యనేక వికారములకు లోనగుచుండెను. ఏమియో చిత్రపటములతో మాటలాడ నాడంగెను. చిత్రపటము మాటలాడునెట్లు? పాప మామెకాశాభంగమైనది. కనులనుండి వెచ్చని నీరుగార్చినది. ఈభావనలచే నామె కేమి సుఖము గలుగ గలదు. కొంతవడి కామె కుర్చీనుండి లేచి మంచముపై బరుండి, చిత్రపటమును హృదయమున నుంచుకొని నాపోవుచుండెను. ఇటుజూడుడు! దక్షిణపు వసారాలో నొక పురుషు డిటునటు బచాళి జేయుచున్నాడు. ఈతడు కామపాలుడు యింటిలోదాగి యుండెను. రుక్మిణీశ్యామలల బిలుపునకాతఁడు పలుకక దాగియుండెను. రుక్మిణీ శ్యామలలేగిన బిదప నీవలకువచ్చి వసారాలో బచాళిజేయుచు నాలోచించుచుండెను. ఈతని నేత్రము లరుణములై యుండెను. ముఖమున క్రోధదేవత తాండవమాడుచుండెను. కొంతవడికి నెమ్మదిగ మధుమతి గుమ్మముకడకు వచ్చి నిలచెను. మధుమతి వేరొక ప్రక్కకొత్తిగిలి చిత్రపటమును జూచు చుండెను. కామపాలుఁడు మంచము కడకేగి నిలిచెను. ఆమె యీతనిని జూడలేదు. అంత కామపాలుఁడదాటున నామెచూచుచున్న చిత్రపటమునీవలకు లాగెను. ఆమె త్రుళ్ళిపడిలేచి కూర్చున్నది. కామపాలుడాపటమును దూరముగ విసరివైచెను. ఆమెకుఁ గంపముపుట్టెను. మేనంతయుఁ జెమ్మటపట్టెను. హృదయము దడదడ కొట్టుకొను

చుండెను. అంత కామపాలుఁడు మంచముపట్టెపై నొక కాలు ను, క్రింద నొక కాలునుంచి నిలువంబడియెను. మధుమతి లేవబోయెను. కామపాలుఁడు కదలకుండ నామె చేతిని గట్టిగఁ బట్టుకొనియెను, ఆమె అయ్యోయని యొక కేక వేసెను. అది వట్టియరణ్యరోదనమైనది. కోపముతో కామపాలుఁడిట్లనియె.

కామ—నిన్నిప్పుడు స్వర్గమునుండివచ్చి మాధవుడు రక్షించు ననుకొనియెదను.

మధుమతి మఱల నయ్యోయని యఱచెను. దానినివి నువారం దెవరును లేరు. కోకిలకు పనియందు పట్టుదలహె చ్చు. పనిపూర్తియైన గాని వంటయింటినుండీవలకు రాదు. ఇంతియేగాక యామె ఈమె కేకలు వినబడనంతదూరములో గూడ నుండెను.

కామ—ఏల యరచెదవు మధుమతీ? రాజావమానం బున మృతినొందిన మాధవుఁ డడ్డుపడు ననుయాసకలదా యేమి?

మధుమతి మారువలుకలేదు. ఆమెతలవంచెను. మేను గడగడ వడంకుచునే యుండెను. ఏమియును బొలుపోవుటలే దు. కన్నీటిని గార్చుచుండెను.

కామ—ఎందుల కీమృషాదుఃఖము. నేను జాలిపడు వాడనుగాను. స్తబ్ధముగ నుండుటకు చిత్రపటంబును గాను. కామపాలునిగలయుటకైనొసి కామము తీరుఁగాని చిత్రపటము తోదీరదు.

మధుమతి ముఖమెఱ్ఱబడియెను. కనుబొమలు ముడి పడియెను. ఆమె ముఖమాతనికి ద్రిప్పి ఛీ! దురాత్మా? నా చేయివీడుము.

కామ—మధుమతీ? నేను నీపాణిగ్రహణ మొనరింప వచ్చితినిగాని వీడుటకు రాలేదు. నీవంగీకరించిన మేలగు. అంగీకరించకున్న గాంధర్వవిధిని నిన్నుబరిగ్రహించెదను.

మధు—ఓరీ? దుశ్శీలుడ? నాప్రాణములను హరించిన హరించెదవేమో కాని నామానమును హరింపనీతరముకా దు. ద్రౌపదినిబట్ట యత్నించిన కీచకున కేగతి పట్టినదో నీ కును నదియేగతి పట్టును. దొంగవలె వచ్చి కదలకుండ జేతు లు బంధించి బలాత్కారముగ నన్నాడంబరుమట సీతనను కాదు. దమయంతిని బలాత్కరించిన కిరాతుని గతికిబాల్పడ కుము.

కామ—నీనిందలకును శాపనాకారములకును నేనుభ యపడువాడను కాను. నిన్ను బట్టియుంచుట నీకుబాధాకర మేని చేతులను వదలుచున్నాను. అని చేతులను విడిచి- నీకు రెండు నిమిషములు వ్యవధినిచ్చితిని. ఆలోచించుకొనుము. యౌవనవంతులగు స్త్రీపురుషులు కాంక్షించు మహానంద మున నోలలాడుదముర మ్మా?

మధుమతి రక్తనాళములనుండి వేడిరక్తము ప్రవహింప జొచ్చెను. ఆవేడిమికి మేనంతయును కరిగినది. ఉపాయము న నీ యపాయమును దొలగించుకొనవలెనని సంకల్పించినది.

ఆమె యిట్లనిరీతే, అయ్యో! కోకిలవచ్చుచున్నది. నేనేమిచే యుదును. త్వరగ మంచమునుండి దిగుడు— అన కామపాలు డు చట్టున మంచమునుండి దిగి ద్వారముకడకేగి వసారాలో తొంగిచూచెను. ఇంతలో మధుమతి మంచమునుండిదిగి గది లోకుర్చీపైనానుకొని నిలిచియున్నది. కామపాలుడునవ్వి, మం చియుక్తిని బన్నితివే. కోకిలయునులేదు, గీకిలయునులేదు. న న్ను దప్పించుకొనవలెనని నిశ్చయించుకొంటివా? కానిమ్ము. నిన్ను తుదిమాట యొకటడిగెదను. నిన్ను నేను ప్రేమించితిని. నాశరీ రము నీకుధారవోసెదను. నీకుసర్వోపచారంబులను జేయుచు ద్వితీయ సుఖంబు నాపాదింప జేసెదను. నీవునన్నంగీకరింపు ము. అట్టిబాసయిచ్చినచో నిన్నిప్పుడు విడచెదను.

మధు—నేను నాడే చెప్పియుంటిని.

కామ—ఆసంగతి యిప్పుడువలదు. అదినాసమక్షము నజరిగియుండలేదు. ఇది మనసమక్షమున జరుగు నంత్యనిర్ణ యము.

మధు—నన్ను బలవంతము పెట్టవలదు. నామనసుమా ధవునియందు లగ్నమయ్యెను. అదిమరలదు.

కామ—మాధవుడు మృతినొందిన నేమిచేసెదవు?

మధు—అదినిశ్చయమే యైనచో నేనును నాతనినే యనుసరించెదను.

కామ—ఇట్టి నిండు యౌవనములో నట్టిగతి కేలపాల్ప డవలయును.

మధు—విగతభర్తృకనై యుండుటకంటె చావు మేలుకాదా?

కామ—మాధవుని యందముతో నాయందము సరిపడియుండలేదా?

మధు—మీయందమును నేనుశంకించలేదు.

కామ—అట్లైన నన్ను బెండ్లియాడుము?

మధు—అది పొసగదు. ముమ్మాటికిని పొసగదు.

కామపాలునకు పట్టరాని కోపము వచ్చినది. అతఁడు గుభాలున మధుమతిపైకి దుమికి, ఏలపొసగదో చూచెదను గాక? అని ఆమెను పట్టబోయెను. మధుమతి రౌద్రమునుదాల్చిన చండికవలె నగల్చి యుత్తేజిగ నాతనిచేతితో నావలకు నెట్టెను. ఆయూపునకు కామపాలుడు వెనుకనున్న మంచమునకు తాకెను. కొంతవడి కాతడు మంచమునానుకొని మరల ముందునకు దుముక యత్నించుచుండ మధుమతి తనమొలనుండి కత్తియొడ్డాణమును నూడబెరకి చేతబట్టుకొని యనేక చిత్రగతుల గిరిగిర డ్రిప్పుచు ఓరీ ? దురాత్మా? అబలనని తలంచి నన్ను భంగపెట్టజూచితివి. ఆడుదికూడ మానిసియే. ఈభరతభూమిలో పౌరుషవంతు రాండ్రగు స్త్రీలుగలరు. నాకు మాధవుఁడు నేర్పినవీరవిద్యనే నేనిపుడాతనికి బ్రతినిధినై చూపుచున్నాను. నాప్రాణములు పోవుటయో, నీప్రాణములు పోవుటయోజరుగవలెను.నాబొందిలోబ్రాణమున్నంతవరకు నేను నీకు స్వాధీననుగాను. అని వీరావేశంబున కామ

పాలునిపై పునకు నడచెను. కామపాలుఁడు రిచ్చవడి, యచ్చటనేదియైన యాయుధ మున్నదేమో యని యిటునటు బరికించెను. ఆ యుధమెచ్చటను గనుపించుట లేదు. మధుమతి సమీపించినది. గుభాలున మంచముపైకిదాఁటి నిలిచినాడు. మధుమతి కత్తిని ద్రిప్పుచునే యున్నది. కామపాలుఁడు పైనను, మధుమతి క్రిందను నుండుటచే గామపాలుఁడామెకత్తి చేతిని బట్టుకొనినాడు. మధుమతి రెండవచేతితో నాతని జేతిపై పొడిచినది. అతని చేతిపట్టు వదలినది. ఇంతలోబనిపూర్తి యగుటచే గోకిల చెంగుచెంగున దాటుచు మేడమీఁదకు వచ్చినది. ఆధ్వనికదరిపడినాడు కామపాలుఁడు. కోకిల మధుమతి గుమ్మముకడకు వచ్చి, హఠాత్తుగ నీభయానక దృశ్యమును జూచి కెవ్వున కేకవేసి నేలగూలినది. మధుమతివెనుదిరిగిచూచి చట్టునకోకిల కడకు బఱువెత్తెను. కామపాలుడానందున తప్పించుకొని పాఱిపోయినాడు. మధుమతి కత్తినిక్రిందబడవైచి కోకిలకు శైత్యోపచారములు చేసినది. కొంతవడికి గోకిలకు దెలివివచ్చి కనులువిప్పి చూచిగుబాలున లేచి అమ్మో! మధుమతి—మధుమతి! యనిమధుమతిని కౌగలించుకొనినది.

మధుమతి—(యోదార్చి) కోకిలా! భయపడకుము. భగవదనుగ్రహమున ప్రాణమానంబులు రెండును దక్కినవి. ఆకిరాతుఁడు నాకై వలబన్ని తానేయందు జిక్కుకొనితప్పించుకొనిపాఱిపోయినాడు. నాతల్లియు,నీతనితల్లియు స్వామిదర్శనమున కేగినయదనుజూచియింటనక్కిసన్నసన్నముగనాగదిబ్రవేశిం

చి నన్ను బలాత్కరింప మొదలిడినాడు. నేనగతికనై మానర క్షణమునకై కత్తిని బట్టవలసివచ్చినది.

ఇదంతయునువిని, యావెఱ్ఱిబాగులకోకిల,పట్టరానిదుఃఖమున కెవ్వననేడ్చుచు మధుమతిని మఱింతగట్టిగ కౌగలించుకొనినది. కొంతవడికి దుఃఖముపశమిల్లుటయు, కోకిల నెమ్మదిగ నిట్లనియె.

కోకి—నాతల్లీ?నాయదృష్టమున నీగండమునుండి బ్రతికి బయటబడితివి. ఆపాడుపనితొందఱయేగాని, కష్టసమయములో నీకుపకరింపక లేకపోతిని. ఎట్టిదురంతముతల్లీ? ఎంతటి కష్టజీవివైతివితల్లీ? మీయమ్మయు నత్తయు రానిమ్ము. నీతండ్రిరానిమ్ము?ఆదుర్మార్గుని కండ—

మధు—వలదు_వలదు_కోకిలా? తొందరపడి నీవుచెప్పితివేని గృహమున హాలాహాల ముదయించి సర్వనాశనమగును. నామూలమున గృహమునచిచ్చు రగుల్కొనుట నాకిష్టములేదు. అత్తకీకథనువినుపించుటలో బ్రయోజనమేమియు నులేదు. ఈదురంతము నాతండ్రిచెవింబడిన సర్వనాశనమగును కోకిలా? నాపై నీకు ప్రేమగలదేని నీహృదయమునుం డీసంగతిని బైటకురానీయకుము.

కోకి—తల్లీ? నీయానతి జవదాటుదాననుగాను. అని మధుమతిని మఱలకౌగలించుకొని మఱలనేడ్చినది. కోకిలభక్తి ప్రేమ పరిపూరితహృదయమునుండి పొంగిన దుఃఖమునకు మధుమతి నీరవమైకోకిలమస్తకమున ప్రేమాశ్రువులను రాల్చి

నది. ఇంతలో వీధివాకిట బోయలధ్వనివినవచ్చినది. కోకిలము ఘమతి కౌగలినుండి మెల్లగజాఱితలుపులుదీయ క్రిందకి బోయెను.

---

ముప్పదియైదవ ప్రకరణము

తన స్నేహితుల యింటశుభకార్యమునకై బోయెద నని తల్లితో జెప్పి కామపాలుడూరిలోనికి బోయినాడు. ఇంట భోజనము చేయుటలేదు. రాత్రి యేపదిగడియలకో వచ్చిపరుండి తెల్లవారుజామున లేచిపోవుచున్నాడు. మూడు దినములు గడచినవి. నేడుకృష్ణచతుర్దశి. సూర్యోదయమగు చుండెను. పూర్వదిశాంగన, ప్రసవవేదన ననుభవించు చున్న దాయనునట్లు,కపోతాదిశకుంతసంతానములు, మేలుకాంచి తెక్కలంగదపుచుఁ దమగూండ్లయందు హుంకృతుల జేయుచుండెను. శయ్యలనుండి కొందరులేచిరి. కొందఱులేచుచుండిరి. లేచిన వాఱలు లేవనివాఱలనులేపుచుండిరి. మధుమతిమేలుగాంచెను. ఆమెజూచుచు శయ్యయందట్లేబరుండియుండెను. ఆమె తనలో దానేదియో మాటలాడు కొనుచుండెను. ఇదివఱకే మేలుకాంచి దక్షిణపు వసారాలో సుఘమతి గదికిటికీ రెక్క చాటుననుండి కామపాలుఁడు మధుమతి మాటలను వినుచుం

జెను. ఆమెమాటలాగెను. కామపాలుఁడు తలయూచి మేడ దిగి యూరిలోనికి బోయెను. మధుమతి శయ్యనుండిలేచి ప్రాతఃకృత్యముల నిర్వర్తించుకొని తనగదిలో కుర్చీపైనఁ గూర్చుండెను. కాలమెప్పటికిని నొక్కవిధముననే జరిగెడువారు చుండును. రెండుయామములు గడచినవి. కొంతవడికి మూడుయామములు గడచినవి. సాయంసమయము మేతెంచినది. అదియుఁ గడచెను. రాత్రి రెండు యామములయ్యెను. మధుమతిగదినుండి వసారాలోనికిని వసారాలోనుండి గదిలోనికి నాత్రముతోఁ దిరుగుచుండెను. వసారాలోనుండి వీధినిఁదిలకించి భయపడుచుండెను. మరల గదిలోనికివచ్చి ధైర్యమవలంబించుచుండెను. విశ్వాసరాయు డిదివరకును కామపాలుని భయముచే నొకటిరెండు పర్యాయములు మధుమతి గదిలోనికివచ్చిపోవుచుండెడువాఁడు. నేటిరాత్రి యాతఁడింటికి రాకుండుటచే నిశ్చింతతో దనగదికిబోయి పరుండెను. నిద్రాదేవి మోహానాస్త్రమున సగులోకని జగంబంతయును నిశ్శబ్దముగ నుండెను కాముకులును, చోరులును, హంతకులును తప్ప దక్కినజీవకోటి యంతయును నిద్రాయత్తమై యుండెను. మధుమతి,తన గదితలుపుల కన్నిటికిని లోన గొండెములువేసి పెట్టెనుండి ఒకతెల్లని దువ్వలువందీసి దానిచే ముఖము తప్ప శిరమునుండి పాదములవరకును గల సకలాంగములను గప్పుకొని యొక్కనిమిషము కుర్చీపయిని గూర్చుని కనుల మూసి తనమనః పద్మపీఠంబున నీశ్వరుని బ్రతిష్ఠించి . ఓదయామయా!

మోహభక్తవత్సలా? యోజగత్పితా? సర్వేశ్వరా? సకలకార్య
ములకును నీవేకదా మూలకంబు. నీకరుణామృతవృష్టి
నందనగాదే, సకలకార్యములును సఫలంబు లగును. నాభారం
బంతయును నీపై వైచితిని. ఓ దేవదేవా? ప్రాపై నన్నుసర్వదా
గాపాడుము. నేనొనరించు కార్యము నీకుఁ దెలియనిదికాదు. న
న్నాశీర్వదింపుము. ధైర్యమును బురికొల్పుము. నన్నుఁగాపా
డుము. దేవా? నమస్కారము. అనిప్రార్థించి కుర్చీనుండిలేచి,
యొకతాళపు గప్పయునుఁ జెవియును జేతబట్టుకొని యీవల
కువచ్చి తలుపులను దగ్గరకు వైచి వీధిగుమ్మముకడకేగి గొం
డెమును దీయఁజేయిజాచెను. ఆమెచేయి వడంకనారంభించెను.
మనస్సు తటతటకొట్టుకొన నారంభించెను. మేనినిండ చెమ్మ
టలుపట్టెను. తుదకు గొండెమును దీయలేక పోయెను. ఒక్కిం
తతడవాగి ధైర్యమూని గొండెమునుదీసి తలుపులఁదెరచెను.
వీధియంతయు నంధకారబంధురమై యున్నది. ఆమెకు మరల
భయమంకురించెను. గడపదాటి యడుగావలకుఁ బెట్టెను. కా
ర్యము ముందునకును, మనస్సు వెనుకకును లాగుచుండెను.
తోక చేతబట్టుకొని లాగబడు కలుములోని పామువలె ముం
దునకును వెనుకకునుగూడ గదలకట్లే నిలిచియుండెను. ఇంత
లో మనస్సునకు పట్టుతగ్గెను. కార్యమావలకు లాగివేసెను.
అంతనామె తలుపులను దగ్గరకుజేర్చి తాళమువేసి తాళపుఁజె
విని బైటచెరగునకుఁ గట్టుకొని రాజవీధింబడి పోవుచుం
డెను. రాజవీధిలో నచ్చటచ్చట దీపపుస్తంభములున్నవి. వాని

యందుదీపములు వెలుంగుచుండెను. ఆదీపకాంతిని తన్నెవ్వరు గుర్తించెదరేమోయని భయపడుచు కొంతవడికిట్టులో నగరమును దాటెను. ఇక్కడికామె గమ్యస్థానము పావుక్రోశదూరంబున నుండెను. అచ్చటవృక్షపంక్తు లతినిబిడముగనుండెను. మార్గమేమియును గోచరించుటలేదు. ఆశ్రమమున కెట్లుపోవలయునో దారి తెలియక భ్రమరము చందంబున దిరిగిన చోటనే దిరుగుచుండెను.

ఇది యిట్లుండ నట యాశ్రమములో రెండుగడియలకుపూర్వము యోగానందు డెచటనుండియో పరుగుపరుగున వచ్చి, బ్రహ్మానందుని లేపి చెవిలోనేమియో చెప్పెను. బ్రహ్మానందుండును తటాలున లేచి దండమును జేతబట్టుకొని మంటపమునుండి వెంగున నొకచాటుదాటి యాచీకటిలో నదృశ్యుండయ్యెను. యోగానందుండుగూడ నాతని ననుగమించెను. ఇచ్చట మధుమతికి తెరవుదొరకుటలేదు. భయాకులచిత్తయై కంపించుచుండెను. భీతితో నిటు రెండడుగులును నటు రెండడుగులును వేయుచుండెను. ఆమె మేనినిండగప్పుకొనిన దువ్వలువ యొక్కముండ్లపొదకు దగుల్కొని వెనుకకు లాగజొచ్చెను. ఆమెత్రుళ్ళిపడి వెనుకకు దిరిగి చూచినది. అచట నెవరును లేరు. తనవలువ యొకముండ్లపొదకు దగుల్కొనియున్నదని గ్రహించుకొనియెను. కాని యాముండ్లచిక్కునుండి తనవలువను తీసుకొనలేకపోయెను. అలసినది. వినువుజనించెను. తుదకామె తన ముసుగునుదీసి యచ్చట బారవైచెను.

ఇట్లుండ నింతలో నాచుట్టుప్రక్కల చరచర యనియు చిటచిట యనియు, దడదడయనియు, చిన్నచిన్న ధ్వనులు నిమిషమునకొక్కమారు వెలువడుచుండెను. ఆమెకాధ్వనులు భీతినిబుట్టించుచుండెను. ఇంతలో నొకపురుషవ్యక్తి యామె వెనుక భాగమునకు వచ్చినిలచెను. అడుగుల సడియైనట్లు లామెకు దోచి వెనుకకుం దిరిగిచూచెను. అంతనావ్యక్తి చటాలున సందిటనుబట్టియెత్తెను. ఆమె కెవ్వునకేకవైచి యాతని సందిటలో మూర్ఛనొందెను. అతఁ డామె నొకగుప్తప్రదేశమునకు గొనిపోయి, యామె మొలనలంకరించియున్న కైజారును దీసివైచి కాలుసేతులకు నొకగుడ్డనుగట్టి యొడిలోబరుండబెట్టుకొని చేరుమాలుచే విసరుచుండెను. కొంతవడికామెకు తెలివివచ్చినది. కనులువిచ్చి చూచినది. హా? యని యరచినది. ఆమెకు మరల స్మృతితప్పెను. అతఁడు విసరుచునేయుండెను. ఆమెకు బూర్తిగ తెలివివచ్చెను. అయ్యో? యని యఱచి చట్టున లేవబోయెను. కాని కాలుసేతులు బంధింపబడియుండుటచేతను, పురుషునిచే నదిమిపట్టుకొనబడి యుండుటచేతను లేచుటకు వీలుపడ వేదు. ఆమె గడగడ వడంకుచుండెను. అప్పుడా పురుషు డిట్లనియె.

పురు—మధుమతీ! భయపడుచుంటివా? యేమి? పాపము?— ఇప్పుడెట్లు తప్పించుకొనియెదవో చూచెదనుగాక! అచాటున గదిలోకత్తి జేతబట్టుకొని మీాదకు దుముకుటకాదిది. ఇదిగో నీమొగడు కామపాలుఁడు. ఇంకను కామపాలున

కు నిన్నంటనధికారము లేదంకు వా?

మధుమతికి దడ హెచ్చెను. మేననిండ చెమ్మటవర్షిచుచుండెను. కాళ్ళనుజేతులను విదళించి హా! దైవమా? యని యరచినది.

కామ—నీవరవకుము. అరచితివా! నాకరవాలంబునకు గురియగుదువు?

మధు—ఛీ! దురాత్మా! నీచేతులలో జచ్చి నరకమునకుఁబోవుగతి పట్టినదా?

కామ—మాధవుఁడు స్వర్గమునుండి నరకమునకు వచ్చి నిన్ను విడిపించును.

మధు—హా! దైవమా! నాకెంతగతిపెట్టితివి?

కామ—నీవుదుఃఖించిన బ్రయోజనములేదు. నిన్నిప్పుడు గాంధర్వవిధిని బొందెదను. అల్లరిపడక యంగీకరింపుము.

మధుమతి గుడ్డచే గట్టబడిన జేతులనుమెల్లనసర్దుకొని కామపాలునిగుండెలపై బొడిచినది. కామపాలుఁడు బెక్కుమని పట్టువదలి వెనుకకొరగినాడు. మధుమతి యాతనిమొడినుండి మెల్లనలేచి పరుగిడుటకు కాలుసేతులు బంధింపబడియుండుటచే గుప్పించి దాటుచు కొంచెమావలకుబోయి నిలిచినది. ఇంతలో కామపాలుఁడు సర్దుకొని పరుగుపరుగునవచ్చి యామెను గదలకుండ గట్టిగబట్టుకొనినాడు.

మధు—ఓరీ! క్రూరుఁడా! ఈతుచ్ఛకామమునకై నరకకూపంబున నేలబడియెదవు. పాపాత్ముఁడా? నా మేనబ్రా

ణంబులుండునంతవరకు నామానము నీయధీనము కాదు.

కాము — ఇంకను నీకండకావర మణఁగలేదా నీప్రాణంబు లెగిరిన నీవనుభవించఁగగిన దేమున్నది?

మధు — నీవుమాత్రము ముట్టిగట్టుకొని యెల్లకాలము మూరేగకవా? అందరు నెప్పుడో యొకప్పుడు చావవలసినవారలే. జీవితము చంచలమని యెఱుంగుము. నేను ప్రాణంబులకాసపడి మానంబును గోలుపోవుదాననుగాను.

కాము — ఓసీ! నిర్భాగ్యురాల! నీప్రాణములు నాయధీనములో నున్నయవి. ప్రాణంబులకంటె విలువగు వస్తువేమున్నది. ఈనిండుయావనములో నకాలమృత్యువు వాతబడనేల? నన్ను భర్తగానంగీకరించి నాపొందున కిచ్ఛగింపుము. నిన్ను తిరిగియింట సుఖంబుగ బ్రవేశపెట్టెద.

మధు — ఓరీ! ఛండాలుడ! అస్థిరంబులగు ప్రాణంబులకై యాసించి మానంబును గోలుపోవుదాననుగాను. పద్మనాయకవంశభూషణుండగు మాధవుని ధర్మపత్ని మానధనయని యెఱుంగుము. ఆకుదానిని గాలుసేతులు బంధించియాటలాడుచుంటివి. మగతనము గలదేని నాబంధములూడ్చి నాచేతికి గత్తినిచ్చి పోరుము.

కాము — ఓదురాత్మురాలా! నన్నునిందించుచుంటివా? ఇదిగో చూడుము మాకరవాలము. నీశిరంబు నెగురవేసెదను. నిన్నెవరు రక్షించునో చూచెదను.

అని మధుమతిని వదలి చరుద్రిన నోరనుండి కత్తి

దీసెదను.

మాధు — ఓరీ! పాపీ! ఆయుధహీనన నై యబలనై యున్న నన్ను జంపిన లోకమున కేమి యుపకారము— ఆకత్తితో నీవ తీమున బొడుచుకొంటి వేని లోకము నిష్కంటకంబగును.

కాము — ఓసీ! పొగరుబోతా! ఇంకెంత కాలము పేలెదవు? ఇదిగో చూడుము. అంగీకరింపవేని ప్రాణములను దీసెదను.

అని మహాకోపంబున నామెశిగ బట్టిముందునకీడ్చి— నీమాధవు డడ్డుపడ డేమి? అని ఖడ్గమును పైకెత్తి ఇదిగో నీ ప్రాణంబు లెగిరిపోవు చున్నయవి. ఇప్పుడైన నన్నంగీకరించెదవా?

మధుమతి మారువలుకలేదు. ఆమె సర్వాంగంబులు ను గంపించుచుండెను. గద్గదికస్వరంబుతో హా? మాధవా? హా! ప్రాణవల్లభా! హృదయేశ్వరా! మాధవా? నీధర్మపత్ని పరలోకంబున కేగుచున్నయది. నాథా! రక్షింపుము- రక్షింపుము. హా సర్వేశ్వరా! మాధవా? రమ్ము రమ్ము? హా? యోగీంద్రా! బ్రహ్మానంద రక్షింపుము— రక్షింపుము. ఓదీన దయా?—

ఇదిగో వచ్చుచున్నాను. భయపడకుము? భయపడకుము. అని యొకచెట్టుచాటుననుండి సింహామునలె చెంగునముందునకొక గంతువైచి కత్తినెత్తిన కామపాలుని కరంబునుగట్టిగబట్టుకొని పిడికిలితో నాతనిరొమ్ములో నొక్కపోటుపొడిచె

ను. కామపాలు డాపోటున కబ్బాయాని యారచి చేతనున్న కత్తిని క్రిందికిజారవిడిచెను. కాని కామపాలుడాతని విడిచిపోక కొని యాతని రొమ్ముపై నొకపోటును పొడిచెను. అప్పు డుభయులును బోరుచుండిరి. ఆద్వంద్వయుద్ధములో నొకరొకరొ రుదీసిపోవుటలేదు. ఇంతలో కామపాలుడొక యీలవై చెను. ఆసంజ్ఞనాలించి, నలుగురు ముచ్చులు పొదలచాటునుండి రివ్వునవచ్చి, శివయోగిపై బడిరి. అంతయోగానందుడు పరుగుపరుగునవచ్చి వారలనడ్డుకొనియెను. ఇంతలోనొకడు వచ్చి యోగానందుని గదలకుండ గట్టిగపట్టుకొనియెను. తూ ర్పు తెల్లవారుచుండెను. మధుమతి యోగసామర్థ్యమునువిస్మ యమ్మును భీతిచే గడగడ నడంకుచుండెను. కాని ధైర్యము ని నేలబడియున్న కత్తినిదీసి యోగికందిచ్చెను. శివయోగికత్తి నందుకొని సింహామువలె గర్జించుచు నాముచ్చులలో నిద్దరి తలలెగరవేసెను. తక్కిన యిద్దరును యోగానందునివిడిచిపారి పోయిరి. పిమ్మట బ్రహ్మానందుఁడు కత్తినిక్రిందబడవైచి కా మపాలుని గుండెలలో నొక్కపోటు పొడిచెను. ఆదెబ్బకు కా మపాలుఁడు కివ్వునఱచి నేలకొరగెను. అంత సూర్యోదయ మయ్యెను. బ్రహ్మానందుఁడు కామపాలుని నందిటబట్టుకొని మధుమతితోగూడ తనయాశ్రమమును బ్రవేశించెను. యో గానందుఁడు నేలబడియున్న కత్తినిదీసి బ్రహ్మానందునివెనుక నేవచ్చెను. బ్రహ్మానందుఁడు కామపాలునొక వస్త్రముచే బంధించి యొకచోట బరుండబెట్టి శీతోపచారముల జేయుమని

యోగానందునితో జెప్పెను. యోగానందు డట్లొనరించుచుం డెను. నాటిరాత్రి యోగానందు డెటకో బోయి, వచ్చుచు కామపాలుఁ డామ్రిచ్చులతో నొకపొదరింట సంతసము నలుపుచుండగావిని యావార్త బ్రహ్మానందునితో జెప్పెను. అప్పుడు బ్రహ్మానందుఁ డచ్చోటునకు బోయి వారలకుఁ దెలియ బడకుండ వారలతో దిరుగుచుఁ దుదకిట్లు కామపాలుని బట్టుకొనియెను.

బ్రహ్మానందుఁడు మంటపంబున గూర్చుండెను. మధుమతి యోగీంద్రుని పాదసరోజంబులపై శిరంబునిడి మొక్కి యశ్రువులచే నాతని పాదంబులనభిషేకించెను. ఆహా ? ఏమా విచిత్రము. ధీరస్వాంతుండయ్యును, సన్న్యాసియయ్యును యోగీంద్రుఁడుకూడ నశ్రువులచే మధుమతి మస్తకంబును దడపెను. తుదకాతఁడిట్లనియె.

బ్రహ్మ— ఓబాలామణీ! లెమ్మా? లెమ్మా. భయంబుడిగి సుఖంబుగ నుండుము. నీకు శుభంబగు. నిన్నీశ్వరుఁ డనుగ్రహించుఁ గాక.

మధుమతిలేచి కనులను దుడుచుకొని ముకుళీకృతకర కమలయై సగద్గదమందస్వరంబుతో నిట్లనియె.

మధు— మహాత్మా? తాము నామానప్రాణంబుల నిలిపిరి. తాముత్రాణపరాయణులు. నేనిదే మనఃపూర్వక ప్రణామం బొనరించుచున్నదాన. అని మరలయోగీంద్రుని పాదంబులపైఁ బడెను. యోగియామెనుకరకమలంబులబట్టియెత్తెను

ఆతని చల్లని కరకమలసంస్పర్శనంబున, నామెకు రోమహర్ష ముదయించెను. ఆమెలేచి చేతులుజోడించి నమస్కరించెను. దేవా! తమ పాదరజోసంస్పర్శనంబున నేను ధన్యురాలనైతిని. ఇంక నేమిమో యనబోయెనుగాని, హృదయ దుఃఖసాగరంబు ననుండి యొక్క కెరట ముప్పొంగిపొరలి కంఠమును స్తంభింప జేసెను. ఆమె కదలక నిలిచియుండెను. బ్రహ్మానందుఁ డిట్లనియె.

బ్రహ్మ—ఓ బాలామణీ? విచార ముడుగుము. నీపై నీశ్వరునకు పరిపూర్ణప్రేమ కలదు. నీకు సర్వసుఖంబులును చేకూరును. నీవృత్తాంత మేమి? నీవీయవస్థ కేల పాల్పడితివి?

మధు—దేవా? నేను శ్రీధరనాయనంగారి కుమార్తెను. మాధవుఁ డాతని మేనల్లుఁడు. ఆతఁడు చక్రవర్తిచేనవమానింపబడియెటకో బోయెను. నాకాతనిపై గల మక్కువచేనాతనిజాడ తెలియగోరి, యింట నీకామపాలుని బాధపడలేక, యర్ధరాత్రిమున తమదర్శనమునకు బయలుదేరి, త్రోవలో నీకామపాల కిరాతునకు జిక్కితిని. నా పేరు మధుమతి.

బ్రహ్మ—నీచరితమంతయు నవగతమైనది. నీవింటికి బోయెదవా?

మధు—దేవా? నాజీవితమిక నిరర్థకము. అర్ధరాత్రిమున నిలువెడలి వచ్చితిని. లోకాపవాదమునకు దావళంబైతిని. ఏ మొగము బెట్టుకొని యింటికిబోయి బ్రతుకగలుగుదు

ను? నేను మీపాద—

బ్రహ్మ—సరియే కానిమ్ము. నీతల్లిదండ్రుల నిటకు రప్పించెదను. అదిగో చక్రవర్తి వచ్చుచున్నాడు.

మధుమతి తొట్రుపాటుతో స్థంభముచాటునకుబోవు చుండ బ్రహ్మనందుఁడు నివారించి, మధుమతీ! నీకేమియును భయములేదు. నీవిచ్చటనే యుండుము. అన మధుమతి కదల కచ్చటనే నిలుచుండెను.



## ముప్పదియారవ ప్రకరణము.

నాలుగు గడియల ప్రొద్దెక్కెను. శ్రీధరుఁడు భావమరందితోడను, తొట్టువతోడను, నింటఁ బ్రవేశించెను. వారింజూచి రుక్మిణీ శ్యామలలు కెవ్వననేడ్వసాగిరి. శ్రీధరునకు నడుము విరిగినట్లయ్యెను. విశాలాక్షి విస్మితయై చిత్రప్రతిమవలె గగలకట్లే నిలిచియుండెను, సింగమనాయనుడు తొట్రుపాటుతో, ఏమది? ఏమియుపద్రవము వాటిల్లెనని ప్రశ్నించెను. అంత విశ్వాసరాయు డిట్లనియె. అయ్యో! ఏమని చెప్పవలెను? గతరాత్రినుండియు, మధుమతి కనఁబడుటలేదు. ఆమెను చోరులెవ్వరో యపహరించుకొని పోయిరి.

శ్రీధరుఁడు మొదలునఱికిన కదళీతరువువలె దుబ్బున

నేలగూలెను. విశాలాక్షి విచారసాగరమున మునింగిపోయెను. సింగమనాయని నోటమాట వెలువడదయ్యె. ఇంతలో యోగానందుఁడు పేరువారివచ్చి మధుమతి బ్రహ్మానందునియాశ్రమమున నున్నది. ఆమె యోగీంద్రునిచే రక్షింపబడినది. మీరు విచారింపవలదు. మిమ్మెల్లనటకు రావలసినదని బ్రహ్మానందులాజ్ఞాపించిరి, అని తెలుప ఆవాక్యము లెల్లరకును నమృతప్రాయంబులయ్యెను. చెదఱిన ప్రాణములు మరలస్వస్థానమున జేరుకొనినవి. వాహనంబులపై నందరును బ్రహ్మానందుని యాశ్రమంబున కేగిరి. ఇట యాశ్రమంబున చక్రవర్తి విస్మితుడై యందర నిటునటుఁజూచుచుండెను. కామపాలుఁడు తలవాల్చి యోగియెదుట నిలువంబడెను. బ్రహ్మానందుని యంగీయంతటను రక్తపు మరకలు జూపట్టుచుండెను. ఈవిచిత్ర ప్రదర్శనమును గాంచి చక్రవర్తి యిట్లనియె.

ప్రతా—స్వామీ? ఏమది? మీవస్త్రమున రక్తపు మరకలు కానఁబడు చున్నయవి. ఈతఁడెవ్వఁడు. ఆబాలిక యెవ్వతె.

అన బ్రహ్మానందుఁడు రాత్రిజరిగిన కథయంతయును విస్పష్టముగ చక్రవర్తికి నివేదించి మరల నిట్లనియె.

బ్రహ్మ—రాజా! ఈతనిపేరు కామపాలుడు. ఆమె మధుమతి. శ్రీధరపుత్రిక. ఈమె, మాధవునిపైగల యనురాగమున నాతనిఁ బోకడకై విచారించుచు, నాతనిస్థితిని దెలి

యఘోరి మద్దర్శనంబునకై యర్ధరాత్రిమున నిలుబొసి, త్రోవలోనట్టియవస్థకు లోనయ్యెను.

చక్రవర్తి ఈవృత్తాంతమును వినెను. ఆతని వదనమున లజ్జా- శోక- క్రోధభావంబు లొక్కమారు బొడసూపెను. మాధవుని విషయమై లజ్జయు, మధుమతి యవస్థకు జాలియు కామపాలుని దౌష్ట్యమునకు క్రోధంబు నుద్బోధకముగు చుండెను. ఇంతలో శ్రీధరప్రభృతు లెల్లరును యాశ్రమమున కరుదెంచిరి. అందు సింగమనాయనుడు గూడనుండుట గాంచి చక్రవర్తి విస్మితుడయ్యెను. చక్రవర్తినిగాంచి శ్రీధరుప్రభృతులెల్లరును విస్మితులైరి. అంతవారు తొట్రుపాటుతో యోగికిని చక్రవర్తికిని నమస్కరించిరి. మధుమతి తల్లిని జూచి కౌగలించుకొని గోలునవేడ్చెను. అంవలికనులనుండియు నశ్రువులు రాలినవి. మధుమతికి దుఃఖమాగినదికాదు. అక్కడ చక్రవర్తి యుండెనను దృష్టియామెకు లేదు. తలిదండ్రిలజూడగనే యామెకమిత దుఃఖమువచ్చెను. కామపాలుని ముఖము రక్తహీనమై నల్లబడియుండెను. కామపాలునిగాంచి శ్యామలాప్రభృతులు విస్మితులైరి. ఆతఁడిట కేలవచ్చెనని తలంపనారంభించిరి. అంత కొంతవడికి మధుమతి శాంతించి జరిగిన వృత్తాంతమంతయును తల్లి మొదలగు వారలకెల్లరకును దెల్పెను. ఉద్రేకముతో నందరు నొక్కమారు కామపాలుని దిట్టిరి. కొంతయులజడి తగ్గినవెనుక బ్రహ్మనందుఁ డిట్లనియె.

బ్రహ్మ—రాజా! ఈకామపాలుఁడు దోషియై యున్నాఁడు. విచారించి యాతని నేమిసేసెదవో సేయుము.

ప్రతా—స్వామీ! నాకిదంతయును వింతగానున్నది. నేనిచటనే యుంటిని. మీరే దోషవిచారణ సేయుటుచితము.

బ్రహ్మ—నేను మధుమతి పక్షమున సాక్షినై యున్నాను. నన్నుఁగూడ మీరలే విచారింపఁదగు. తాము విచారణ సల్పిన గాని దోషనిర్ధారణ కాదు.

ప్రతా—అట్లుకాదు. ఇదియంతయు మీసమక్షమున జరిగినది. గానమీరలే విచారింపదగు. నాయధికారమంతయును మీకునొసంగితిని.

బ్రహ్మనందుఁడు చిరునవ్వు నవ్వెను. శ్యామసుందరి గడగడ కొట్టుకొనుచుండెను. పుత్రికెట్టిశిక్షకు బాల్పడునో గదాయని భీతిల్లుచుండెను. యోగికాళ్ళపైబడి పుత్రభిక్షమిడుడని ప్రార్థించ సంకల్పించెను గాని యామెనోరును కాళ్లును గూడ గదలవయ్యెను. అంత చక్రవర్తి శ్రీధర ప్రభృతులనెల్ల గూర్చుండ సంజ్ఞజేసెను. యెల్లరునుగూర్చుండిరి. బ్రహ్మనందుఁడు మధుమతీ? ఇటురమ్మా? అనుపిలిచెను. ఆమెయోగినుపలక్షించి తలవాల్చెను. యోగియామె భావమును గ్రహించి యిట్లనియె.

బ్రహ్మ—పృథ్వీపతి విష్ణుసమానుఁడు. జనులకెల్లఁ గాతఁడు తండ్రి. సందియింపఁబనిలేదు. నీవాతనిపుత్రికవు.

మిగిలినవారెల్లరును నీబంధువులేగదా?

అన మధుమతి తండ్రి పార్శ్వమునకు వచ్చి నిలువం బడియెను.

బ్రహ్మ—కామపాలా! ఈమెనీకేమగును?

కామ—మేనత్త కొమరిత.

బ్రహ్మ—ఈమెను నీవు చంపబూనితివిగాదా?

కామ—లేదు.

బ్రహ్మ—ఏమంటివి?

కామ—లేదంటిని.

బ్రహ్మ—నేను చెట్టుచాటున నుండి చూచుచునే యుంటిని. ఈమె సిగనుబట్టి ముందునకీడ్చి నఱుకుటకై చేతితో కత్తినెత్తితివికాదా?

శ్రీధరుని కనులనుండి యశ్రువులు చిమ్ముచుండెను. రుక్మిణీ శ్యామల విశాలాక్షులకు గంపముప్పుట్టెను. ఆమాట విన మఱల మధుమతికి భీతి యుదయించెను. ఆమెగుండెలు కొట్టుకొననారంభించెను.

కామ—ఔను.

బ్రహ్మ—మొదట నీవేమంటివి?

కామ—లేదంటిని.

బ్రహ్మ—అటులయిన నిపుడిట్లేల యంటివి?

కామ—ఆమెను నేను చంపదలచుకొనలేదు. కావున

లేదంటిని కత్తినెత్తినమాటవాస్తవము కావున నౌనంటిని.

బ్రహ్మ—కత్తినెత్తుట జంపుటకుగాదా?

కామ—కాదు.

బ్రహ్మ—ఎందులకు?

కామ—ఆమెభయపడి నన్ను బరిగ్రహించునేమో యనిభయపెట్టుటకై యట్లుచేసితిని.

బ్రహ్మ—ఆమెనిన్ను పరిగ్రహించినదా?

కామ—మీరా సమయమునకు రాకయున్న నంగీకరించునేమో?

బ్రహ్మ—ప్రాణదానమునకై నిన్నామె వేడుకొనలేదా?

కామ—లేదు. నన్ను దూషించినది. తిట్టినది. శపించినది. కనుకనే యామెపై నాకట్టి కోపము వచ్చినది. ఆమె నంగీకరింపఁజేయుటకై నేనీ క్రూరకర్మ నాచరించితిని. ఆమెను జంపవలెనని నేనుద్దేశించుకొనలేదు. అప్పుడు నేనంత భయపెట్టినను హా! మాధవాయని యరచి రక్షింపుమనియెను గాని ప్రాణదానమునకయినన్ను వేడుకొనలేదు. తుదకునా యత్నమంతయును వృథయైనది. నేనామెను పూర్ణముగ ప్రేమించితిని. ఆమెనెన్నియోవిధముల బ్రతిమాలితిని. అనేక కష్టములకు లోనుజేసితిని. దీనికంతకునుప్రధానకారణమామె యందునాకుగల మోహమే. ఆమెనన్నుతిరస్కరించినది.నన్ను

తిరస్కరించినది. నన్ను శిక్షించుటకీ దోషముచాలును. దానికినేను బాధ్యుడనే. ఈయత్నములో నుభయులకును గూడ నాశాభంగమేమైనది. నేనామెందలంచుకొనుచు ప్రాణంబుల వదలెదను. మాధవుని దలంచుకొనుచు నామెప్రాణంబుల వీడును.

బ్రహ్మ—మాధవునికై యామె ప్రాణంబుల నేల విడువవలెను?

కామ—రాజావమానంబున మాధవుడు మృతినొందినాడు. మాధవునిపై మధుమతికి బ్రేమమెండుగ నుండెను. కావున మాధవుని స్మరింపుచు మధుమతి మృతినొందుట నిశ్చయము.

మధుమతి తలవ్రాల్చినది. కనులనుండి నీరు గారుచుండెను. చక్రవర్తి కామాటలు శూలములై గ్రుచ్చుకొనినవి.

బ్రహ్మ—మధుమతీ? నీవట్లు విచారించుచుంటివేమి? మాధవుడు మరణించెనని కామపాలుడు పలుకుటచేతనా? ఆవాక్య మసత్యము. మాధవుడు జీవించియె యున్నాడు. కాని, యాతడు సన్న్యాసాశ్రమమును స్వీకరించి యున్నాడు. ఆతడు సంసారమును వాంఛించుటలేదు. ఇంక నీవాజోగికై యత్నింపనేల? ప్రభుభక్తిపరాయణు లెందరో మాధవునిమించిన వారలుకలరు. వారిలో నొకరిని వరించి సుఖింపుము.

మధుమతికి మూర్ఛవచ్చినది. వడంకుచు తండ్రిచెంత నేలకొరగినది. రుక్మిణి పరుగుపరుగునవచ్చి బిడ్డనుపట్టుకొనెను. శ్రీధరుఁడులేచి శైత్యోపచారములజేసినాఁడు. మధుమతికి తెలివివచ్చి లేచినిలిచి యిట్లనియె.

మధు—(కంపముతో) మహాత్మా! నాపై మీకుగూడ నలుకవచ్చెనా! నన్నేల నొప్పించెదరు. మాధవపత్నిని పరులపాలుకమ్మనియే బోధించుచుంటిరా?

అని మొగమావలకు ద్రిప్పి వాపోవుచుండెను. చక్రవర్తిహృదయము కరగినీరయ్యెను. ఆతఁడీ కష్టమంతయును తనదిగా భావించుకొనుచుండెను. శ్రీధర సింగమనాయనల హృదయము లెట్టివిషాదమునకు లోనయ్యెనో వారలకే తెలియునుగాని చెప్పవీలులేదు. అంత మరల బ్రహ్మానందు డిట్లనియె.

బ్రహ్మ—ఇందెవరును నేమియును జేయఁజాలరు. మాధవుఁడు మిక్కిలి పాపకర్మమునాచరించెను. పాపికిపావనంబగు సంసారప్రవేశమెట్లు కలుగగలదు.

మధు—దేవా! ఇప్పుడేకదా నీకు శుభంబుచేకూరునని వరంబిచ్చియుంటిరి. నాదురదృష్టవశంబున గాఁబోలును మరలనిట్లు శపించుచున్నారు.

బ్రహ్మ—మధుమతీ! నన్నేమి సేయుమనియెదవు? మాధవుని నిజస్థితియేమియో, తెలిపితిని. ఆతఁడు రాజద్రోహి. ఉపరిజైనమతపక్షపాతి జైనులతోఁగలసి చక్రవర్తిపైకు

ట్రిలు పన్నినాఁడు. ఇట్టి రాజద్రోహిని. ఇట్టిక్రూరుని, ఇట్టి యన్యమత పక్షపాతిని, చక్రవర్తి దేశమునకేల రానిచ్చెదు? ఒకవేళ నీపైఁగల ప్రేమచే మాధవుఁడు వచ్చినను తలయెత్తుకొని యెట్లు తిరగగలఁడు? ఈసంగతి మాధవుఁ డెరిఁగియేయుండును. కనుకనే యాతఁడు వచ్చుటపొసఁగకున్నయది. ఉన్న యథార్థము వచించితిని. ఇంక నీవాతని నాశించకుము.

మధుమతికి తానొకనూతిలో బడినట్లయ్యెను. ఆమెహృదయము దుఃఖముచే నాపూరితమయ్యెను. కనుగవ విషాదమేఘాచ్ఛాదితమై బాష్పవృష్టిని గురిపించుచుండెను. జగంబంతయు నంధకార బంధురమై చూపట్టినది. క్రమక్రమంబుగ స్మృతితప్పిపోవుచుండెను. హా! మాధవా యని యరచి నేలకొఱఁగినది. శ్రీధరుఁడు బిడ్డను తన యంకంబునఁజేర్చి కన్నీరుఁగార్చుచు విసరుచుండెను. ప్రతివాని హృదయమును దుఃఖపూరితమయ్యెను. చక్రవర్తి తలవంచుకొని యట్లే తూష్ణియుండెను. కొంతవడికి రాజు మరల తలనెత్తి గంభీరవాక్యములతో నిట్లనియె.

ప్రతా—మాధవుఁడు రాజద్రోహి కాఁడు. అతనికి మతములన్నియు సమానములు. అతఁడు మాపై కుట్రపన్నినని మేమెప్పుడును తలంచియుండలేదు. నేనెప్పుడును యాతని రాకకై నిరీక్షించుచునే యున్నాను. అతనికై నాశక్తివంచన లేకుండ ప్రయత్నించితిని. ఈమధుమతి దుఃఖమునకు నాహృ

దయము మిక్కిలి పరితాపమనుభవించుచున్నది. మాధవుని నేరైన మాకడకంపిన తగిన బహుమతి యొసంగెదను.

బ్రహ్మ—సార్వభౌమా! నీవు మిక్కిలి ధన్యాత్ముండవు. నీహృదయము చాల నిష్కల్మషమైనది. నీపరికటనమును మాధవుడెరుంగగలడు. మీకాతడు సన్యాసియయ్యనుమేలా నగూర్చుచునే యున్నాడు. ఆతని జూడ తా ముత్సకతతోనున్నవారలు. అయ్యో? పాపము మధుమతి మూర్ఛపోయినది. కమండలువుతో మంత్రోదకమును గొనివచ్చెద సార్వభౌమా! తామిచ్చటనే యుండుడు.

అని యోగి తనపర్ణశాలలోనికిబోయెను. చక్రవర్తి ముఖమును జూడలేక లతామంటపము చాటుననుండి భీషణుడు యదేవు లీపరిదర్శన మంతయు నాశ్చర్యముతో జూచుచుండిరి. అరుణ ప్రభు డీప్రసంగముసంతయు విని తల పంకించి యోగితో లతామంటపమున కేగెను. యోగి యాతని చెవిలో నేమియో చెప్పెను. అరుణ ప్రభుడటనుండి నిష్క్రమించెను. యోగి తనయుడుపులు మాసియుండుటచే గాబోలును వాటిని దీసి శుభ్రవస్త్రములను ధరించి ముఖమున విభూతియు, గంతమున రుద్రాక్షమాలికలును ధరించి, పైన మరల రక్తపు మరకలుగల యంగీని దొడగి యొకచేత కమండలువును, యొకచేత దండమును బట్టుకొని మందహాసమును జేయుచువచ్చి శ్రీధరునితో నిట్లనియె.

మీబిడ్డకే నుపచారములు జేసెదను. ఆమె తెలివినం దగలదు. ఈకమండలములో నమృతోదకము కలదు. మీరు కొంచెము తొలంగుడు. అనిపలికి, మధుమతి మస్తకమును తనయంకంబున జేర్చుకొని కమండలములోని జలంబుచే నామె ముఖమునజిమ్మి తనజలార్ద్రహస్తాంగుళులతో గనులు దుడుచు చుండెను. అంత నామెకు తెలివివచ్చెను. ఆమెకనులు విప్పి చూచెను. తాను యోగియంకంబున బరుండియుంటినని తెలిసికొని చటాలున లేచి నిలచెను. బ్రహ్మనందుడుగూడ నామె చెంతనే నిలువంబడియెను. అంత నాతడిట్లనియె.

బ్రహ్మ—మధుమతీ! నీవు సిగ్గుపడుచున్నావు. యౌవనవంతులగు పరపురుషులయెడ పతివ్రతలుచూపు ధర్మమే యిది. అయినను నేను సర్వసంగపరిత్యాగినగు యోగిని. యోగీంద్రులయెడ నీకట్టిసిగ్గువలదు. అని మధుమతి దక్షిణకరంబును తనవామహస్తమున బట్టుకొనియెను. అందరును బ్రహ్మనందుడు మధుమతినోదార్చుచున్నాడనుకొనిరి. యోగీంద్రుని కరసంస్పర్శముచే మధుమతి మేనంతయును పులకాంకితమయ్యెను. ఆమెవిస్మితయై యట్లేనిలిచి యుండెను. అంత బ్రహ్మనందుడు కామపాలునితో నిట్లనియె.

బ్రహ్మ—ఓకామపాలా! నీవు నిర్దోషివని మాకుదోచినది. నిన్ను క్షమించివిడిచినారము. యోగివృత్తితోనున్న నాకేమధుమతిపై యనురాగముప్పతిల్లెను. నేనీమెను వరించి

తిని. నేను వృద్ధయోగిని కానుగదా! యుద్ధమును జేయగలుగుదును. శత్రువుల నెదిరించి పోరగలుగుదును. మాధవునితో నన్ను సరిచూచుకొనిన నాతనితో నేను పోలియుందును. ఆతని వయస్సును నావయస్సును నొక్కటియె. ఆతనికిని నాకును భేదమేమియును లేదు. ఆతడే నేను — నేనే మాధవుడను. కాషాయాంబరములను రుద్రాక్షమాలికలను మాంత్రికునే వర్తనముగా గలిగియుంటిని. ఈమాంత్రికు భేదమును పాటింప కూడదు. అని పలికి నవ్వుచు మధుమతినిజూచి, ఓమధుమతీ! నన్ను నీవువరించితివిగావా? అర్ధరాత్రమున నాదర్శనమునకేగదా వచ్చితివి.

మధుమతి వెలవెలబోయెను. ఇటునటు జూడసాగెను. అందరును మరల మహావిస్మయముతో జూచుచుండిరి. అంతట మరల బ్రహ్మానందు డిట్లనియె.

బ్రహ్మ—మధుమతీ! నీవు కామపాలుని చేత జిక్కి రక్షింపుమని నన్ను బిలిచితివి. నిన్ను నేను రక్షించుకొంటిని. నీవు నాదానవైతివి. నీవు నన్నంగీకరించితివా?

మధుమతి కనులుమూసికొని కొంతతడవేదియో యోచించి, ఆమెకేమి తోచెనో కాని మహదానందమున నానంద బాష్పములను రాల్చుచు నవ్వుచు మీరు మాధవులేయైనచో అని యోగిపాదములపై బడినది. యోగి మధుమతిని లేవనెత్తి దగ్గరకుదీసి మధుమతీ! నీవింకను నాయంగీనిజూచి భ్రమపడుచుంటివి. అట్లయిన నిదిగో చూడుము మీయంగీని దీసియావల

కు:బారవైచుచున్నాను. అని తన యంగీయును రుద్రాక్ష మాలికలును దండమును నావలకు విసరవైచెను.

రాజు విస్మితుడయ్యెను. మధుమతి తలవాల్చి యా నంద బాష్పములను బొటబొట రాల్చుచుండెను. ఆమె మనః పద్మము వికసించెను. వదనమండలము సుప్రకాశితమైనది. శ్రీధరసింగమ నాయనులు చటాలున లేచి. విశాలాక్షిశరీర ముప్పొంగిపోవుచుండెను. శ్యామల ఆశ్చర్యచూనసయయ్యెను. కామపాలుడు సిగ్గుపడి తలవంచుకొనియెను. రుక్మిణికానంద ము హెచ్చెను. ఓచదువరులారా! యోగితన యంగీవిడీసి పా రవైచినంతమాత్రమున వీరల కీ భావము లేల గలుగవలెనని మీలోగొందరకు సందేహము కలుగవచ్చును. ఇప్పుడాతని మీరొక్కమారు దిలకింపుడు? నాడు చక్రవర్తి తనజన్మదినో త్సవసమయంబున మాధవున కొసంగిన సువర్ణ కవచబద్ధంబ గు కరవాలమాతని కటిప్రదేశమున బంధింపబడి పాదముల వరకును వ్రేలాడుచుండలేదా? నాడుమాధవుడు ధరించిన తె ల్లనిపుట్టంబును తెల్లనియంగీయును ఈతనియందుజూపట్టుటలేదా సరియె ఈతడు మాధవుడని మీరాననాలు పట్టితిరి. ఈతని చరిత్రమిక వేరే తెలుపనక్కరలేదు.

ఇదిగో ఇటుచూడుడు. అరుణ ప్రభుడు రెండు పుష్పమాలికలను గొనివచ్చి బ్రహ్మానంద శివయో గీంద్రులకై నిరీక్షించుచుండెను. ఆతనిగాంచి మాధవుడుఅరు

ణప్రభూ? ఏమది? అట్లుచూచుచున్నావు. నేనే బ్రహ్మానందు డను. ఇప్పుడుమూ నవుడనైతిని. ఆపుష్పమాలికలివియె తెమ్ము. అని మాలికలను గ్రహించి మధుమతితోగూడ చక్రవర్తి కడకేగి, తాం జక్రవర్తికి నమస్కరించుచు, మధుమతివంక చూచెను. మధుమతియు మందహాసముతో శిరంబునువం చి చక్రవర్తికి నమస్కరించెను. అంతచక్రవర్తి చటాలునలే చి యాదంపతులలేవనెత్తి దీవించెను. అంత మాధవుం డాపు ష్పమాలికలను చక్రవర్తి హస్తముల నర్పించి ముకుళితకరక మలుండై సార్వభౌమా? నాయపరాధమును క్షమింపుమని యెను అంత చక్రవర్తి సంతోషస్వాంతుండై మాధవునికర స్పర్శన మొనరించి, యొక పుష్పమాలికను మధుమతి చేతికిచ్చి బిడ్డా! మధుమతీ! నీవుపడిన కష్టములకు ఫలితముగా నీవుకోరు కొనిన ఫలము నేటికి లభించినది. ఈసుఫలప్రాప్తియంతయును నాదిగాభావించి సంతసించితిని. కావున నాకనులపండువుగా నీ ప్రియభర్తను వరింపుము.

అన మధుమతి ప్రఫుల్లవదనయై మరల చక్రవర్తికి నమస్కరించి యాపుష్పమాలికను మాధవుని మెడలోవైచె ను.చక్రవర్తి రెండవమాలను మాధవునకిచ్చెను మాధవుడు చక్రవర్తికి నమస్కరించి మధుమతి కంఠంబున నాపుష్ప మాలనిడెను. అంత చక్రవర్తి అందరకును శెలవొసంగి అంబా రీతో సపరివారముగ కోటకుబోయెను. మధుమతీ మాధవులు తలిదండ్రులకునమస్కరించిరి అన్యోన్యాలింగనములతోగొంత

తడవుగడచినపిదప, కామపాలుండు మాధవునకు నమస్కరించి అన్నా! నాతప్పు క్షమింపుము. మోహావేశంబున ననేకదుండగముల నాచరించితిని. దానికి బ్రతిఫలమనుభవించితిని. సెలవొసంగుమని పలికి తిన్నగ నటనుండియే కాంచీనగరమునకు బోయెను. పిమ్మట యోగానందారుణప్రభులను భీషణజయదేవులను వెంటబెట్టుకొని మాధవుండందరితోడను కలిసి సంతోషముతో శ్రీధరునియింటికిబోయిరి.



## ముప్పదియేడవ ప్రకరణము.

అన్నతో వియ్యమందవలెనను తలంపామెకు లేదు. చిత్తవృత్తి మాఱిపోయినది. కామపాలు డొనరించిన క్రూరకర్మల దలంచుకొను నప్పుడెల్లను నామెగుండెలు తటతటకొట్టుకొన నారంభించెను. ఇదివరకును మాధవునిపై దా జూపిన యసూయకు మిక్కిలి పరితాపపడ జొచ్చెను. బ్రహ్మానందరూపంబుతో మాధవుం డొనరించిన మహాద్భుత కార్యంబులామె కాశ్చర్యమును గలిగించెను. మాధవుండు తనకల్లుడగుట తనదు మహాభాగ్యమని తలంచుకొను చుండెను. కన్నతల్లియగు శ్యామలకే కామపాలునిచైదము లసహ్యముగనుండ రుక్మిణి చిత్తవృత్తి మారినదని చెప్పుటలో నేమి యాశ్చర్యమున్నది. శ్యామల నలుగురిలోను తలయెత్తుకొని తిరుగలేక

న్నది. ఈతలవంపుతో శ్యామల యెంతకాలమో యుండలేక పోయెను. ఈసమాచారము భాస్కరనాయనంగారికి తెలిసి విచారగ్రస్థుడై శ్యామల కొరకు సవారీపంపెను. బోయలు సవారీని వీధిలో సిద్ధముగనుంచిరి. మధుమతిని జూడవలెనని శ్యామల కభిలాషజనించెను. ఆమె తత్క్షణమే మధుమతిగదికి వచ్చి విచారముతో తలవంచుకొని నిలుచుండెను. మధుమతి నిరుత్సాహముగనున్న శ్యామలనుజూచినది. చటాలున లేచి శ్యామలచేయి పట్టుకొని మంచముమీద గూర్చుండ బెట్టినది. ఆమె యిట్లనియె:

మధు—అత్తా! నీవు విచారముగనున్నట్లు కనబడు చున్నావు. నాయందు వాత్సల్య——

శ్యామ—మధుమతీ? నాకు విచారముకాక సంతోష మెట్లగును? కామపాలుడు నీయెడనొనరించిన క్రౌర్యమునకు నాహృదయము బ్రద్దలగుచున్నది. నీమొగమెట్లు చూడగలు గుదును. నేను తలయెత్తుకొని తిరుగుటెట్లు?

మధు—అత్తా! నాకర్మఫలంబట్లుండె. దానికి నీవువగ చుటేల? నాకు నీయందిసుమంతయును కోపములేదు. నన్నా శీర్వదింపుము. నాసంతోషమును గోరుదువేని నీవావృత్తాంత మును మరచిపొమ్ము.

శ్యామ—బిడ్డా! నీకీశ్వరుడు సర్వమంగళంబు లొసం గుగాక? నీవు కోరినఫలము నీకుదక్కినది. నీనుగుణసంపదకు

సంతసించితిని. నీ యెడ నేను గావించిన యపకృతిని మరచిపొమ్ము. నేను కాంచీనగరమునకు బోవుచు నిన్నొకసారి చూడవలయునని వచ్చితిని. అని కంటనీరు నింపుచు మంచమునుండి దిగెను.

మధు—అత్తా! నమ్ముల నాశీర్వదించకయే వెడెదవా ?

శ్యామ—(మధుమతిని జేరదీసి) బిడ్డా! ఈ పాపపుగనులకు మీ కళ్యాణ రూపములు చూచు భాగ్యములేదు. నిన్నీశ్వరుడే యాశీర్వదించినాడు. విచారముడక్కి సుఖంబుగనుండుము. అని మధుమతిచేతిని ముద్దు పెట్టుకొని ఇంటనందరితోడను చెప్పి, సవారీనెక్కి కాంచీనగరమునకు బోయెను. మాధవుడు చక్రవర్తి యనుమతిపై భీమణజయదేవుల కుటుంబములను రప్పించి వారి యాస్తులను వారికిప్పించెను. యోగానంద వేషంబుతోనున్న తనప్రియసేవకుడగు చంద్రునకు గోకిలనిచ్చి వివాహమొనరించి యాతనిని తనయొద్దనుంచుకొనియెను. అరుణప్రభుని ప్రాణమిత్రునిగ జూచుకొనుచు తనతో సమానముగ గౌరవించు చుండెను.

ఇట్లుకొన్ని దినంబులు గడచినవి. నేటికి మధుమతీ మాధవుల వివాహము నాలుగుదినంబులుండెను. రుక్మిణీ విశాలాక్షులు చురుకుగా పనులన్నియు జక్కబెట్టించు చుండిరి. కోకిల సంతోషమునకు మేరయే లేదు. ఆమె గంతులు వేయుచు

పనులన్నియు నిమిషములో చక్కబెట్టుచుండెను. శ్రీధరుని సౌధలక్ష్మి మనోహరాలంకృతయై కలకలలాడుచు సుధాలేప సమున మందహాస మొనరించుచు, పిలచిన నో యని బలుకు చున్నట్లుండెను. రాత్రి భోజనములైన వెనుక మధుమతి తన గదిలోఁగూర్చుని వీణె సవరించుచుండెను. ఎక్కుడుశ్రమలేక యే శృతులు స్థాయిలోబడినవి. అంతనామె వీణెనందుకొని యూర్ధ్వభాగ మంసప్రదేశంబునను, అధోభాగమంకంబునను నుంచుకొని దక్షిణహస్తకనిష్టాంగుళులచే దంతువులను గదపు చు వీణాతంతువులపై వామహస్తాంగుళీ పల్లవములను నృత్య ము జేయించుచుండెను. ఆశ్రుతిధ్వానంబుతో గన కంఠస్వరం బునైక్యమొందించి, శ్రావ్యముగ బాడుచు, వీణవాయించు చుండెను. ఆమె కళ్యాణీరాగ మాలాపనజేయుచుండెను. ఇం తలో శ్రీధరుడువచ్చి, మధుమతి గదిలో కుర్చీపయినిబరుండి యుండెను. నేడు సంగీతశ్రవణమునం దాతడత్యుత్సుకతతో నుండెను. మధుమతియుత్సాహముతో నిదివఱకెన్నడును వీణెవాయించి యుండలేదు. మాధవుఁడు పడమటిమహాలులో నుండెను. మనోహరంబగు నాగీతరాగముచే మాధవుఁడు బలాత్కారముగ హరింపఁబడియెను. నెమ్మదిగ దక్షిణపు వసారాలోనికివచ్చి, యొక పడకకుర్చీపయిని బరుండియుండె ను. అతని మన స్సాగానరసంబులో లీనమయ్యెను. ఆమెయే మి పాడుచుండెనో యాతఁడేమి వినుచుండెనో మనకు దెలి

యుడు. అతఁడపఁయత్నముగ హాయిహాయి యనినాడు. రుక్మి ణివిని నవ్వినది. మాధవుఁడు తెల్లపోయినాడు. రుక్మిణికి కళ్యా ణీరాగమనిన మిక్కిలి యిష్టము. ఈరాగ మామె చెవింబడి, యామె నిక్కడకాకర్షించెను. రుక్మిణి వెంటనే లోనికిబోయి నది. ఆరాగమిట్టులుండెనని వ్రాయుటకు శక్యముకాదు. అది నిమిషమునకు బహురూపముల నందుచు దీర్ఘముగ బెరుగు చుండెను. వివిధ విచిత్రనిమ్నోన్నత గతులనరారుచుండె ను. అనురాగము నుప్పతిల్లజేయుచు శాంతిదయాదిరసంబుల నుద్బోధించు చుండెను. చురచుగలాడి గిరగిర దిరుగుచు, చక్రు న తారాపథమునంటి పొంగిపొరలి వికళించి మరలగిరగిరఁదిరుగు చు స్వస్థానమునకుజేరు తారాజువ్వవలె నీరాగముగూడ మనో హరమై యొప్పుచుండెను. ఆగదికళ్యాణమయమైయుండెను. ఎ ల్లరిహృదయములనుకళ్యాణావృతములైయుండెను. మాధవుడు కళ్యాణమునుగోరుచుండెను. ఆమె కళ్యాణస్వరూపిణియైయొ ప్పుచున్నదిఆమెపాడురాగముగూడకళ్యాణియె.ఎటుజూచినను కళ్యాణము. గోచరమగుచుండెను.ఆకళ్యాణి కళ్యాణీరాగముచే గళ్యాణమునుగోరుచున్నమాధవనంబునుకళ్యాణమయంబుగనొ నరించెను. మందమారుతములకుఁ జలించులతాపల్లవములచం దమున నారాగ మందమారుతమునకాలతాంగియధరపల్లవ ము చలించుచునేయుండెను. రెండు యామములరాత్రియైన ది. ఇంకను రాగము పలుకుచునే యుండెను. మరల రుక్మిణి

యరుకెంచి యొకనిమిషముట్లే నిలిచి అమ్మా! మధుమతీ! చాలరాత్రియైనది. పాటచాలించి నిద్రపొమ్మనియెను. గానమాగినది. మాధవుఁడు లేచి వీథిసారాలోనికి బోయినాఁడు. శ్రీధరుఁడు తనగదిలోనికిబోయి నిదురించెను. బిగించినశ్రుతులను తగ్గించి వీణె నొకమూలనుంచి మధుమతి మంచమెక్కెను. ఆమెకు నిద్రపట్టుటలేదు. మంచముపై నిటునటును బొర్లాడుచుండెను. గవాక్షములనుండి శీతవాతపోతము లామె మేనఁబ్రసరించుచుండెను. అవి మిగుల తాపమునకు గారణములయ్యెను. కురులయందు ముడిచిన జాజిమొగ్గలు వికసించి కమ్మతెమ్మెరలను వెలిగ్రక్కుచుండెను. ఆపరిమళంపువాయువు లామె శరీరమును బులకరింపఁజేసెను. క్రమక్రమముగనామెకు తాపమెక్కుడగుచుండెను. మాధవుఁడు కంటబడిననాటనుండియు నామె యీయవస్థకు లోనగుచుండెను. కాముడు స్వనామధేయుఁడగు కామపాలుని దిరస్కరించుటచే గాబోలును నామెపై దనకౌర్యమును జూపనారంభించినాడు. మాపరహితుడయ్యెను భూతమువలె నామెనావేశించి బాధించుచుండెను. నేటికి వివాహము నాలుగుదినములే యుండినను యీస్వల్పకాలమే మహాయుగమువలె దోచుచుండెను. మంచమునుండిలేచి పచారిసేయ నారంభించెను. తానెవనిసంతోషముకొరకు వీణెవాయించెనో యాతఁడు దానిని వినెనాలేదాయని బాధపడుచు కిటికీవద్దనిలిచి పడసటిమహాలులోనికిదొంగిచూ

చెను. మాధవుఁడు పచారిజేయుచుండెను. ఆమెనిస్మృతయై యట్లేనిలిచి చూచుచుండెను. అతఁడుమంచమెక్కి యిటునటు నుఁబొర్లాడుచుండెను. నిద్రపట్టలేదు. మధుమతిపై ధనుష్టంకార మొనరించి పూవుటమ్ముల గుమ్మరించిన చెఱకువిలుకాఁడు మాధవుని వదలిపెట్టునా ? యోగివేషముతో రెండువత్సరము లెట్లుగడపెనోగాని, యీనాలుగుదినములను గడపుట చాల కష్టముగా దోఁచుచుండెను. అతఁడు మరల మంచమునుండి లేచెను. గాలిలేదు. విసరుకొందమని విసరుకఱ్ఱకై వెతకెను. అదికనబడలేదు. చేరుమాలుచే విసరుకొననారంభించెను. కొంతవడికి పిపాసపుట్టెను. అచట మంచినీటిపాత్రలు లేవు. కోకిల నాటిరోజున మంచినీటిపాత్రలను పెట్టమరచినది. ఎవ్వరిని లేపుట కాతనికిష్టములేదు. నిద్రపట్టుటలేదు. నిరుత్సాహుఁడై మరల మంచముపై బరుండెను. మధుమతి ఆతనియవస్థజూచి సహించలేకపోయెను. ఆమెచటాలున తనమంచముకడకేగి వట్టివేళ్ళ విసరుకఱ్ఱనుదీసి పన్నీటిచే దడిపి, వామహస్తమున బట్టుకొని చప్పుడుకాకుండ పడమటిమహాలులోనికిబోవు ద్వారపుగొండెమునుదీసి రజతపాత్రముచే జలంబును గ్రహించి దక్షిణహస్తమున బట్టుకొని కాలిబొటనవ్రేలితో దలుపురెక్కలనొత్తిగించి మందమంద పదక్రమంబున నాతని మంచమునకు వెనుకభాగమునకువచ్చి నిలచి యొకచేత విసరుకర్రతో విసరుచు, రెండవచేతను మంచినీటి చెంబును బట్టుకొని యుండె

ను. మాధవుఁ డాచల్లని యుశీరవ్యజనపరిమళవాతపోతము లు మేనుసోక హాయి హాయి యని లేచికూర్చుండెను. మధు మతి విసరుచు నాతని కంటఁబడినది. మాధవుఁడు విస్మితుడ య్యెను. ఆవిస్మయ మెంతో కాలమో నిలిచియుండలేదు. ఆతని హృదయకమలము వికసించినది. అతఁడొక మందహాసమును జేసి యాజలపాత్రినందుకొని యానీటిని ప్రేమతోఁ గ్రోలు చుండెను. ఇంతలో మధుమతి యా యుశీరవ్యజనమును మంచ ముమీఁదనుంచి మందగమనమున తనగదిలోని కేగి లోనఁగొం డెమును వేసికొని పరుండెను.



## ముప్పదియెనిమిదవ ప్రకరణము.

మాధవుఁ డా తేటనీటిని గ్రోలి యా వెండిచెంబును మ ధుమతి కందిచ్చెను. ఆ చెంబు నెవరందుకొందురు? అచట నెవ రుండిరి? ఆతఁ డిటునటు చూచెను. మధుమతిలేదు. విస్మయ ముతో మంచమునుండిలేచి హాలంతయును వెతకెను. మధుమ తి కనపడలేదు. ఇది స్వప్నమా? లేక యింద్రజాలమా? యను కొనినాడు. స్వప్నమేయగుచో చెంబును, విసరుకర్రయు నెట్లువచ్చును. ఇంద్రజాలమువలెనున్న దనుకొనినాడు. ఆశ్చా

భంగమైనది. నిరుత్సాహముతో మరల మంచ మెక్కినాడు. ఆమెరాగమునుగూర్చి యనురాగమున బ్రశంసింపవలెనని సంకల్పించుకొనినాడు. మెరపు మెఱసి నట్లొక నిమిషముకనులకు మిరుమిట్లుగొలిపి మధుమతి మాయమగుట వింతగాదోచినది. ఎట్టకేల కావ్యజనమును జేతనందుకొని యాపూబోడిని నా బంగరుబొమ్మను నాతొలికారు మెఱపు నాయలనాగ నాపద్మగంధి నామధుమతిని తనహృదయంబున బవ్వళింపఁ జేసివిసరు కొనుచు నాభావనారూపిణితోగూడ తానును నిద్రించెను.

మూడు దినములు గడచినవి. నేడు వివాహదినము. భవనమంతయుఁ బచ్చని తోరణంబులచే నలంకరింపబడియుండెను. బంధుగులరాకచేతను, పరివారముల రాకపోకలచేతను, అన్యోన్య హాస్యకుశలప్రశ్నలతోడను కలకలలాడుచు కన్నులపండువుగా నుండెను. ఇదివరకే శ్రీధరసింగమనాయనులు గ్రామాంతరములయం దుండిన మంత్రి, సామంత, సేనాధిపతి, మిత్రబంధుపరిభృతులకు శుభలేఖలు పంపబడుటచే వారివారి పరివారములతో నందరును వచ్చియుండిరి. నగరమునంగల మిత్రులను శ్రీసార్వభౌముని స్వయముగ బిలుచుటకై శ్రీధరసింగమనాయనులు బయలువెడలిరి. అప్పటికి నాలుగు గడియలప్రొద్దుండెను. వివాహసుముహూర్తము నాలుగుగడియలరాత్రికి నిర్ణయింపఁబడినది. శ్రీధరసింగమనాయను

లిద్దరేక కాలమునకే చక్రవర్తికడకేగిరి. చక్రవర్తి మండపా సమొనరించి, సేనానుల నిద్దరను గూర్చుండసంజ్ఞజేసెను. వా రు చక్రవర్తికిని గురుపండితప్రభృతులకును నమస్కరించి కూ ర్చుండినపిదప సింగనునాయకుఁడు లేచినిలువంబడి: సార్వభౌ మా! నేడు నాలుగుగడియలరాత్రికి చిరంజీవి నాద్వితీయపు త్రుండగు మాధవునకు శ్రీధరనాయకుని బావగారి పుత్రికయ గు మధుమతినిచ్చి వివాహముచేయుటకై నిశ్చయింపఁబడినది. శ్రీసార్వభౌములు విజయంచేసి వధూవరుల నాశీర్వదింప ప్రా ర్థించుచున్నాను. ఇదే విధముగ శ్రీధరుఁడునుగూడ ప్రార్థించె ను. చక్రవర్తి నవ్వుచు, బ్రహ్మానంద శివయోగీంద్రుల వివా హమెల్లర కానందదాయకమే? ఎల్లర నాశీర్వదించిన వారినా శీర్వదించుట విచిత్రముకాదా? అనుటయు, శ్రీధరసింగమనా యకు లొకరిమొగమొకరు చూచుకొని నవ్వుకొనిరి. అంత చక్రవర్తి శ్రీధరునితో నిట్లనియె. శ్రీధరా! నీవుమిక్కిలి య దృష్టవంతుఁడవు. నేటికెల్లర మనోరథంబులుకూడ సిద్ధించినవి. మా కానందమయ్యెను. అన శ్రీధరుఁడు శిరంబువంచి నమస్క రించి ముదలగైకొనియెను. అచ్చటనున్న శ్రీనాథ కవీంద్ర ప్రభృతులను మతగురువులగు లింగధారులను వివాహమున కు రాఁబ్రార్థించియింటికిజనిరి.

పిమ్మట శ్రీప్రతాపరుద్ర సార్వభౌముడు తనయాస్థా నగాయకులను మృదంగాది వాద్యనిపుణులను వారవనితలను

శ్రీధరుని గేహామునకు బోవనాజ్ఞనొసంగెను. వారును చక్రవర్తినానతి శ్రీధరుని గేహంబున కేగి తనుకర్మల నెరవుచుండిరి. మంగళవాద్యములు చెలంగుచుండెను. వీణానిక్వాణంబులు సెలంగెను. పెళపెళమని మృదంగధ్వానములు మ్రోగుచుండెను. వారస్త్రీలు చిత్రనటనంబులు గావించుచుండిరి. సుగంధద్రవ్యములచే నాభవనమంతయును ఘుమఘుమ లాడుచుండెను. కోకిల మధుమతి నలంకరించుచుండెను. జడవేయుట ముగిసినది కోకిల రెండడుగులు వెనుకకునచి జడదిలకించి తనలోతానే సంతసించుచుండెను. మధుమతి ముఖమును గడుగుకొనినపిదప కోకిల శుభ్రవస్త్రంబునదొత్తి కస్తూరీతిలకముంచి కనులకుంగాటుకరేఖలను దిద్దెను. కోకిలామె ముఖమును దిలకించి యిట్లనుకొనినది. కవులువినల ముఖమునకు చంద్రాంబుజంబుల నుపమానముగా జెప్పుచుందురు. ఈరెండునుగూడ నీమె ముఖముతో బోలియుండలేదే? చంద్రుడుకళంకి. ఈమెముఖము నిష్కళంకము. ఆతనికివృద్ధి క్షయములు కలవు. పరిపూర్ణలావణ్యము తప్ప క్షయమీామె ముఖమునగానరాదు. మరియు చంద్రునకు బిలిచిన బలుకుస్వభావములేదు. ఈమెముఖము బిలిచిన నో యని బలుకుచున్నది. మాటలాడుచున్నది. గానము జేయుచున్నది. మందహాస మొనరించుచున్నది. గానచంద్రోపమానము సరిపడుటలేదు. ఇంక జలజమున్నది. ఇది స్నిగ్ధ శీత మృదు లావణ్యాది గుణంబుల గొంతవరకుబో

లియున్నది. కాని ఇదిజడము దీనికిని. మాటలాడుశక్తిలేదు. గాన పద్మోపమానముగూడ సరిపడుటలేదు. దీనికిదియేసాటి అనియనుకొని సమిమనిమిషమునకు నామొముఖమునేయీక్షిం చుచు మురియుచుండెను. ఈయలంకారమంతయుఁదా దిద్దుటవలన గలిగినదని కోకిలతలంపు. పురోహితులు త్వరపెట్టు చుండిరి. ఇంకను నలంకరించుట ముగియలేదు. కోకిలకు తొందరపుట్టె ను. అంతకోకిల కుసుంబారంగుగల యొకజలతారు పట్టుచీర నుదెచ్చి, మధుమతి మేననలంకరింపఁజేసెను. ఇంతలో సుము హూర్తమాసన్నమైనది. మంత్రి సేనానాయక ప్రభృతులు ను విద్వన్మహాజనులును మతగురువులగు లింగధారులునువివా హ వేదికకడ కరుదెంచి కూర్చుండిరి. మతగురువులగు యా రాధ్యులు వెళ్ళుటయా, మానుటయా.యనివితర్కించుకొనిరి కాని చక్రవర్తిగూడ బయలుదేరుటచే బాగుగానుండదని వా రునుబయలుదేరివచ్చిరి. బంధుగులెల్లరును మంటపమునకీవలా వలనిలిచి యుండిరి. మాధవుఁడు పట్టుపీతాంబరములచే నలం కృతుండై మాధవునివలె బ్రకాశించుచుండెను. మిత్రులుతన్ను వీక్షించునపుడు లజ్జాస్మితమును జేయుచుండెను. ఇద్దరుసేవకు లుభయపార్శ్వంబుల నిలువ మాధవుఁడు వారలభుజములపై హస్తంబులూని నెమ్మదిగ నడచుచు మంగళవాద్యములుచెలం గుచుండ వివాహమంటపమున కరుదెంచెను. అంతదాసీజనం బులు మధుమతి చేతులఁబట్టుకొని నెమ్మదిగ నడిపించుచు,

కళ్యాణమంటపమున మాధవునకు వామభాగంబున నిలువం బెట్టిరి. పిమ్మట నానధూవరులను వివాహవేదికపై సుఖవిష్టు లంజేసిరి. మాధవుఁడు కూర్చుండుటకుముందు మధునుతికరం బును గ్రహించి శ్రీనాధకవీంద్రుని సన్నిధకేగి మధునుతితో గూడ నమస్కరించెను. ఓహూ! అనుహాకవి యూనందమేమి చెప్పవలెను. పట్టరాని సంతోషమున సంభ్రాలునలేచి దంపతు లనాశీర్వదించి కూర్చుండెను. పిమ్మట మాధవుడు సూర్యగురు వులకు నమస్కరించెను. వారు తెల్లబోయిరి. మాధవుఁడిట్లు చేయునని వారుత లంచి యుండలేదు. సంతోషమునకు బదు లుగా లజ్జించిరి. కాని దానిని దెలియకుండ నాశీర్వదించిరి. పిమ్మట సభాసదులకెల్లరకును నమస్కరించి వేదికపై కూర్చుం డెను. కోకిల మధునుతి వెనుకనిలిచి యున్నది. విశ్వాసరా యుఁడు జనసమ్మర్దముచే దూరమున నొకచో గూర్చుండెను. మాధవుఁడిద్దర సేవకులనుబంపి తాతను తనచెంతకు రప్పించు కొనియెను. ఇంతలో జందుడుకూడవచ్చి మాధవునిపార్శ్వ మున నిలిచియుండెను. మాధవుఁ డిటునటు బరికించెను. అరు ణప్రభునిజాడ గానరాలేదు. అరుణప్రభుఁడు మాధవుని గది లోనొక్కడును గూర్చునియుండెను. ఆతఁడిట్లు తలంచుకొని యెను. నేను జైనుడను. చక్రవర్తి ఈరుదెంచెను. మతిగురు వు లరుదెంచిరి. నేనటకుబోయిన వాదవివాదమునకు హేతు వగును. ప్రచ్ఛన్నముగ నేనిటనుండుటయె భావ్యము. అనిరి.

మాధవుఁడు తక్షణమే యిద్దరసేవకులం బిలిచి, అరుణప్రభు
డెచ్చటనుండిన నెట్లుండిననట్లు దోడుకొని రండనియాజ్ఞాపించె
ను. వారును భవనమంతయు గాలించి మాధవుని గదిలోఁగూ
ర్చుని యోచించుచున్న యరుణప్రభుని తోడుకొని వచ్చిరి.
మాధవుఁడాతని కొంచెము తనకుదగ్గరగా గూర్చుండఁబెట్టెను.
సభాసదులదృష్టులన్నియు నొక్కమారరుణ ప్రభునిపైఁ బడి
నవి. అంత పురోహితులు మంగళాష్టకంబుల జదువుచు వివా
హవిధిని నెఱపుచుండిరి. ఇంతలో సార్వభౌముఁడంభారిపై వే
చేసి శీఘ్రగాని పీఠిహాకిట నిలిచెను. శీఘ్రరసింగకునాయను
లెదురుగానసని యంభారినుండి దిగుచున్న చక్రవర్తి కేలందిం
చి నెమ్మదిగదింపి చెరియొక చేయియుబట్టుకొని కళ్యాణమంట
పమున నీటొక్కనిపోయి యున్నతాసనమున గూర్చుండఁబెట్టి
రి. సభాసదులనమస్కారములకు జక్రవర్తి తలయుత్తమాంగ
బు నిటునటుగదపుచుండెను. అంత మాధవుఁడు మంగళాష్ట
కంబులు జదువుచుండ మంగళసూత్రమును, మంగళగాత్రియ
గు మధుమతి గళంబునగట్టెను. మంగళవాద్యములు బెల్లున
మోగినవి. అప్పుడు మధుమతీమాధవులమందానందకందలి
తహృదయారవిందములతోడను సంతోషరోమాంచలముల
తోడను నొప్పారిరి. సార్వభౌమునకు మహానంద మొదవెను.
అప్పుడు చక్రవర్తి రత్నవిలసితంబులగు రెండుముక్తాహారంబు
లప్పురోహితుని చేతికిచ్చెను. అంతట నాపురోహితు డారత్నహా

రంబులచేతబట్టుకొని శ్రీ శ్రీమహారాజాధిరాజ శ్రీత్రైలింగ్యరాజ్యరమావల్లభుండగు శ్రీ కాకతీయ ప్రతాపరుద్రదేవ సార్వభౌముండు శ్రీసింగమనాయని ద్వితీయపుత్రుండగు మాధవనాయని వివాహసమయంబున దంపతుల కొసంగిన రత్నముక్తాహారద్వయము అని చదివి మాధవుని మెడలో నొకటివైచి రెండవది మాధవునిచే మధుమతి కంఠంబున నలంకరింపజేసిరి. అంత మాధవుండు మధుమతితో గూడ చక్రవర్తికడకుజని నమస్కరించెను. చక్రవర్తి సంతోషస్వాంతుండై వధూవరుల నాశీర్వదించి యిట్లనియె. ఓ మధుమతీ! నీనుగుణసంపత్తికి నీశ్వరుండు సంతసించి నీవు కోరినవరుని నీకొసంగెను. నాకు మహానంతోషమయ్యెను. అని నాదంపతులు మరల చక్రవర్తికినమస్కరించి యనుజ్ఞనంది విద్వత్కవులకును మతగురువులకును సభాసదులకును నమస్కరించి వేదికపై గూర్చుండిరి. అంతశ్రీనాథ కవీంద్రుండులేచి ఇట్లాశీర్వదించెను.

సీ. చంద్ర చంద్రికలట్లు • శబ్దార్థములభంగి
క్షీరనీరంబుల • చెలిమిపగిది
సూరతేజంబుల • సుస్థిరమైత్రిని
శుచ్యగ్నిహోత్రిల • శోభకలన
కవికవిత్వమువోలె • కథయు కావ్యమువలె
గీతరాగంబుల • గేస్తమట్లు

రసపదార్థంబులు * రాజిల్లువిధమునఁ
పుష్పసౌరభములఁ * బొందుతెఱవు

గీ. మాధవుఁడు మధుమతియు * మైత్రిఁగల్గి
ఆంధ్రసామ్రాజ్యరక్షణ * యఱయుచెప్పు
సార్వభౌమునఁ గన్నిట * సాయపడుచు
చిరతరంబగు కీర్తిని * జెందుఁగాక!

అని యాశీర్వదించి అక్షతలను వధూవరుల శిరంబులపై వేసెను. సభయంతయు నొక్కమారు సంతోషకరధ్వానంబు నొనరించెను. అంత మాధవుఁడు చటాలున సగుణప్రభుని కడకుజని నమస్కరించి, చేతులంబట్టిలేవనెత్తి సభాసదుల నుద్దేశించి యిట్లనియె. ఓ సార్వభౌమా! సభ్యులారా! ఆంధ్రసామ్రాజ్యరక్షణమున నీతఁడొనరించిన మహాత్యాగకార్యములత్యద్భుతములు. ఈతఁడు జైనుఁడు. యువకుఁడు. ఈతనికి దేశాంతరశిక్ష వేయబడినది. ఈతఁడు మతావేశమునకు గుఱియై దేశాంతరగతుఁడయ్యును, దేశాభిమానమే ప్రధానముగాఁ గొని యనేక కష్టములకు లోనై ఢిల్లీలో మారువేషమున సంచరించి శత్రురహస్యములనెల్ల సంగ్రహించి వేషధారులనెల్లఁ బట్టియిచ్చిన మహానుభావుఁడీతఁడే. మరియు దేశాంతరగతులైన జైనులకుఁ బ్రజలకెల్ల సద్బుద్ధిఁగఱిపి యాంధ్రసామ్రాజ్య క్షేమమునకై పాటుపడిన జైనవీరుఁడీతఁడే! మొన్న జరిగిన మహాయుద్ధములో వలదువలదన్నను ప్రాణములకు తెగించి నాతోఁగూడ మహాయుద్ధ మొనరించిన

జైనవీరుడేతఁడే! గణించిన చరిత్రనుబట్టి మీరాలోచించినచో మతావేశమువలన దేశమునకెట్టి యుపద్రవము వాటిల్లెనో! మీకెల్లరికనుభవమయ్యేయున్నది. జైనమతపక్షపాతదోషము, దేశవిద్రోహమొనరించెడి దోషము, నేటికైన సార్వభౌముని సమక్షమునను మతగురువుల సమక్షమునను బోజేసికొనఁగలిగినందులకు సంతసించుచున్నాను. ఇక నైనన్నాతప్పులన్నిటిని క్షమించి నేను నిర్దోషినని యాశీర్వదింప మతగురువులకు సాష్టాంగనమస్కార మొనరించుచున్నాను. అని నమస్కారమొనరించి నాడు చక్రవర్తి తనకొసంగిన మహాఖడ్గము నరుణప్రభునకు బహుమానముగానిచ్చి, యోగానంద రూపధారుడగు చంద్రుఁడొనరించిన సేవనగ్గడించి యాతని గౌరవించి సభాసదులకెల్లరకును నమస్కరించెను. పిమ్మట శ్రీధరసింగమనాయనులు పండితులకును మంత్రిసామంతాదులకును వారివారికి దగుమర్యాదలగావించి ప్రత్యేకముగ మతగురువులను గౌరవించి నమస్కరించిరి. పిమ్మట చక్రవర్తి యంభారిపై నధివశించి సపరివారముగ కోటకు జనియెను. మిగిలిన వారెల్లరును నెవరిబసలకు వారుబోయిరి. ఇట్లు మహావినోదముతో మూడుదినములు గడచినవి. నేడు కంకణవిమోచనోత్సవమును గావించి వధూవరుల నేకశయ్యాగతులం జేయుదురు. మధుమతి శయనమందిర మతిమనోహరముగ నలంకరింపబడియెను. గదియం దంతటను పన్నీరు మొదలగు సుగంధద్రవ్యం

బులు జిలికింపబడియెను. ఇంతలో సాయంసమయమైనది. దీపములు వెలిగింపబడినవి. వధూవరుల డెందములత్యుత్సుకతతోనుండెను.

వారలకు నిమేషమొక మహాయుగముగా గడచుచుండెను. ఇది అతిశయోక్తి కాదు. వారలహృదయములు భావనలకు లోనయ్యెను. అన్యోన్యహృదయదర్పణంబుల వారల దివ్యరూపములు ప్రతిఫలించుచుండెను. చిరకాలసంవర్ధితములగు తమ దివ్యరూపంబుల నేడారాధించి సఫలతనొందవలెనని, యుత్సుకతతోనుండిరి. నేటిమధుమతీ సౌందర్యమువర్ణనాతీతమై యుండెను. ఆపాండుస్మితము, ఆకృష్ణరోమావళి, ఆయర్జునదంతనివహము ఆలవమధ్యంబు, ఆపృథునితంబసంపద, ఆచంద్రనిభముఖమండలముజూచిననామె పుణ్యస్త్రీయమయ స్వరూపిణియని తలంపబడుచున్నది. రాత్రి భోజనములైనవి. మధుమతీ మాధవులు నూత్నవస్త్రాలంకారములచేతను, కర్పూర సుమ హారంబులచేతను, నలంకృతులైరి. పురోహితులు మంగళశ్లోకంబులచే కంకణవిమోచనోత్సవమును

గావించి యాశీర్వదించి మాధవునిచే మధుమతి కరకమలంబు నుబట్టించి శయనాగారమున కంపిరి. పుణ్యస్త్రీలు వధూవరులచే కొన్ని వినోదములనెరపి యందఱును నిష్క్రమించిరి. మధుమతి తలవాల్చి ద్వారమువద్ద నిలుచుండెను. మాధవుడు మంచముపైన గూర్చుండెను. ఆమె కొంచెము తలపైకెత్తి యల్లే నిలిచియుండెను. మాధవుడును నెమ్మదిగ మంచము నుండి దిగి యామెకరంబును గ్రహించి, లోపబ్రివేశపెట్టితలుపులు దగ్గరకుజేర్చెను. మధుమతి తన తలనుపైకెత్తి లజ్జానుందరంబులగు నీలదృష్టుల నాతనినభిషేకించెను. మాధవుడామెను దగ్గరకు జేర్చి, మధుమతీ! నేటికి మనమనోరథములు ఫలించెను——ఇంకను నీవాక్యము పూర్తికాకుండనే కోటనుండొక భటుడు గుఱ్ఱముపై వాయువేగమున బేరెమువారి వచ్చి వీథిలో గుఱ్ఱమునాపి, గుర్రముపైనుండే యో మహారాజ్ మాధవరాయా! శ్రీధరా? చక్రవర్తి శెలవైనది. ఎట్లున్నవటులే రావలయునని ప్రభువాజ్ఞ. అనుచుండగనే కోటలోయుద్ధభేరీ దిశలు బ్రద్దలగునటుల మ్రోగినది. భయంకరంబగు నాధ్వానమును ఆతురతతో గూడినచక్రవర్తి యాహ్వానరవంబును నొక్కమారుగ మాధవుని చెవింబడ యులికిపడి నిశ్చేష్టితుడయ్యెను. మధుమతి గడగడ వడంకుచు మాధవునిగట్టిగ కౌగలించుకొనియెను. ఎంతయుత్సాహ భంగమెంతయాశాభంగము. ఆనూత్నదంపతుల కోరికలంతర్హితములయ్యెను.

మధుమతి కన్నీటిచే మాధవుని వక్షమును దడుపుచుండెను. మాధవుడు గద్గదికస్వరముతో మధుమతీ! విడువుము. పోయి వచ్చెదను?

మధు—అయ్యో! నాథా! ఎచ్చటికి?

మాధ—యుద్ధమునకు—

మధు—హా! దైవమా? మరలయుద్ధమా?

మాధ—ఔను!

మధుమతి హా! యని యరచినేల కొఱిగినది. అయ్యో! పాపము! మాధవుడేమిసేయును? మధుమతి మధురమంజుల ప్రియవాక్యంబుల నానందింపగోరు మాధవునకు వీరులహుంకార ధ్వనులు, శ్రుతిగోచరంబులగు చుండెను. కటకంకణ కుంజులరావంబుల వినోదింపగోరు మాధవునకు నిశితకరవాల సంఘర్షణధ్వానంబులు కర్ణకఠోరములై వినంబడుచుండెను. అంత మాధవుండామెను శయ్యపై జేర్చి, శీతోపచారంబులసే దదేర్చి ధైర్యముగొలిపి, యోదార్చి కరంబుముద్దిడి కన్నీటిం దుడిచి యోపియపత్నీ! మధుమతీ! దుఃఖముడిగి యనుజ్ఞనిమ్ము దేశభక్తులకు మాతృదేశ సంరక్షణమున జంకుటుచితముకాదు. జీవితము లనిత్యములు. ఈసుఖములు తాత్కాలికములు అనుజ్ఞఇమ్ము మధుమతీ! త్వరితముగ పంపుము. ప్రాణేశ్వరీ! అన మధుమతి చటాలునలేచి మాధవునకు నమస్కరించి నాథా? ఈమహోత్కృష్టకార్యమునకే సద్గుతేగులు దానను కా

ను. ఆడుదాననని శంకించకుండు రేని నేను కూడ మీతో-మూ భఫుడా మాటకష్టమువచ్చి మధుమతి నాలింగనమొనరించు కొని సంతోషముతో మధుమతీ! ఈశరీరములో నర్ధభాగము నీయది. నేనేగిన నీవును వచ్చినట్టులే? పోయివచ్చెదనని పలికి చటాలున గదినుం డీవలకువచ్చి శ్రీధరసింగమనాయసలతో గుఱ్ఱము నెక్కి కోటకుఁ బరువెత్తెను.



## ముప్పది తొమ్మిదవ ప్రకరణము.

ఆంధ్రుల విజయంబును, మహమ్మదీయుల పరాజయం బును రామచంద్రదేవున కత్యాశ్చర్యమును గలిగించెను. ఈ యుదనుజూచి ఢిల్లీచక్రవర్తికి తానుకట్టవలసిన కప్పమును గట్టుటమానెను. అల్లాయుద్దీన్ కోపోద్దీపితుడై మండిపడిపోవు చుండెను. ఆతనికి మహారాష్ట్ర త్రిలింగ్య దేశముల రెంటిని గా ల్చివేయవలయునను తలంపు పుట్టెను. ముప్పదివేల గుఱ్ఱపు దళమును, లక్షకాల్బలమును సిద్ధముజేసి మల్లిక్ కాఫురునే సై న్యమున కంతకు నధిపతిగా జేసి మరల నాతనినే మహారాష్ట్ర త్రిలింగ దేశములకు బంపెను. పరాభూతుఁడనై తినను చింత యావంతయునులేక విశ్రాంతియైనగొనక మరల వెంటనే మళ్లి

కాపురత్యుత్సాహముతో సైన్యంబుల వెంటబెట్టుకొని తోవ సంగల పల్లెలను బట్టణంబులను దోచుకొనుచు దేవగిరికివచ్చి దుర్గమును ముట్టడించెను. మహాసమ్మర్దమగు సైన్యములకు భయపడి రామచంద్రదేవుడు మల్లిక్ కాఫురునకు లొంగిపోయెను. మల్లిక్ కాఫురు రామచంద్రదేవుని చెఱబట్టి ఢిల్లీకిబంపి వేసెను. పిమ్మట మహాసైన్యంబులతో విజయోత్సాహియై యోరుగల్లునకు బయలుదేరెను. ఈవార్త ప్రతాపరుద్రునకుఁ దెలిసినది. అతఁడు సంభ్రమముతో యుద్ధభేరిని మ్రోగింపనాజ్ఞయొసంగి మాధవశ్రీధరులకై వెంటనే భటుని బంపెను. పిమ్మట మాధవ శ్రీధర సింగనునాయకులు కోటకేగుటయు చదువరులకుఁ దెలిసియేయున్నది. ఈవీరపురుషులు ముగ్గురొక నిమిషములో కోటలో చక్రవర్తికడ ప్రత్యక్షమైరి. మాధవుని వివాహమునకై వచ్చినమంత్రి సామంత సేనానాయకప్రిభృత్యులెల్లరును నగరమునందే యుండిరి ఈభేరీనినాదమునకంద రాశ్చర్య చకితులై కోటకు బరువెత్తి చక్రవర్తికడ బ్రత్యక్షమైరి. అన్నమదేవుఁడుగూడ చటనేయుండెను. మరలవెంటనే యిట్టిమహాయుద్ధముదాపరించుటచే చక్రవర్తి భీతావహుఁడై యుండెను. ఆతనింగాంచి మాధవుఁడిట్లనియె, మహారాజా! మీరేల భీతినొందెదరు. ఇంతమంది మహాయోధులు మీయండనుండ మీకేటిభయము? మామేన బ్రాణంబులుండునంతవరకు మ్లేచ్ఛులాంధ్ర

దేశమున నడుగుబెట్టలేరని నమ్ముము. మనయదృష్టవశంబు
న సైన్యసమేతులై సకలసేనాను విచ్చటనే యున్నారు. అని
పత్రితాపరుద్రుఁ డిట్లనియె. మాధవా! నీవనమానింపబడియు,
యోగిరూపంబున మాకును దేశమునకునుగూడ మహోపకా
రమును గావించితివి. నీవిశ్వాసమును మేమెన్నటికిని మరచు
వారముకాము. అనిపలికి మరల నన్నమదేవునే సకలసైన్యా
ధ్యక్షునిగ నొనరించి మాధవునినాతనికి సహాయముగ నొసం
గి, శ్రీధరసింగమనాయని మేచనాయనాదులను సైన్యసమే
తముగా బంపెను. కొంచెము ముందుగా నీవార్తదెలియుటచే
నన్నమదేవుఁడు వడివడి సైన్యములనెల్ల గోదావరినిదాటించి
సరిహద్దులలో మహమ్మదీయ సేనానియగు మల్లిక్కాఫురుని
దాకెను. అరుణప్రభుడు మాధవుఁడు తన్నుబిలువకుండ యు
ద్ధమునకు బోవుటచే విచారించి గుర్రమునెక్కి యొకానొకని
గోదావరినిదాటి మాధవునిగలుసుకొనియెను. మాధవుఁడు
తొందరలో నరుణప్రభుని బిలుచుట మఱచినాడు. అహాత్తుగ
నీతనిజూచి కరస్పర్శన మొనరించి యన్నమదేవుని వెనుకనే
సైన్యముల బురికొల్పుచుండెను. అంత మహమ్మదీయులకును
నాంధ్రులకును మహాఘోరసంగ్రామము వాటిల్లినది. ఉభయ
సైన్యంబులును వీరావేశంబుతో బోరాడుచుండిరి. వేలకొలది
వీరభటులా సంగ్రామమున నేలగూలుచుండిరి. నిశితకరవాల
ములు జీవరక్తమును గ్రోలుచు నాకసమున నృత్యములుసలు

వుచుండెను. రణరంగ మంతయు రక్తసిక్తమై యతిభీకరమై యొప్పారుచుండెను. శరీరములు జల్లెడవలె జిల్లులుపడి రక్తధారలు జిమ్ముచున్నను, హుంకృతుల జేయుచు, దాటుచు, వీరభటులు వీరవిహారమును గావించుచుండిరి. ఆహా! ఏమియా యాంధ్రవీరుల పౌరుషము. ఎత్తినకత్తి మరల దింపుటలేదు. ముందుబెట్టినపాదమును వెనుకకుం బెట్టుటలేదు. తమనిండుప్రాణంబుల రణభూమికి బలియిచ్చుచుండిరి. గాని మహమ్మదీయుల నొక్కయడుగైనను ముందునకు బెట్టనిచ్చుటలేదు. వాసంజేసి యాంధ్రవీరులు వేలకొలది రణభూమింగూలిరి. కాని కొంతవడికి మహమ్మదీయు లాంధ్రులధాటికి నిలువంజాలక వెనుకంజ వేసిరి. అంత మల్లిక్ కాఫురు నిలువజాలక మిగిలినసేనతో ఢిల్లీకి బారిపోయెను. పిమ్మట అన్నమదేవ మాధవప్రభృతులు సైన్యంబుల మరలించుకొని జయజయ ధ్వానంబులునింగిముట్ట విజయపతాకంబులతో నోరుగల్లు దుర్గమును బ్రవేశించిరి. అంత చక్రవర్తి సంతోషముతో మాధవాదులగౌరవించి వారల నాలింగనముజేసి కొనియెను.

ఇట శ్రీధరుని యింట మధుమతి కుత్సాహమేమియునులేదు మధ్యాహ్నము భోజనమైనది మొదలు దక్షిణపు వసారాలోనే తిరుగుచుండెను. మాధవుని కనులు కఱవుదీఱ సిగ్గువిడిచి కొన్నినిమిషములైనను జూచియుండలేదు. ఇంతలో దారుణముగనతాత్తుగ నీపాడుయుద్ధము దాపరించినది. తండ్రియు, మా

మరియు, మాధవుడును గూడ యుద్ధభూమి కేగిరి. జయాపజయం బులెట్లుండునో వారుమరల నేగతిని నిల్లు జేరుదురోయను భయమున నామెకు చిత్తస్వాస్థ్యమేమియును లేదు. నిమిషనిమిషమునకు వీధిని దొంగిచూచుచుండెను. అంత మహమ్మదీయులను జయించి మాధవాదులు వచ్చుచున్నారను కేకవినవచ్చినది. అదివిని యామె హా! దైవమా బ్రతికించితివని నొకగంతువైచినది. కొంతవడికి మాధవాదులు చక్రవర్తికడ శలవు గైకొని గుఱ్ఱములనెక్కి యింటికివచ్చుచుండిరి. మధుమతి వారలగాంచి సంతోషముతో దండ్రిని బలుకరించునెపమున వీధిగుమ్మముకడ కరుదెంచి తండ్రిచేయి బట్టుకొని లోన బ్రవేశించెను.

---

## నలుబదనప్రకరణము.

రుక్మిణీవిశాలాక్షులు వికాసవదనములతో శ్రీధరసింగమనాయిన మాధవ రాయలకెదురుగవచ్చిరి. అందరునొక నిమిషము పడమటిమహాలులోనాగి కుశలప్రశ్నలతో లోని కేగిరి. శ్రీధరునితోగూడ మధుమతి తండ్రిగదిలోనికేగుచు, వెనుదిరిగిచూచెను. మధుమతి యడుగులు వడివడిముందున కుబడుటలేదు. ఆమె యట్లే వెనుదిరిగిచూచుచు నెమ్మదిగ

నడచి శ్రీధరునిగదిలోఁ బ్రవేశించెను. శ్రీధరుఁడు పేషము నుదీయ మధుమతి, యందుకొని పాగాకొయ్యకు దగిలించెను. మాధవుఁడు మహాలులోనిటునటు పచాళిచేయుచుండెను. ఆతనికి తనదుస్తులనెచ్చటుంచుకొనవలయునో తెలియుటలేదు. తానిదివరకును వాడుకొనుచుండిన మంచముకాని కుర్చీకాని యచటలేవు. అతఁడొక చిన్నమందహాసమొనరించి కూనిరాగము దీయుట కారంభించెను. ఏమిపాడుచుండెనో, ఎందులకు బాడుచుండెనో యాతని కే తెలియదు. ఆపాటకునియమము లేదు. ఉద్దేశ్యములేదు. అదియొక రాగమనికూడ చెప్పవీలులేదు. రుక్మిణేమియో యడుగ శ్రీధరుడేమియో చెప్పుచుండెను. ఇంతలో విశాలాక్షీ సింగమనాయనలుకూడవచ్చిరి. అందరును గూర్చుని యుద్ధవార్తలను జెప్పుకొనుచుండిరి. ఈ సందడిలో మధుమతి యటనుండి నెమ్మదిగజారి తనగదిలోనికి బోయి పడమటి మహాలులోనికున్న తలుపులను దెఱచి గుమ్మమువద్ద నిలిచి యుండెను. మాధవుని సంగీతమాగినది. అతఁడు రెండడుగులు ముందునకువచ్చి యిచ్చట నామంచమేమయినదో? యనెను.

అదివిని మధుమతినవ్వెను. ఆనవ్వుయొక్క యర్థమును మాధవుఁడు గ్రహించి మఱలనవ్వి, నాదుస్తుల నెచ్చటనుంచుకొనవలయునో? అనియెను.

మధుమతి ముఖమునమరల చిరునవ్వలంకరించెను. ఆమె

యుట్లనియె, ఈగదిలోనుంచుకొనవచ్చును.

అని మాధవుఁడునవ్వి, గదిలోఁబ్రవేశించెను. మధుమతియు లోనికేగి మంచమునకు జేరఁబడినిలిచినది. మాధవుఁడు తన శిరోవేష్టమునుదీసి చేతబట్టుకొనియెను. మధుమతి చేయి జాచి దానినందుకొని బల్లపైనుంచెను. అతఁడంగినిదీయ దానినందుకొని గోడకుతగిలించెను. మాధవుఁడు కుర్చీపై గూర్చుండెను. మధుమతి యొకవిసనకఱ్ఱను కేలనందుకొని యాతని పార్శ్వమున నిలిచి విసరుచుండెను. మాధవుఁడు నవ్వుచు మధుమతీ! నీవు తిరిగివెంట నేవచ్చితివేమి?

మధు—(మందహాసముతో) నేనువెంటనే రాకున్న మీయుష్ణీషమునకు జోటెక్కడిది? మీయుడుపుల నెచట నుంచుకొందురు?

మాధ—మామయ్యగదిలో నొక్కరే యుండిరి కాబోలునే?

మధు—మాఅమ్మయు మీయమ్మయుగూడ నట యుండిరి.

మాధ—(నవ్వుచు) నిజమే? నీవురాకున్న నాయుడుపులకు జోటుదొరకక పోయెడిదే?

మధు—(చెదరి ముఖముపై బడుచున్న మాధవునిముంగురుల నొకచేత సవరించుచు) నాథా! చాలయలసినట్లున్నారు. మంచముపై బరుండిన పాదంబులొత్తు—

మాధ—(విసరుచున్న మధుమతికరంబును గ్రహించి హృదయమున జేర్చుకొని) మధుమతీ! ఇప్పుడం తెక్కుడాయా సమేమియు నులేను. నీవు నా చెంతను—

ఇంతలో విశ్వాసరాయుడు చేతికర్రచే నేలంగొట్టుచు అమ్మా! మధుమతీ! ఏమిచేయుచున్నావని మధుమతిగదిని సమీపించెను. మాధవుడు మధుమతి నుపేక్షించెను. మధుమతి మాధవునకుఁ గనుమీటి విసరుచు నట్లే నిలిచియుండెను. మరలవిశ్వాసరాయుడమ్మా! మధుమతీ! యనిపిలిచెను. మధుమతి నవ్వుచు— తాతా! లోనికిరమ్ము! అన విశ్వాసరాయుడు లోనబ్రవేశించి, ముఖముపై జేయునడ్డముగనిడి దృష్టి నిగుడించి, అమ్మా! వారెవరు?

మధు—తాతా! వారెవరో చెప్పుకొనుము?

విశ్వా—(రెండడుగులు ముందునకువచ్చి) బిడ్డా! నే నానవాలు పట్టలేనను కొంటివా యేమి? మాధవరాయులు కారా?

మధు—తాతా! బాగుగా నిదానించి చూడుము. అప్పుడే మరచిపోతివా? వీరు బ్రహ్మానంద శివయోగీంద్రులు కారా?

నేడు విశ్వాసరాయునకుఁ గలిగిన యానందమునకు మితిలేకుండెను. మధుమతీమాధవులిట్టులు వినోదముగనుండఁ జూడగల్గినందులకు ధన్యుడనై తనను కొనియెను. తానెవ తెను

బిడ్డగాఁ జూచుకొనుచుండెనో యట్టిమధుమతి నేఁడు సంపూర్ణవికాసముతో మాధవుని జెంతనుండఁ గాంచినప్పు డాతనియానందమెట్లుండునో వర్ణింప నెవరితరము. ఆతఁ డిట్లనియె.

విశ్వా—బిడ్డా! బాగుగనే చూచితిని. ఇప్పుడాతఁడు నిజమగుమాధవుని వలె నున్నాఁడు. ఆతనిబ్రహ్మానందనామమును నేనుగ్రహించితి. మీయానందరూపముల జూడగనే బ్రహ్మానందమొందఁ గలిగితిని. బిడ్డా! ఇటుచూడుము. ఇన్నియేండ్లుగడచినను నాకు వివేకములేదు. సమయమును జూచుకొనక బిలచినను బిలువకపోయినను చటాలున లోనఁ బ్రవేశించుచుందును. ముదుసలులకువచ్చిన కర్మమేయిది. అమ్మా! మగలవచ్చెదను—అని విశ్వాసరాయుఁడు వెనుదిరిగి పోవుచుండెను. మధుమతి నవ్వుచు తాతా! పోవకుము? ఇదినీకు రాకూడనిసమయముకాదు. నిన్ను నేరము ంటిని రాకూడ్చుండుము.

విశ్వా—నీవు రమ్మనక పొమ్మనియెదవా?

ఇంతలో శ్రీధరుఁడు మాధవాయని పిలిచెను. మాధవుఁడా ఆ యని పలికి కుర్చీనుండి లేచినవ్వుచు తాతా! నేనిక్కడనుంటినని యా పొమ్మెదనను చున్నావు. అట్లయిన నిదిగో నేనే పోవుచున్నాను. మీరిద్దరును గలిసి నామీఁద నేరములను జెప్పుకొందురు కాబోలును.

విశ్వా—తప్పక నేరములే చెప్పుకొనియెదము! నీవిది నరకీనగరంబున నేయుండి మధుమతిని పలుబాముల బెట్టితివి

నీవు కనబడకుండ నుండినంత కాలము పెద్దకష్టమునందు నుండితిమైన నినుమరువగదు. కాళ్లీడ్చుకొనుచు, కట్టుబట్టతోగాని నాయెదుటికి వచ్చినప్పుడు పెద్దవాడననియైన నలంచక యెవ్వనాటు రెండు మాటలుతిట్టి, యదార్థమును జెప్పవైతివి! ఇట్టిస్థితిలో నీమీద నేరములు చెప్పుకొనకుండ నెట్లుండగలుగుదుము!

మధు—తాతా! నీవుపిచ్చివాడవు. యోగులపై నేరములను చెప్పుకొనిన ప్రయోజనమేమైన గలదా! మనమేమి చెప్పుకొందుమో వారికి దెలియదనుకొంటివా?

ఇంతలో విశాలాక్షి నాయనా! మాధవా! యనిపిలిచెను. మాధవుండు చటాలున లోనికేగి ఏమమ్మా! యన మామయ్య స్నానముజేసి నీకొరకు కనిపెట్టుకొని యున్నాడు. ఇంతదనుక స్నానముచేయ కేమిచేయుచున్నావనన మాధవుండు మారుపలుకకయే స్నానగృహంబునకేగి స్నానమాచరించి శుభ్రవస్త్రముల ధరించి మామతో భోజనశాలకు బోయెను. భోజనములైన పిమ్మట నందరును దక్షిణపు వసారాలో గుర్చులపయిఁ గూరుండి వార్తలను జెప్పుకొనుచుండిరి. ఇంతలో మధుమతి భుజించి వసారాలోనికివచ్చి తండ్రిచెంతనిలిచి విసనకర్రచే విసరుచుండెను. నేడు శ్రీధరుని హృదయము మహదానందమున తాండవమాడుచుండెను. అంతరుక్మిణీ విశాలాక్షులొకపై పళ్లెరములో పలువిధభక్ష్యంబులనుంచి యాపళ్లెరమును కోకిలచేతికిచ్చి యందరునుగలసి దక్షిణపువసారాలోనికివచ్చి

న. కోకిల కూజితధ్వనము నను మతి గదిలోనుండి యీవలకు వచ్చెను. అంతట రుక్మిణి నాథా! మీరలీదినంబున చాలయలసి యున్నారు. గదిలో శయ్యాస్థానము చేయబడియున్నది. వచ్చెద నుండెద రాయన, శ్రీధరుండు లేచి లోనికేగెను. సింగనునాయ నుండుగూడ తనశయ్యకుబోయెను. అంతరుక్మిణి మధుమతీ! చాలరాత్రియైనది. లోనికిబోయి పరుండుమని చెప్పి విశాలా క్షితోగూడ లోనికేగెను. మధుమతి తనగది గడపదగ్గరకు బోయినిలుచుండెను. మాధవుండు కుర్చీనుండి కదలలేదు. అతం డింకఅటునే చూచుచునే యున్నాండు కాని మధుమతిలేచి గదిలోనికిబోవుచున్నప్పుడు కనులుమూసికొనియెను. మధుమ తిగ్రహించి నవ్వుచు, నొకచిన్నటిబుడ్డినిదెచ్చి మాధవునిపై జల్లెను. మాధవుండులికిపడినట్లులేచి కూర్చుని వసారాలోవా నకురియునా? యనియెను. మధుమతి నవ్వుచు నౌననియెను. మాధవుండు మరలనవ్వుచు, ఆగదిలోగూడ వానకురియునా? అన మధుమతి ఔననియెను.

మాధవుండు గుభాలున కుర్చీనుండిలేచి, మధుమతి కరంబునుగ్రహించి మధుమతీ! నమ్ము చూతమటవర్ష మెట్లుం డునోయని మధుమతితోగూడ గదిలో బ్రవేశించెను. మధు మతి తలుపులకాలోవ గొండెము వేసెను. శ్రీ శ్రీ శ్రీ.

సమాప్తము.